మొట్టమొదటిసారిగా సుప్రసిద్ధ మహిళ
రచయిత్రితో వ్రాయబడిన

# స్త్రీల వ్రతకథలు

(16తిథి మాహాత్మ్యములు-వైశాఖ,కార్తీక, మార్గశిర మాసమాహాత్మ్యములతో)

AN FIRST BOOK WRITTEN BY LADY WRITER ON 108 LADIES VRATHA STORIES

అనువాదము
"ఆర్ష హృదయాభిజ్ఞ" ఆధ్యాత్మిక సాహితీరత్న
"ఆధ్యాత్మిక తత్త్వ వారధి" "సాహిత్య రోహిణి"
డాక్టర్ రోహిణి వేంకట సుందర వరద రాజేశ్వరి
(మెంబర్ - శ్రీ హంపీ విరూపాక్ష విద్యారణ్య మహాపీఠమ్)



ప్రకాశకులు : ☎ 246 2565

**మోహన్ పబ్లికేషన్స్**

అజంతా హోటల్ ఎదురుగా,
కోటగుమ్మం, రాజమండ్రి - 533 101.

కాపీరైట్ 2012 వెల : 90-00



## స్త్రీలవ్రతకథలు

(16తిథి మాహాత్మ్యములు-వైశాఖ,కార్తీక, మార్గశిర మాసమాహాత్మ్యములతో)

అనువాదము :
**డా॥ రోహిణి సుందర వరద రాజేశ్వరి**
ఫస్ట్ లేన్, భారత్‌పేట
డోర్.నెం.4-16-163, గుంటూరు-2
ఫోన్ : (0863) 2244184



టైటిల్ డిజైన్ :
ఎన్. లోకేష్

**మోహన్ పబ్లికేషన్స్**
కోటగుమ్మం, రాజమండ్రి - 533 101.

2

# పంద్రెండు మాసములందు వచ్చు వ్రతములు

## చైత్ర మాసవ్రతములు

### 1. నవసంవత్సర ప్రారంభము

**(చైత్రశుక్ల ప్రతిపదాతిథి) (పాడ్యమి)**

నూతన సంవత్సర ప్రారంభమున సమస్త పురుషార్థ సిద్ధి కొరకు దుర్గను పూజించు విధానము వచ్చును. అనంతరము శ్రీరామనవమి శ్రీరామచంద్రుని జన్మ ప్రసంగము వచ్చును. వివిధ తిధులందు వివిధ శక్తులు ప్రాదుర్భావమయ్యెను. ఏకాదశీతిథులందు వైష్ణవి, శివరాత్రి యందు శైవి, నవరాత్రియందు దుర్గ, రామనవమి యందు శ్రీరాముని శక్తులు ప్రకటమయ్యెను.

అమావాస్య తిథియందు పితరుల ప్రాణములు వ్యాపించియుండును. అదే విధముగా ఏకాదశి, శివరాత్రి రామనవమి ఆది తిథులందు వివిధ శక్తులు సంచరించుచుండును.

చైత్రశుక్ల పక్షము బహుమహత్తుగలది. ఇందు ఆదిశక్తి నవరాత్రి వ్రతము గలదు. శ్రీ దుర్గాసప్తశతిని పఠించిన ఆధ్యాత్మిక ఆది భౌతిక దోషములపై విజయము లభించును. లోకేశ్వరి పూజానంతరము, శ్రీరామనవమినాడు శ్రీరామచంద్రుడు అవతరించి దానవ శక్తులను మర్దించి సత్పురుషులను సంరక్షించును. రామనవమీ వ్రతము రామజన్మోత్సవము భగవానుని పూజించుటయు చేసిన ప్రాణులకు దివ్య శక్తులు గలుగును.

చైత్రమాస శుక్లపక్ష ప్రతిపదాతిథి నుండి నూతన సంవత్సరము ప్రారంభమగును. ఇది అతి పవిత్రమైన తిథి. ఈ తిథి నాడే పితామహ బ్రహ్మదేవుడు సృష్టి నిర్మాణము ప్రారంభించెను. ప్రతిపదాతిథి రేవతీనక్షత్రమందు విష్కుంభ యోగమందు సూర్యోదయ సమయమున భగవానుని ఆది అవతారమైన మత్స్యరూపము ప్రాదుర్భవించెను. యుగములందు మొదటిదైన సత్యయుగముకూడ ఈ తిథి యందే ప్రారంభమయ్యెను. ఈ దినముననే సామ్రాట్ చంద్రగుప్త విక్రమాదిత్యుడు శకములపై విజ యము పొందెను. అదే చిరస్థాయిగ విక్రమనామ సంవత్సరముగ ప్రారంభమయ్యెను. ఈ దినమున నిత్యకృత్యానంతరము తైలము పూసుకొని స్నానాదులాచరించి అక్షతలు గంధపుష్పాది జలములతో దేశకాలములను ఉచ్ఛరించి ఈ విధముగ సంకల్పము చేయవలెను.

**మమ సకుటుంబస్య సపరివారస్య స్వజన పరిజన సహితస్య నా ఆయురారోగ్యైశ్వర్యాది సకల శుభఫలోత్తరోత్తరాభివృద్ధర్థం బ్రహ్మాది సంవత్సర దేవతానాం పూజన మహంకరిష్యే ।**

అని సంకల్పముచేసి, చదరమైన నాలుగుకాళ్ళ పీటపై శ్వేత వస్త్రమును పరచి దానిపై పసుపు కుంకుమ అక్షతలతో అష్టదళ కమలమునువేసి దానిపై



బ్రహ్మదేవుని సువర్ణప్రతిమను స్థాపించవలెను. గణేశాంబికను పూజించి బ్రహ్మణే ఓ నమః అను మంత్రముతో బ్రహ్మదేవుని ఆవాహనాది షోడశోపచారములతో పూజించవలెను. పూజానంతరము ఉత్తమమైన సాత్త్విక పదార్ధములతో బ్రాహ్మణునకు భోజనముపెట్టి అనంతరము తాము భుజించవలెను.

ఈ దినమున పంచాంగ శ్రవణముచేయవలెను. ఆ సంవత్సరమున రాజు మంత్రి సేనాధ్యక్షాదుల సంవత్సర ఫలితములను శ్రవణము గావించవలెను. శక్త్యానుసారము పంచాంగములను దానముచేయలెను. చలివేంద్రములను స్థాపించవలెను. ఆ దినము నూతన వస్త్రములను ధరించవలెను. గృహమును ధ్వజపతాక తోరణములతో అలంకరించవలెను. వేపపూతతో ప్రసాదము చేయవలెను. దీనిలో బెల్లము, చింతపండు, ఉప్పు, వాము, జీలకర్ర, మిరియాలు పొడిచేసి వేపపూతలో కలుపవలెను. ఇది ఆరోగ్యమును చేకూర్చును. ఈనవరాత్రులలో ఘటమును స్థాపించి వ్రతమును చేయవలెను. ఈ వ్రతమందు నదీసరోవరములందుగాని, లేక గృహమందు గాని స్నానముచేసి సంవత్సరమూర్తిని చైత్రాయనమః, వంసతాయ నమః, మొదలగు నామములతో పూజించవలెను. అనంతరము విద్వాంసుడైన బ్రాహ్మణుని పూజించ వలెను.

### 2. వసంత నవరాత్రులు

**(చైత్రశుక్ల ప్రతిపదాతిథి నుండి నవమి వరకు)**

చైత్ర ఆషాఢ ఆశ్వీయుజ మాఘమాసములందు శుక్లపక్ష ప్రతిపదాతిథి నుండి నవమివరకు తొమ్మిది దినములను నవరాత్రులందురు. ఈ విధముగ సంవత్సరములో నాలుగు నవరాత్రులుండును. వీనిలో చైత్రమాసమందొచ్చు నవరాత్రులను వాసన్తిక (వసంత) నవరాత్రులందురు. ఆశ్వీయుజ నవరాత్రులను శారదీయ (శారద) నవరాత్రు లందురు. వీనిని దేవీ నవరాత్రులందురు.

స్నానానంతరము పూజించు స్థానమును గోమయముతో పవిత్రముగావించవలెను. అనంతరము ఘటమును స్థాపించవలెను. ఇది ప్రాతఃకాలమందే చేయవలెను. కాని చిత్రా మరియు వైధృతి యోగసమయమున ఘటమును స్థాపించక మధ్యాహ్న సమయమున అభిజిత్ ఆది శుభముహూర్తములందు ఘటమును స్థాపించుట ఉచితమైనది. ఈ నవరాత్రులను స్త్రీ పురుషులు ఇరువురు చేయవచ్చును. స్వయముగ చేయలేనిచో పతిని పత్నిని పుత్రుని లేక బ్రాహ్మణునైనను ప్రతినిధిగ చేసుకొని వ్రతమును చేయవలెను. వ్రతమందు ఉపవాసము చేయవలెను. చేయలేని వారు ఒక్కపూటయైనను ఉపవాసముండవలెను.

ఘటస్థాపనకు మట్టితో వేదికను నిర్మింపవలెను. దానిలో జొన్నలు, గోధుమలు వేయవలెను. దానిపై మట్టిదిగాని ఇత్తడిదిగాని వెండిదిగాని బంగారుదిగాని యధాశక్తిగ కలశమును స్థాపించవలెను. గణేశాంబికను వరుణుని షోడశమాత్రుకలను సప్త ఘృత మాతృకలను నవగ్రహాది దేవతలను పూజించవలెను. పుణ్యాహవాచనను బ్రాహ్మణునితో చేయించవలెను. లేనిచో స్వయముగ చేసుకొనవచ్చును.

కలశముపై దేవీమూర్తిని స్థాపించి షోడశోపచార పూజలను చేయవలెను. అనంతరము శ్రీదుర్గాసప్తశతిని పఠించవలెను. పూర్ణాహుతి దినమున దశాంశ హవనమును దశాంశ పఠనమును గావించవలెను. పూజా సమయమున నేతితో దీపమును వెలిగించవలెను. గంధపుష్ప అక్షతాదులతో పూజించి ఈ విధముగ మంత్రమును పఠించవలెను.

**భోదీప బ్రహ్మరూపస్త్వం హ్యంధకార నివారక ।**
**ఇమాం మయా కృతాం పూజాం గృహాణంస్తేజః ప్రవర్ధయ ॥**

కొందరు దీపమును గోడలపై, గుమ్మములపై పెట్టెదరు. నేతిదీపముతో అగ్ని జ్యోతిని పూజించెదరు. అష్టమి వరకు గాని లేక నవమి వరకుగాని ఈ విధముగా చేయుదురు.

కుమారీపూజ నవరాత్రులందు ప్రధానమైనది. బాలికలు జగదంబకు ప్రత్యక్ష స్వరూపులు. శక్తియున్నవారు తొమ్మిది దినములు తొమ్మిదిమంది బాలికలను, లేని వారు ఏడుగురిని గాని, ఐదుగురునిగాని లేక ముగ్గురిని గాని లేక ఒక్క బాలికనైనను దేవిగా భావించి పూజించి భోజనము పెట్టవలెను. వీరు బ్రాహ్మణ కన్యలైన ప్రశస్తము. ఆసనమువేసి, బాలుని (వటుకాయ) గణేశుని అందరిని ఒకేపంక్తిలో కూర్చుండబెట్టి మొదట ఓం గం గణపతయే నమః అని గణేశుని పూజించవలెను. ఓం వటుకాయ నమః అని బాలుని పూజించవలెను. ఓం కుమార్యై నమః అనుచు కన్యలను పంచోపచారములతో పూజించవలెను. అనంతరము ఈ విధముగా కుమారికలను ప్రార్థించవలెను.

**మంత్రాక్షరమయీం లక్ష్మీం మాతృణాం రూపధారిణీం ।**
**నవదుర్గాత్మికాం సాక్షాత్ కన్యామావాహయామ్యహమ్ ॥**

**జగత్పూజ్యే జగద్వన్ద్యే సర్వశక్తి స్వరూపిణి ।**
**పూజాం గృహాణ కౌమారి జగన్మాత ర్నమోఽస్తుతే ॥**

అని ప్రార్థించవలెను. కొన్నిచోట్ల అష్టమి నుండి నవమి వరకు ఒక అండా (లేక కాగుగాని బాండీగాని) నిండుగ హల్వా చేసి దానిని దేవి ఎదుట ఉంచి పూజించు విధానము కలదు. హలవా అండాయందు ఒక గరిటె నుంచవలెను. అండాకు షోడశోపచారపూజలుచేసి ఓం అన్నపూర్ణాయై నమః, అను మంత్రముతో పూజించవలెను. అనంతరము దీనిని దేవికి నైవేద్యముగ సమర్పించవలెను. అనంతరము కన్యలకు భోజనముపెట్టి యథాశక్తిగ వస్త్రాభూషణములను దక్షిణ తాంబూలమును ఇవ్వవలెను.

తొమ్మిది రోజులైన తరువాత పదియవ రోజున దేవిని పూజించి విసర్జించవలెను.





**రూపందేహి యశోదేహి భాగ్యం భగవతి దేహిమే ।**
**పుత్రాన్ దేహి ధనందేహి సర్వాన్ కామాంశ్చ దేహి మే ॥**
**మహిషఘ్ని మహామాయే చాముండే ముండమాలిని ।**
**ఆయురారోగ్య మైశ్వర్యం దేహి దేవి నమో ఽస్తుతే॥**

ఈ విధముగా దేవిని ప్రార్థించి విసర్జించవలెను.

**గచ్ఛ గచ్ఛ సురశ్రేష్ఠే స్వస్థానం పరమేశ్వరి ।**
**పూజారాధనకాలే చ పునరాగమనాయ చ ॥**

దేవీ నవరాత్రులందు దేవీ భాగవతమును, కాళికా పురాణమును, మార్కండేయ పురాణమును పఠించెదరు. మరికొందరు శ్రీరామచరిత మానసమును, శ్రీమద్వాల్మీకీ రామాయణమును, ఆధ్యాత్మ రామాయణమును పఠించెదరు.

## 3. శ్రీరామనవమి (చైత్రశుక్ల నవమి)

శ్రీరామనవమి సమస్త జగత్తునకు సౌభాగ్యదినము. అఖిల విశ్వపతి సచ్చిదానంద భగవానుడు రావణుని అత్యాచారములతో పీడింపబడుచున్న భూదేవిని సుఖింపజేయుటకు, సనాతనధర్మ మర్యాదను స్థాపించుటకు మర్యాదపురుషోత్తముడుగా శ్రీరాముని రూపమున ప్రకటమైయ్యెను. నది, ఈదినమునే శ్రీరాముడు శ్రీకృష్ణుడు కేవలము హిందువులకు మాత్రము భగవానుకాదు. అఖిల విశ్వమునకు ప్రాణమైనాడు. సర్వవ్యాపి సర్వాంతర్యామి నారాయణుడు ఒకదేశమునకు సంబంధించినవాడుకాదు. అందరివాడు, అందిరియందున్నవాడు, సదా అందరితో కలసి యుండువాడు, సర్వమయుడు.

శ్రీరామునివంటి ఆదర్శ పురుషుడు, ఆదర్శ ధర్మాత్ముడు, ఆదర్శ నరపతి, ఆదర్శ మిత్రుడు, ఆదర్శ సోదరుడు, ఆదర్శ పుత్రుడు, ఆదర్శ గురువు, ఆదర్శ శిష్యుడు, ఆదర్శపతి, ఆదర్శస్వామి, ఆదర్శసేవకుడు, ఆదర్శవీరుడు, ఆదర్శ దయాళుడు, ఆదర్శ శరణాగతవత్సలుడు, ఆదర్శ తపస్వీ, ఆదర్శ సత్యవాది, ఆదర్శ ధృఢప్రతిజ్ఞుడు, ఆదర్శ ఇంద్రియనిగ్రహముగలవాడు ఎవరుందురు? ప్రపంచ ఇతిహాసమందు శ్రీరామునితో సాటియైనవాడు శ్రీరాముడే. సాక్షాత్ పరమ పురుష పరమాత్మయై యుండియు జీవులను సత్పధమున నుంచుటకు ఆదర్శలీలలు కావించెను. వానిని అనుసరించి అందరు సుఖముగ నుండుటకొరకు అట్టి మన శ్రీరాముని పుణ్య జన్మదినము చైత్రశుక్లనవమి, ఆనాడు రామజన్మ పుణ్యోత్సవము చేయవలెను. శ్రీరామునకు కృపాపాత్రులుగావలెను.

చైత్రశుక్ల ప్రతిపదా తిధినుండి చైత్రశుక్ల నవమివరకు ఈ తొమ్మిది దినములు ఉత్సవము చేయవలెను. ప్రతిదినము శ్రీరాముని రెండు అక్షరములతోగాని, ఐదు అక్షరములతోగాని నాలుగు అక్షరములతోగాని నియమ ముగ జపించవలెను. మొదటి

దినము ఏ విధముగా చేసిన మిగిలిన తొమ్మిది దినములు అదే విధముగా చేయవలెను. 108 కి తక్కువ కాకుండ మంత్రమును జపించవలెను. ఉత్సాహము, సమయము ఉండినవారు తొమ్మిది దినములు తొమ్మిది లక్షల నామమును జపించవలెను. ఉదయము సాయంకాలము శ్రీరామనామమును కీర్తించవలెను. శ్రీరామాయణమును తొమ్మిది దినములలో పూర్తిగా పఠించవలెను. వాల్మీకి రామాయణముగాని, ఆధ్యాత్మిక రామాయణముగాని, తులసీ రామాయణము గాని దేనినైనను పఠించవచ్చును. ఈ విధముగా పఠించలేనివారు రోజుకి కొద్ది సమయమైనను రామాయణమును పఠించుట, వినుట చేయవలెను. తల్లిదండ్రుల పాదములకు రోజు ప్రాతఃకాలమున ప్రణామము చేయవలెను.సాధ్యమైనంత వరకు సత్యమునే మాట్లాడవలెను. గృహమందు తల్లి, తండ్రి, సోదరుడు, అన్నభార్య వదిన యజమాని, భార్య, నౌకరు వీరందితో ప్రేమగా నుండవలెను. ఎవరితోను పోట్లాడ రాదు. బ్రహ్మచర్యమును పాటించవలెను. శ్రీరామనవమి వ్రతమును చేయవలెను. శ్రీరామనవమి దినమున రామజన్మోత్సవమును చేయవలెను. సభలయందు రామాయణ ప్రవచనము గావించవలెను. శిక్షాప్రదమైన వ్యాఖ్యానము చేయవలెను. చెప్పువారు, వినువారు, దృఢనిశ్చయులై శ్రీరాముని ప్రార్థించవలెను. నగర సంకీర్తన గావించవలెను. వ్రతధారులు భక్తులు ఈ నియమములను అవశ్యము పాటించవలెను.



## శ్రీరామనవమి - పూజావిధానము

చైత్రమాస శుక్లపక్ష నవమి దినమున శ్రీహరి రామావతారమెత్తెను. పునర్వసు నక్షత్రయుక్త నవమితిథి సమస్త కోరికలను తీర్చును. శ్రీరామనవమి వ్రతముచేయు వారికి అనేక జన్మల పాపరాశులు భస్మమగును. విష్ణుభగవానుని పరమపదము లభించును. ఈ వ్రతము భక్తిని ముక్తిని ప్రసాదించును.

శ్రీరామనవమి దినమున ప్రాతఃకాలముననే స్నానసంధ్యలు నిత్యకర్మలానంతరము గృహమందు ఉత్తరభాగమున ఒక సుందరమైన మండపమును నిర్మించవలెను. మండపమునకు తూర్పు ద్వారము చెంత శంఖ చక్రములను శ్రీహనుమానుని స్థాపించవలెను. మండపమునకు దక్షిణ ద్వారమున బాణము శారజ్గ ధనస్సును గరుత్మంతుని స్థాపించవలెను. మండపమునకు పశ్చిమ ద్వారమున గద ఖడ్గము అంగదుని స్థాపించవలెను. ఉత్తర ద్వారమున పద్మము స్వస్తిక చిహ్నమును శ్రీ నీలుని స్థాపించవలెను. వేదిక మధ్య నాలుగు మూరల విస్తీర్ణముగలిగి యుండవలెను. దానియందు చాందినీ పందిరి వేసి అందముగా తోరణములు కట్టవలెను. ఇట్టి మండపమందు శ్రీ సీతారాములను ప్రతిష్ఠించి వివిధ ఉపచారములతో యథావిధిగా పూజించవలెను. అనంతరము ఈ మంత్రముతో హారతినివ్వవలెను.

**మంగలార్థం మహీపాల నీరజనమిదం హరే ।**
**సంగృహాణ జగన్నాథ రామచంద్ర నమోఽస్తుతే ॥**





ఓం పరికరసహితాయ శ్రీ సీతారామ చంద్రాయ కర్పూరారార్తి క్యం సమర్పయామి. హే పృథ్వీపాలక భగవాన్ శ్రీరామచంద్రా! సమస్త శుభములకొరకు ఈ ఆహారతిని సమర్పించుచున్నాను. హే జగన్నాథా! మీకు నమస్కారము. దీనిని స్వీకరించుడు అనుచు ఐదువత్తులుగాని, పదునొకండు (11) వత్తులుగాని వేసి నేతితో దీపములను వెలిగించవలెను. పరివార సహితముగా శ్రీ సీతారాములకు హారతినివ్వవలెను. అనంతరము పుష్పములను సమర్పించి ప్రదక్షిణ నమస్కారములను చేయవలెను.

**నమోదేవాధి దేవాయ రఘునాథాయ శారిజ్గణే ।**
**చిన్మయానంతరూపాయ సీతాయాః పతయే నమః॥**

ఓం పరికరసహితాయ శ్రీ సీతారామచంద్రాయ పుష్పాంజలిం సమర్పయామి. దేవదేవ, శాజ్గధనుర్ధర, చిన్మయ అనంతరూపములు ధరించినవాడు, సీతాపతి భగవాన్ శ్రీరఘునాథ పదేపదే నమస్కారములు అని పుష్పములను సమర్పించి ప్రదక్షిణ శ్లోకమును పఠించవలెను.

**యానికాని చ పాపాని బ్రహ్మహత్యాది కాని చ ।**
**తాని తాని ప్రణశ్యన్తి ప్రదక్షిణ పదే పదే ॥**

బ్రహ్మహత్యాది పాపములు ప్రదక్షిణ పాదముల క్రింద నిఃశేషముగ పోవలెను. అని ప్రదక్షిణచేసి భగవానుని ప్రసన్నుని గావించుకొనుటకు ప్రార్థించవలెను.

భగవానునకు పంచామృత స్నానమును చేయించి పూజించి ప్రసాదము సమర్పించి మధ్యాహ్నము 12 గంటలకు విశేష హారతినిచ్చి పుష్పాదులు సమర్పించి హారతి అనంతరము భక్తులకు ప్రసాదమును పెట్టవలెను.

శ్రీరామనవమి దినమున శ్రీరాముని ప్రతిమను దానమిచ్చిన అతి పుణ్యప్రదమని శ్రీఅగస్త్య సంహిత యందు చెప్పబడినది. ఈ ప్రతిమ బంగారుదిగాని, యేలోహమైనను, లేక చెక్కదైనను దానమీయవచ్చును. లేక శ్రీసీతారాముల చిత్రపటమైనను రేఖాచిత్రమైనను దానమొసగిన అధిక పుణ్యము ప్రాప్తించును.

## శ్రీరామనవమి వ్రత మహిమ

శ్రీరామనవమి దినమున వ్రతమాచరించి ఉపవాసముండి దశమినాడు భుజించవలెను. అగస్త్య సంహితానుసారము చైత్రశుక్ల నవమి పునర్వసు నక్షత్రము కర్కాటకలగ్నము, సూర్యుడు ఇతర ఐదుగ్రహములు శుభదృష్టితోకలసి, మేషరాశిపై యున్నప్పుడు సాక్షాత్ శ్రీరామ భగవానుడు కౌసల్యామాత గర్భమున జన్మించెను. అందు వలన ఆదినమంతయు ఉపవాసముండి రాత్రి జాగరణచేసి శ్రీరాముని పూజించ వలెను. తమ తమ ఆర్థిక స్థితినిబట్టి పుణ్యదానములు చేయవలెను. ఇట్లొనర్చిన అనేక జన్మల పాపరాశులు భస్మమగును.

నవమికి ముందునాడే అష్టమినాడే వేదవేదాంగ నిష్ణాతుడైన రామభక్తుడైన బ్రాహ్మణుని పూజకు ఆచార్యునిగా నియమించవలెను. వ్రతధారులు వానిని పూజించి హవిష్యాన్నమును భుజించి, ఆచార్యుని వలన రామకథనువిని ఆరాత్రి నేలపై పరుండ వలెను. నవమినాడు ఆచార్యుని ఆదేశానుసారము గృహమందు ఉత్తర దిక్కున అందముగ మండపమును సిద్ధముచేసుకొని, దానియందు రాముని పూజించి ఉత్సవము చేయవలెను. ఆ దినము రామకథా కీర్తన స్తోత్రాదులతో ప్రార్థించి, గంధపుష్ప అక్షత ధూపదీప కర్పూర అగరు కస్తూరి ఆది పూజాద్రవ్యములతో పూజించి రాముని ప్రతిమను ప్రతిష్ఠించవలెను. కౌసల్యామాతను శ్రీదశరథుని, హనుమాదులను పూజించవలెను. యజ్ఞాదులను వేదపఠనములను గావించవలెను. ఈ విధముగా చేసిన వాతావరణ శుద్ధి గలుగును, రోగప్రకోపములు శాంతించును.

**రామావతారకారణము :**

రావణవధ, దానవ వినాశము, దైత్యులను వధించుట, ధర్మమును ప్రతిష్ఠించుట, సజ్జన పరిత్రాణములకొరకు స్వయముగా శ్రీహరి రాముడుగా అవతరించెను. శ్రీరాముడు విశ్వమూర్తి, జ్ఞానగమ్యుడు, సర్వాత్ముడు.

**శ్రీరామనవమి సందేశము :**

మీకు మీరు శుద్ధులుకండు, జ్ఞానమును విస్తరింపజేయుడు, ఆత్మతో విశ్వాత్ముని గుర్తించుడు, సద్భావ సమభావ సహభావములతో మీ జీవితములను సఫలము సార్థకము చేసుకొనుడు. రామభక్తియందు లీనమై రాముని దర్శించుడు "శ్రీరామార్పణ మస్తు". మీరు ఆనందముగా నుండి ఇతరులను ఆనందపరచుడు. ఇదియే రాముని తత్త్వము.

## 4. శ్రీరామ జన్మోత్సవము - ఛఠీ
### (ఆరవరోజు జరుపు మహోత్సవము)

శ్రీమద్వాల్మీకి రామాయణానుసారము శ్రీరాముని జన్మ మహోత్సవము అయోధ్యా నగరమందు ఎంతో గొప్పగా జరిగెను. జన్మ సమయమున గంధర్వులు మధురగీతములను గానము చేసిరి. అప్సరసలు నృత్యములు చేసిరి. దేవతలు దుందుభులు మ్రోగించిరి. ఆకాశము నుండి పుష్పవర్షము కురిసెను. భగవానుని అవతార జయంతులను ఉత్సవములుగా చేయుదురు.

అయోధ్య, జనకపురము, జయపురము ఇతర నగరములందు రామ జన్మోత్సవమున ఆఱవరోజు (శిశువుపుట్టిన ఆఱవరోజు) ఛఠీ ఉత్సవముగా చేయుదురు. శ్రీదేవీభాగవత నవమస్కంధమందు శారద నారాయణ సంవాదమున షష్ఠీదేవి స్తోత్రము గలదు.

**బాలాధిష్ఠాతృదేవ్యై చ షష్ఠీ దేవ్యై నమో నమః।**
**పూజ్యాయై స్కన్దకాన్తాయై సర్వేషాం సర్వకర్మసు ।**
**దేవరక్షణకారిణ్యై షష్ఠీ దేవ్యై నమో నమః॥**



రాజస్థాన్, ఉత్తరప్రదేశ్, బీహారు అనేక మందిరములందు ఛఠీ ఉత్సవము జరుగును.

## 5. అనంగ త్రయోదశి (చైత్ర శుక్ల త్రయోదశి)

చైత్రశుక్ల పక్ష త్రయోదశిని అనంగ త్రయోదశి యందురు. ఈ దినము వ్రతము చేసిన దాంపత్య ప్రేమవృద్ధియగును. పతి పుత్రాదులకు అఖండ సుఖము ప్రాప్తించును. భవిష్యపురాణానుసారము చైత్రశుక్ల త్రయోదశినాడు రతీ మన్మథులను పూజించిన దంపతులకు సుఖసౌభాగ్యములు పుత్రప్రాప్తి గలుగును. ఈ తిథినాడు సంవత్సర మంతయు స్త్రీ పురుషులు వ్రతము చేయవచ్చును. ఈ తిథి శంకర భగవానునకు ప్రియమైనది. పార్వతీశంకరులు దాంపత్య ప్రేమకు ఆదర్శప్రాయులు. ఈ దినము వ్రతముచేసిన దాంపత్య ప్రేమ అభివృద్ధి చెందును.

ఈ దినము ప్రాతఃకాలముననే స్నానాదులాచరించి వ్రత సంకల్పము చేయవలెను. ఒక మంచి వస్త్రముపై మన్మథుని చిత్రపటమునుంచి గంధపుష్పాదులతో పూజించవలెను. అశోకపత్రము పుష్పములతో పూజించిన చాలా మంచిది. అనంతరము నేతితో చేసిన నైవేద్యమును సమర్పించవలెను.



**నమోరామాయ కామాయ కామదేవస్య మూర్తయే ।**
**బ్రహ్మవిష్ణు శివేంద్రాణాం నమః క్షేమకరాయవై ॥**

అని నైవేద్యమును సమర్పించవలెను. అనంతరము ఉపవాసముండి రాత్రి జాగరణచేసి మరుసటిరోజు భుజించవలెను. బ్రాహ్మణునకు భోజనముపెట్టి అనంగ ప్రతిమను గాని చిత్రమునుగాని పూజాసామాగ్రులతో కలిపి దానము చేయవలెను. మహారాష్ట్ర, బెంగాలునందు ఈ వ్రతమును విశేషముగా చేయుదురు.

## 6. శ్రీహనుమజ్జయంతి (చైత్ర శుక్ల పూర్ణిమ)

శ్రీహనుమాన్ జయంతీ తిథి రెండు విధములుగనున్నది. చైత్రశుక్ల పూర్ణిమ, కార్తీకకృష్ణ చతుర్దశి. ఈ దినమున హనుమానుని భక్తితో ఆరాధించవలెను.

**వ్రతవిధి :-** వ్రతముచేయువారు వ్రతమునకు ముందురోజునుండి బ్రహ్మచర్య పాలనతో భూమిపై పరుండవలెను. బ్రహ్మముహూర్తమందే లేచి సీతారాము లను హనుమానుని స్మరించి నిత్యక్రియలను గావించవలెను. హనుమానుని ప్రతిమకు షోడశోపచారములుచేసి ఓం హనుమతే నమః అను మంత్రముతో పూజించవలెను. ఆ దినము వాల్మీకి రామాయణమునుగాని, తులసీరామాయణమందు సుందర కాండనుగాని శ్రీహనుమాన్‌చాలీసాగాని పఠించవలెను. హనుమానుని గుణగానముతో కీర్తించవలెను. హనుమానుని విగ్రహమును సింధూరముతో శృంగారించవలెను. నైవేద్యముగ బెల్లము, వేపిన శనగలు (శనగగుగ్గిళ్లు) నానబెట్టినశనగలు, శనగపిండితో చేసిన లడ్డూలును ప్రసాదముగా నివేదన చేయవలెను. పూజానంతరము బ్రాహ్మణునకు భోజనముపెట్టి ప్రసాదమును గ్రహించవలెను.

**కథ :-** శ్రీరామావతార సమయమున బ్రహ్మ దేవతలను వానరులుగను ఎలుగుబంట్లగను పృథ్విపై ప్రకటమగుడని ఆదేశించెను. అందువలన సమస్తదేవతలు వారి వారి అంశలతో వానరులుగను, ఎలుగబంట్లగను ఉత్పన్నులైరి. వీరిలో వాయువు అంశతో స్వయముగా రుద్రావతార మహావీర హనుమానుడు జన్మించెను. ఇతని తండ్రి వానరరాజు కేసరి, తల్లి అంజనాదేవి. జన్మించగనే అతని ఆకలిని తీర్చుటకు తల్లి ఫలములను తెచ్చుటకు వనమునకు వెళ్ళెను. సూర్యోదయమగుచుండ అరుణ బింబమును హనుమానుడు ఫలమని తలచి, బహు వేగముగ సూర్యమండలమునకు ఎగిరెను. ఆ దినము సూర్యుని మ్రింగుటకు రాహువు సూర్యుని సమీపమునకు వచ్చెను. తన కవరోధము గలిగెనని భావించి హనుమానుడు వానిని మ్రింగబోవగ అతడు ఇంద్రుని చెంతకు పరుగిడెను.

ఇంద్రుడు సృష్టి వ్యవస్థకు విఘ్నము గలిగెనని హనుమానుని ఇంద్రాయుధ ముతో (వజ్రాయుధము) ఎడమవైపు గడ్డముపై కొట్టెను. వాయుదేవుడు తనపుత్రుని కొట్టినందులకు ఉగ్రుడై వాయు సంచారమును ఆపి వేసెను. వాయువే ప్రాణాధార మగుటవలన సమస్త దేవతలు భయముతో బ్రహ్మదేవుని వెంటబెట్టుకొని మూర్ఛపోయి ఉన్న హనుమానుని చెంత కూర్చుండిన వాయుదేవుని చెంతకు వచ్చిరి. బ్రహ్మదేవుడు తనచేతితో శిశువును తాకగనే హనుమానుడు లేచెను. సమస్త దేవతలు తమ తమ అస్త్రశస్త్రములను హనుమానునకిచ్చి వరము లొసంగిరి. బ్రహ్మవరమొసగుచు మారుత! నీ పుత్రుడు శత్రు భయంకరుడగును. యుద్ధమున వీనిని ఎవరు జయించలేరు. రావణునితో యుద్ధము చేయునప్పుడు అద్భుత పరాక్రమమును చూపి శ్రీరాముని ప్రసన్నునిగావించును.

హనుమానుని కృపను పొందుటకు ఈ శ్లోకములను పఠించవలెను.

**జయత్యతిబలో రామో లక్ష్మణస్య మహాబలః।**
**రాజా జయతి సుగ్రీవో రాఘవేణాభి పాలితః॥**
**దాస్యోహం కోసలేంద్రస్య రామస్రా క్లిష్ట కర్మణః।**
**హనుమాంశత్రుసైన్యానాం నిహన్తా మరుతాత్మజః॥**
**న రావణ సహస్రం మే యుద్ధే ప్రతిబలం భవేత్ ।**
**శిలాభిశ్చ ప్రహరతః పాదపైశ్చ సహస్రశః।**
**అర్ధయిత్వా పురీం లంకా మభి వాద్య చ మైథిలీమ్ ।**
**సమృద్ధార్థో గమిష్యామి మిషతాం సర్వరక్షసామ్॥**

## 7. సౌభాగ్యశయన వ్రతము (చైత్ర శుక్ల తృతీయాతిది)

సౌభాగ్యశయనవ్రతమహిమ మత్స్యపురాణమందు వర్ణించిరి. పూర్వకాలమున సమస్త లోకములు దహించుచుండగ సమస్త ప్రాణుల సౌభాగ్యము వైకుంఠలోకమునకు వెళ్ళి విష్ణుభగవానుని వక్షఃస్థలమందు ప్రవేశించెను. దీర్ఘకాలానంతరము పునః

6



సృష్టి రచనా సమయము వచ్చెను. అప్పుడు ప్రకృతి పురుషునితో కలసి, సమస్త లోకములు అహంకారముతో నుండగా, బ్రహ్మవిష్ణువుల మధ్య స్పర్థలు జనించెను.

ఆ సమయమున శివలింగ ఆకారమున అతి భయంకరమైన అగ్నిజ్వాల ప్రకటమయ్యెను. దానితో భగవానుని వక్షఃస్థలమందు తాపము కలిగెను. దానితో విష్ణువు వక్షఃస్థలమును ఆశ్రయించియున్న సౌభాగ్యము రస రూపముతో భూమిపై పడసాగెను. దానిని బ్రహ్మ పుత్రుడు దక్షప్రజాపతి త్రాగెను. మరికొంత రసము నేలపై బడెను. అది ఎనిమిది భాగములయ్యెను. దానినుండి చెఱకు రసరాజాది (పాదరసము) సౌభాగ్యదాయిని ఔషధములు, ఉప్పు మొదలగునవి ఎనిమిది పదార్థములుగ ఉత్పన్నమయ్యెను.

దక్షుడు పానముచేసిన సౌభాగ్య రసము నుండి సతీ నామముతో ఒక కన్య ఉత్పన్న మయ్యెను. ఆమె అద్భుత సౌందర్య మాధుర్య లాలిత్యములు గలిగియున్న కారణమున ఈమెకు లలిత నామము కలిగెను. ఈ సతీదేవియే త్రిలోకములకు సౌభాగ్య రూపిణి. చైత్రమాస శుక్లపక్ష తృతీయ తిథి యందు విశ్వాత్ముడు శంకరభగవానునితో ఈమెకు వివాహము జరిగెను.

అందువలన ఈ దినము సౌభాగ్యవ్రతము చేయుదురు. ఇది సమస్త కోరికలను తీర్చును. ఈ దినము నువ్వులు కలిపిన జలముతో స్నానముచేసి సతీదేవిని శంకరభగ వానుని పూజించవలెను. చందన మిశ్రిత జలముతో గౌరీ శంకరుల ప్రతిమలకు స్నానముచేయించి ధూపదీప నైవేద్యములతోను వివిధ ఫలములతోను పూజించ వలెను.

ఇరువురి నామమంత్రములతో వారి వివిధ అంగములను పూజించవలెను. పాటలాయై నమోస్తు, శివాయ నమః అను మంత్రములతో క్రమముగ పార్వతీ శంకరుల చరణములను పూజించవలెను. (పాటలాయై నమోస్తు, శివాయ నమః -చరణౌపూజయామి) జయాయై నమః, శివాయ నమః (రెండుగొంతు) ఘుట్టి యోంకా (గుటక) పూజయామి.

త్రిగుణాయ రుద్రాయ నమః, భవాన్యై నమః పిండలియోంకా పూజయామి, (పింద పిక్కలు) భద్రేశ్వరాయ నమః, విజయాయై నమః, ఘుటనోంకా పూజాయామి (మోకాళ్ళకు) హరికేశాయ నమః, వరదాయై నమః, ఊరుజంకా పూజయామి (తొడలు) శంకరాయ నమః, ఈశాయై నమః దోనోంకటిభాగకా పూజయామి (నడుము) కోటవ్యై నమః, శూలినే నమః కుక్షిభాగకా పూజయామి (పొత్తికడుపు) శూలపాణయే నమః, మంగలాయై నమః, ఉదరం పూజయామి (పొట్ట) సర్వాత్మనే నమః, ఈశాన్యై నమః స్తనోంకా పూజయామి (స్తనములు) వేదాత్మనే నమః, రుద్రాణ్యై నమః కంఠం పూజయామి (కంఠములు) త్రిపురఘ్నాయ నమః, అనంతాయై నమః హస్తం పూజయామి (ఇరువురి హస్తములు) త్రిలోచనాయ నమః, కాలానల ప్రియాయై నమః బాహుంపూజయామి (ఇరువురి బాహువులు) సౌభాగ్య భవనాయ నమః, ఆ

భూషణ పూజయామి (నగలు) స్వాహా స్వధాయై నమః ఈశ్వరాయ నమః ముఖమండలం పూజయామి (ఇరువురి ముఖమండలములు) అశోకమధువాసిన్యై నమః జఠోం పూజయామి (ఐశ్వర్యప్రదాయిని పెదవులకు) స్థాణవేనమః, చంద్రముఖ ప్రియాయై నమః, ముఖం పూజయామి (ఇరువురి ముఖములు) అర్థనారీశ్వరాయ నమః, అసితాంగై నమః నానికాం పూజయామి (ముక్కు) ఉగ్రాయ నమః, లలితాయై నమః భౌహోం పూజయామి (ఇరువురి కనుబొమలు) శర్వాయ నమః, వాసవ్యై నమః కేశం పూజయామి (కేశములు) శ్రీకంఠ నాథాయనమః బాలోంపూజయామి (శివునిజడలు) భీమోగ్రరూపిణ్యై నమః, సర్వాత్మనే నమః మస్తకం పూజయామి (ఇరువురి మస్తకములకు) అనుచు ఈ విధముగ శివ పార్వతులను పూజించవలెను.

చెఱకు, రసరాజము (పాదరసము) చిక్కుడుకాయ, రాజధ్యానము (మార్గశిర ములో కోతకువచ్చు ధాన్యము) గోక్షీరము, కుసుంభమను పుష్పములు, కుంకుమ పువ్వు, ఉప్పు, ఈ ఎనిమిది వస్తువులను సమర్పించిన సౌభాగ్యము ప్రాప్తించును. వీనిని "సౌభాగ్యాష్టకము"లందురు. నేలపై పరుండి, ఉదయమున లేచి స్నానాదు లాచరించి బ్రాహ్మణ దంపతులను పూజించవలెను. సౌభాగ్యాష్టకములతో శివపార్వ తుల సువర్ణ ప్రతిమలను బ్రాహ్మణునకు సమర్పించిన, లలితాదేవి ప్రసన్నురాలగును. దానము చేయు సమయమున ఈవిధముగ అనవలెను. లలితా, విజయ, భద్ర, భవాని, కుముద, శివా, వాసుదేవి, గౌరి, మంగళ, సతి, ఉమ, ప్రసన్నురాలవుకమ్ము.

ఈవిధముగ ప్రతి తృతీయ తిథి నాడు సంవత్సరమంతయు పూజించవలెను. వ్రతసమాప్తి సమయమున సమస్త సామాగ్రులతోను, శివపార్వతుల సువర్ణ ప్రతిమ తోను వృషభము (ఎద్దును) గోవును దానముచేయవలెను. ఈ వ్రతముచేసిన వారికి సమస్త కోరికలు తీరును. ఈ వ్రతమును 12 సంవత్సరములుగాని, ఎనిమిది లేక 7 సంవత్సరములుగాని చేసిన వారు శివలోకమును పొందుదురు.

## 8. గణ గౌర మహోత్సవము

ఇది రాజస్థాను నందు ప్రసిద్ధిగ జరుగును.

అవివాహిత కన్యలు గ్రామమునకు వెలుపలనున్న దేవాలయమునకువెళ్ళి గణ (శివుడు) గౌర (పార్వతి) వులను పూజించెదరు. చైత్రశుక్ల పక్ష మంతయు 15 దినములు పార్వతీ పరమేశ్వరులను కన్యలు నవవివాహితులు పూజించెదరు. పుష్పములతోను, దూర్వాపత్రములతోను కలశమును అలంకరించి మధురగీతములు ఆలపించెదరు.

ప్రాతఃకాల సమయమున సౌభాగ్యవతలు మూడుగాని లేక ఏడుగాని పుష్ప కలశములను తలపై పెట్టుకొని గణగౌరిని పూజించుటకు వెళ్ళుదురు.

7



## 9. శీతలాష్టమి (చైత్ర కృష్ణ అష్టమి)

ఈ వ్రతము చైత్రకృష్ణ అష్టమి నాడుగాని లేక, హోలీ తరువాతగాని మొదటి సోమవారము లేక గురువారమునాడు చేయుదురు. ఈ వ్రతము చేసిన వారి వంశమందు దాహజ్వరముగాని పీతజ్వరములుగాని నేత్రసంబంధ రోగములుగాని శీతలాది రోగములు గలుగవు. ఈ వ్రతము చేసిన శీతలాదేవి సంతోషించును. ఈ దేవికి పెట్టు పదార్థములు (నైవేద్యములుగ) ఒక రోజుముందుగ చేసి పెట్టుకొనవలెను. (మిఠాయిలు, అన్నము పప్పు, పూరీలు, ఆది మొదలుగనవి) పండుగనాడు పొయ్యి వెలిగించరాదు.

వంటింటిగోడపై అరచేతిని నేతిలో ముంచి గోడపై ముద్రవేసి దానిని పసుపు కుంకుమ, గంధాది పుష్పములతో పూజించవలెను. రాత్రంతయు దీపమును వెలిగించ వలెను. సజ్జల వాయనముపై రూపాయినుంచి దానిని తన అత్తగారికి వాయనమీయ వలెను. చరణములకు నమస్కారము చేయవలెను. తరువాత ఒక వృద్ధురాలికి భోజనము పెట్టి దక్షిణతాంబూలము నివ్వవలెను.



ఒక గ్రామములో ఒక స్త్రీ శీతలాష్టమి వ్రతము చేయుచు చల్లని రొట్టెను తినుచుండెడిది. ఆ గ్రామమున ఇంకెవ్వరు ఈ వ్రతము చేయకుండిరి. ఆ గ్రామము కొనాడు తగులబడుచుండెను. గ్రామమంతయు అగ్నిజ్వాలలు చుట్టుముట్టెను. అన్ని గృహములు కాలిపోయెను. కానీ శీతలాదేవిని పూజించు ఆమె గృహము మాత్రము అట్లే యథాప్రకారముగ నుండెను. "ఇందుకు కారణమే"మని ఆ గ్రామ వాసులందరు ఆమెను అడిగిరి. "నేను శీతలామాతను పూజించుచు (చైత్రకృష్ణ అష్టమినాడు) చల్లని రొట్టెను మాత్రమే తినుచుంటిని", మీరెవ్వరు ఆమాతను పూజించుటలేదు "అందుచేతనే ఇట్లు జరిగె"నని చెప్పెను.

ఆనాటినుండి గ్రామవాసులందరు శీతలాదేవిని పూజించ సాగిరి. ఈ వ్రతము చేసిన చల్లనిమాత చల్లగ కాపాడును.

## 10. వారుణీ పర్వము (చైత్ర కృష్ణ త్రయోదశి)

చైత్ర కృష్ణ త్రయోదశిని వారుణీ పర్వతమందురు. ఈ పుణ్య ప్రదమహా యోగము మూడు విధములుగనున్నది. చైత్ర కృష్ణ త్రయోదశి వారుణ నక్షత్ర (శతభిష) మైన దానిని "వారుణి" యందురు. రెండవది ఇదే దినమున శతభిష నక్షత్రము శనివారమైన అది "మహావారుణి" యందురు. మూడవది ఈతిథి శతభిషా నక్షత్రము శనివారము మరియు శుభయోగమున్న "మహామహా వారుణీ పర్వ" మగును. ఈ యోగమందు గంగాది తీర్థములందు స్నాన దాన ఉపవాసాదులు చేసిన కోట్ల సూర్యగ్రహణ సమాన ఫలము ప్రాప్తించును. ఈ తిథి యందు కాశీ ప్రయాగ హరిద్వారాది తీర్థములందు స్నానదానములుచేసిన విశేషమైన ఫలము లభించును.

## 11. చైత్ర అమావాస్య

ఈ దినముతో సంవత్సరము పూర్తి యగును. ఈ దినమున ప్రాతః స్నానముచేసి, యథా సామర్థ్యముగ అన్నదానము గోదానము సువర్ణ దానము, వస్త్రాదుల దానముచేసి, పితరులకు శ్రాద్ధము, దేవతల సమీపమున జపధ్యాన పూజాదులు చేసి బ్రాహ్మణునకు భోజనముపెట్టిన బహుపుణ్యము గలుగును. ఈ దినము సోమ, గురువారములతో వచ్చిన ఆ రోజు చేయు స్నానదాన బ్రాహ్మణ భోజనాదులు సూర్యగ్రహణ స్నానదాన ఫలములు గలుగును.

## వైశాఖమాసవ్రతములు

## 12. విష్ణు భగవానుని ప్రసన్న పరచుకొనుట

వైశాఖ మాసముతో సమానమైన మాసము లేదు. సత్యయుగముతో సమానమైన యుగము లేదు వేదముతో సమానమైన శాస్త్రములేదు. గంగతో సమాన మైన తీర్థము లేదు.



నారదుడు అంబరీషునితో ఇట్లనెను. వైశాఖమాసము మాసములన్నింటిలో ఉత్తమమైనది. ఇది తల్లివలె కోరినదొసగును. ఇది ధర్మయజ్ఞ క్రియాతపస్సారము. విద్యలలో వేదవిద్య, మంత్రములలో ప్రణవము, వృక్షములలో కల్పవృక్షము, ధేనువు లలో కామధేనువు, దేవతలలో విష్ణువు, వర్ణములలో బ్రాహ్మణులు, ప్రియవస్తువులలో ప్రాణము, నదులలో గంగ, తేజస్సులలో సూర్యుడు, అస్త్రశస్త్రములతో చక్రము, ధాతువులలో సువర్ణము, వైష్ణవులలో శివుడు, రత్నములలో కౌస్తుభమణి, ఉత్తమ మైనది. ఇదే విధముగ మాసములలో వైశాఖ మాసము ఉత్తమమైనది. విష్ణుభగవానుని ప్రసన్న పరచుటకిట్టి మాసము మరొకటిలేదు. ఈ మాసమందు సూర్యోదయమునకు ముందే స్నానముచేసి విష్ణుభగవానుని పూజించిన పాపములు భస్మమగును. వైశాఖ మాసమున జలమందు సమస్త తీర్థములు ఉండును. ఇది విష్ణుభగవానునకు ప్రియమైనమాసము. ఈ మాసమున జలదానముచేసినను, చేయించినను, యాత్రికులకు బాటసారులకు దాహముతీర్చినను విష్ణులోకము లభించును. దాహము గొనియున్న వారికి దాహ మును తీర్చిన శివకేశవులు సంతుష్టులగుదురు. ఈ మాసమందు జలమును, విసని కర్రలను దానముచేసిన పదివేల రాజసూయ యజ్ఞములు చేసిన ఫలము దక్కును. ఎండతీవ్రతకు పడిపోయిన బ్రాహ్మణునకు సేదతీర్చిన వారు భగవానునకు పార్షదులగు దురు. వైశాఖమాసమున పాదుకలను దానముచేసిన విష్ణులోకమును పొందుదురు. మధ్యాహ్న సమయమున వచ్చిన బ్రాహ్మణునకు భోజనము పెట్టిన అనంతమైన ఫలమొసగును.

వైశాఖమందు నూనెను పూసుకొనుట, పగలు నిదురపోవుట, కంచుపాత్రలో భుజించుట, పరుపుపై నిదురించుట, గృహమందు స్నానము చేయుట, నిషిద్ధ



పదార్థము లను తినుట, భోజనమును వ్యర్థముచేయుట, రాత్రులు తినుట, వీనిని త్యజించవలెను. (ఈఎనిమిదింటిని)

వైశాఖ మాసమును పాలించువారు పద్మపత్రములలో భుజించవలెను, నదీ స్నానము చేయవలెను, ఇట్లు చేసిన మూడుజన్మల పాపములు నశించును. సముద్ర మందుగాని, నదియందుగాని స్నానము చేసిన ఏడుజన్మల పాపములు నశించును. సూర్యుడు మేషరాశియందున్నప్పుడు స్నానముచేసి పూజించిన వైకుంఠధామము ప్రాప్తించును. వైశాఖ మాసమునకు దేవత మధుసూదన భగవానుడు.

**మధుసూదన దేవేశ వైశాఖే మేషగే రవౌ ।**
**ప్రాతఃస్నానం కరిష్యామి నిర్విఘ్నం కురు మాధవ ॥**

హే మధుసూదనా! హే దేవేశ్వర మాధవా! నేను మేషరాశియందు సూర్యుడున్నప్పుడు వైశాకప్రాతః స్నానము చేయుదును. దీనిని నిర్విఘ్నముగ కొనసాగనిండు.

**వైశాఖే మేష భాగే ప్రాతః స్నాపరాయణఃనౌ।**
**అర్ఘ్యం తేహం ప్రదాస్యామి గృహాణ మధుసూదన ॥**

## 13. అక్షయ తృతీయ అధ్యాత్మ దర్శనము

**(వైశాఖ శుక్ల తృతీయాతిథి)**

వైశాఖమాస శుక్లపక్ష తృతీయాతిథిని అక్షయ తృతీయ అనియు, ఆఖాతృతీయ అనియు, ఆఖాతీజ అనియు అందురు.

అక్షయ మనగా ఎన్నిటికి నశించనిది అని, సత్యమైనది. యేది సర్వదా సత్యమైనదో అదియే పరమాత్మ ఈశ్వరుడు, అక్షయ అఖండ సర్వవ్యాపకుడు. ఈ అక్షయ తృతీయాతిథి ఈశ్వరతిథి. ఈ అక్షయతిథి పరశురాముని జన్మదినమైన కారణమున "పరశురామతిథి" అనియు అందురు. పరశురాముడు మహాత్ములైన చిరంజీవుల లెక్కలోనికి వచ్చి వాడుగాన ఈ తిథిని చిరంజీవి తిథి అనియు అందురు. నాలుగు యుగములలో (సత్య,త్రేతా,ద్వాపర,కలియుగ) త్రేతాయుగ ప్రారంభము ఈ తిథి నుండే ప్రారంభమైనది. అందువలన ఈ తిథిని యుగాది తిథి యందురు.

బదరీనారాయణ దర్శన తిథి నాలుగు ధామములలో నొకటైన బదరీనారాయణ దర్శనతిథియు నిదియే. భక్తులు ఈ దినమిచట త్యాగ దాన దక్షిణ, జప,తప హోమ హవన గంగాస్నానాది కార్యములు చేయుదురు. భగవానుని ప్రసాదమును భక్తులు భక్తితో గ్రహించెదరు.

అక్షయ తృతీయనాడు భక్తజనులు భగవానుని చరణ దర్శనమునకు బృందావనము వచ్చెదరు. ఇది "సత్యమేవజయతే" అను సందేశమిచ్చును. ఈ తిథియందు వివాహాది శుభకార్యములు చేయుదురు. అక్షయ గ్రంథమైన గీత అమర

నిధివంటిది. దీనిని చదివినను వినినను, జీవితము సఫలమగును. అక్షయత్త్వము ప్రాప్తించును.

## 14. నవాన్న పర్వము
### (అక్షయ తృతీయాతిథి)

అక్షయ తృతీయా మహోత్సవము వసంతకాల గ్రీష్మసంధి కాలమందు జరుగును. ఈ వ్రతకథలు విష్ణుధర్మ సూత్రము, మత్స్య పురాణము, నారదీయ పురాణము, భవిష్యాది పురాణములందు విస్తారముగ వ్రాయబడియున్నవి. ఈ తిథి యందు చేయు స్నాన దాన జప తప యజ్ఞాది శుభకర్మలు అనంతఫలమొసగును. భవిష్యపురాణానుసారము సమస్త కర్మఫలములు అక్షయమగును. అందువలన దీనికి అక్షయ నామము గలిగెను. సత్యయుగము ఈ తిథి నాడే ప్రారంభమయ్యెనని యున్నది.

కొత్త కుండపై ఖరబూజా ఫలము నుంచి మామిడాకులు పెట్టి పూజించవలెను. రైతులకిది శుభ దినము. ఈ దినము బదరికాశ్రమమందు ద్వారము తెరచెదరు. బదరీనాథుని ప్రతిమను స్థాపించి పూజించెదరు. లక్ష్మీనారాయణుని దర్శించెదరు. ఈ తిథినాడు గంగా స్నానము చేయుదురు. పితరులకు నవ్వులతో తర్పణము గావిం చెదరు. పిండ దానము చేయుదురు. ఇది అధికఫల మొసగును. దీనిని నర-నారాయణులు, పరశురామ హయగ్రీవుల జయంతి తిథి యందురు. ఈ తిథియందు గౌరీదేవిని పూజించెదరు. కన్యలు గౌరిని పూజించి మిఠాయి లను, ఫలములను శనగలను పంచిపెట్టుదురు. మట్టిలో కుండలో అన్నాదిఫలము లను నింపి దానము చేయుదురు.

భూమి క్రయవిక్రయములకు గృహప్రవేశాదులకీ తిథి శుభప్రదమైనది. అక్షయ తృతీయాతిథి సోమవారము రోహిణీ నక్షత్రము ఈ మూడు కలసివచ్చిన బహు శ్రేష్ఠము. ఈ తిథి యందు చెఱకు రసము, పెరుగు, బియ్యము, పాలు, ఖరబూజ, తరబూజ, లడ్డూలను భగవానునకు నివేదనచేసి దానము చేయుదురు.

స్కంధ పురాణ భవిష్యపురాణానుసారము వైశాఖ శుక్లపక్ష తృతీయతిథియందు రేణుకా గర్భమునుండి విష్ణుభగవానుడు పరశురామునిగా జన్మించెను. ఈ తిథి నాడు పరశురామ మందిరములందు పరశురామ జయంతిని జరుపుదురు. ఈ తిథి; నాడు పరశురామ ఆవిర్భావ కథను కూడ చెప్పుదురు.

## 15. పరశురామ జయంతి

పరశురాముడు దశావతారములలో నొకడు. ఇతడు తృతీయాతిథి పునర్వసు నక్షత్రము రాత్రి మొదటి జామున ఆయా గ్రహములు ఉచ్ఛస్థితిలో నుండి, మిథునరాశిలో రాహువు యుండగా రేణుకా గర్భమున పరశురాముడు ఉద్భవించెను. ఇతడు మహర్షి జమదగ్ని పుత్రుడు. పుత్రోత్పత్తి నిమిత్తముగ వీని తల్లికి, విశ్వామిత్రుని తల్లికి ప్రసాదము లభించెను. అది దైవ వశమున ఒకరిది ఒకరికి మారిపోయెను. ఇందువలన రేణుకాపుత్రుడు పరశురాముడు బ్రాహ్మణుడైయుండియు క్షత్రియ స్వభావము గలిగియుండెను. విశ్వామిత్రుడు క్షత్రియకులమందు జన్మించియు బ్రహ్మర్షి యయ్యెను.

సహస్రార్జునుడు జమదగ్నిని వధించిన కారణమున పరశురాముడు ఉగ్రుడై 21మారులు పృథ్వియందున్న దుష్టులైన క్షత్రియరాజులను సంహరించెను. శివభగవానుడొసగిన పరశువును (గండ్రగొడ్డలిని) ధరించిన కారణమున వీనికి పరశురాముడను నామము గలిగెను. ఈ వ్రత దినమున నిత్యకర్మల నంతరము స్నానమాచరించి సూర్యాస్త మయము వరకు మౌనముగనుండి సాయంకాలము పునః స్నానముచేసి, పరశు రాముని మూర్తికి షోడశోపచారపూజ చేయవలెను. రాత్రికి జాగరణచేసి శ్రీరాముని మంత్రమును జపించవలెను.

## 16. శ్రీ సీతానవమి వ్రతము
### (వైశాఖ శుక్ల నవమి)



హిందూ సమాజమందేవిధముగ శ్రీరామనవమి మాహాత్మ్యమున్నదో, అదే విధముగ జానకీనవమి కూడయున్నది. అష్టమీ తిథి కేవిధముగ రాధాకృష్ణుల ఆవిర్భావముతో సంబంధముండెనో, అదే విధముగ నవమీ తిథి సీతారాముల ఆవిర్భావ తిథియగుటచే పరమ ఆదరణీయమైయున్నది.

భగవతి రాధా ఆవిర్భావము భాద్రపత శుక్ల అష్టమి, శ్రీకృష్ణభగవానుని ఆవిర్భావము భాద్రపదకృష్ణ అష్టమి. ఇదే విధముగ భగవతి సీతా ఆవిర్భావము వైశాఖ శుక్లనవమి, శ్రీరామ భగవానుని ఆవిర్భావము చైత్రశుక్ల నవమి. హిందువులకు శ్రీసీతారామ, శ్రీరాధాకృష్ణుల ఆవిర్భావ దినములు అతిపావన మైనవి. ఈ దినము లందు వ్రతముచేసిన భుక్తి-ముక్తులు లభించును.

శ్రీరామచంద్రుని సహితముగ శ్రీసీతను తమశక్తికి తగిన విధముగా భక్తితో పూజించిన పృథ్వీదాన ఫలము, మహాషోడశదాన ఫలము, అఖిల తీర్థభ్రమణ ఫలము, సర్వభూతదయా ఫలములు సునాయాసముగ లభించును. సీతాదేవి ప్రసన్నురాలైన శుభములకది మూలము. అందువలన శ్రీసీతానవమి వ్రతము ఆత్మకల్యాణార్థము ఆచరణీయమైనది.

వైశాఖశుక్ల నవమి, పుష్యనక్షత్రము మంగళవారము రోజున సంతానప్రాప్తి కొరకు యజ్ఞభూమిని సిద్ధము చేయుటకు జనక మహారాజు నాగలితో భూమిని దున్నెను. ఆసమయమున పృథ్వి నుండి దేవి అవతరించెను. భూమిని దున్నుచుండగ నాగలి కొననుండి (నాగలి కొనను సీతయని యందురు) ఉద్భవించిన దగుటచే సీతా నామమున ఖ్యాతి గాంచెను. ఈ పావనమైన తిథి యందు సీతాజయంతిని చేయు దురు.

అష్టమి తిథియందు సుందరమైన మండపమును నిర్మించి తోరణాదులతో అలంకరించి, మండపములో మధ్యభాగమందు సీతారాములను స్థాపించవలెను.

పూజించుటకు స్వర్ణ,రజిత, తామ్ర ప్రతిమలుగాని, రాగి చెక్క మట్టి ప్రతిమలుగాని స్థాపించవలెను. ప్రతిమలు లేకపోయిన చిత్రపటమునకైనను భక్తితో పూజించవలెను.

సీతారాముల ప్రతిమలవెంట జనకమహారాజును తల్లిసునయనను, కుల పురోహితుడు శతానందుని నాగలి పృథ్వీమాత ప్రతిమలను కూడ స్థాపించవలెను. నవమి దినమున శ్రీ జానకీరాములను సంకల్పము చేసుకొని పూజించవలెను. మొదట పంచోపచారములతో (గ్రంథ పుష్పధూప దీప నైవేద్య) గణేశుని పార్వతీదేవిని పూజించవలెను. అనంతరము మండపముచెంత అష్టదళ కమలముపై కలశమును స్థాపించవలెను. మండపమందున్న ప్రతిమలకు ప్రాణప్రతిష్ఠ చేయవలెను. అనగా ఉపాసకులు ప్రతిమల కపోలములను స్పర్శించుచు "పరికర సహిత శ్రీజానకీ రామాభ్యాం నమః" అను మంత్రమును ఉచ్చరించవలెను. అనంతరము కరన్యాస షడంగన్యాసములుచేసి పుష్పములు తీసుకొని సీతాదేవిని ఈ విధముగ ధ్యానించ వలెను.



**తాటంకమండల విభూషిత గండభాగాం**
**చూడామణి ప్రభృతి మండన మండితాంగీమ్ ।**
**కౌశేయ వస్త్రమణిమౌక్తిక హారయుక్తాం**
**ధ్యాయేద్ విదేహ తనయాం శశిగౌరవర్ణామ్ ॥**

మండలాకార కర్ణాభూషణములతో అతిసుందరముగ గోచరించుచున్న కపోల ములు, చూడామణి ఆది అనేక విధములైన ఆభరణములతో అలంకరింపబడి యున్న అంగములు, పట్టువస్త్రము మణి మౌక్తికహారములతో విభూషితురాలై యున్నట్టిది, చంద్రునివలె గౌరవర్ణముగలది, జనక పుత్రికయైనట్టి సీతాదేవిని ధ్యానించ వలెను. అనంతరము ఉపచారములతోను వివిధ మంత్రములతోను లేకున్న "శ్రీజానకీరామా భ్యాం నమః" అను నామ మంత్రముతో ఆసనము పాద్యము అర్ఘ్యము ఆచమనము పంచామృత స్నానము వస్త్రము ఆభరణము గంధము సింధూరము ధూపదీపనైవేద్రాదు లతో శ్రీ జానకీ రాములను పూజించవలెను. హారతి మంత్రపుష్పాంజలులకు ముందు మండపమందు ప్రతిష్ఠించియున్న ఆరాధ్యదేవులను ఈ విధముగ పూజించవలెను.

**శ్రీ జానకికి :**

**దేవీ పద్మాలయా సాక్షాదవతీర్ణా యదాలయే ।**
**మిథిలాపతయే తస్మై జనకాయ నమో నమః॥**

అని వందనముచేసి "శ్రీజనకాయ నమః" అను మంత్రముతో జానకిని పూజించవలెను. (పంచోపచారములతో)



**శ్రీ సునయ నాంబకు :**

**సీతాయా జననీ మాతర్మహిషీ జనకస్య చ ।**
**పూజాం గృహాణ మద్దత్తాం మహాబుద్ధే నమో஽స్తుతే ॥**

అని సీతాదేవి తల్లియైన సునయనకు నమస్కారముచేసి "శ్రీ సునయనాంబాయై నమః" అనుచు పంచోపచారములతో పూజించవలెను.

**శ్రీ శతానందునకు :**

**నిధానం సర్వవిద్యానాం విద్వత్కుల విభూషణమ్ ।**
**జనకస్య పురోధాస్త్వం శతానందాయతే నమః॥**

"శ్రీ శతానందాయ నమః" అను మంత్రముతో పంచోపచారములతో పూజించి నమస్కారము చేయవలెను.

**శ్రీహల పూజ :**

**జీవయస్యఖిలం విశ్వం చాలయన్ వసుధాతలమ్ ।**
**ప్రాదుర్భావయసే సీతాం సీర తుభ్యం నమో஽స్తుతే ॥**

అని నాగలికి వందనముచేసి "శ్రీ హలాయ నమః" అను మంత్రముతో పంచోపచార పూజ చేయవలెను.

**శ్రీ పృథ్విదేవిని పూజించుట :**

**త్వయైవో త్పాదితం సర్వం జగదేతచ్చ రాచరమ్ ।**
**త్వమేవాసి మహామాయా మునీనామపిమోహినీ ॥**
**త్వదాయత్తా ఇమే లోకాః శ్రీ సీతా వల్లభా పరా ।**
**వన్దనీయాసి దేవానాం సుభగే త్వాం నమామ్యహమ్ ॥**

అని పృథ్వీదేవికి వందనముచేసి "శ్రీసుభగాయై నమః" అను మంత్రముతో పూజించవలెను.

**హారతి :**

**కదలీగర్భ సంభూతం కర్పూరంచ ప్రదీపితమ్ ।**
**ఆరార్తి క్యమహం కుర్వే పశ్యమె వరదా భవ ॥**

పరికరసహిత శ్రీ జానకీరామాభ్యాం నమః కర్పూరారార్తి క్యం సమర్పయామి, అనుచు హారతినివ్వవలెను.

**పుష్పాంజలి ప్రణామ ప్రదక్షిణలు :**

**వానాసుగంధి కుసుమైర్యథా కాల సముద్భవైః।**
**పుష్పాంజలిం మయా దత్తం గృహాణ పరమేశ్వరి ॥**

పరికర సహిత శ్రీ జానకీ రామాభ్యాం నమః పుష్పాంజలి సమర్పయామి.

దశాననవినాశాయ మాతా ధరణిసంభవా ।
మైథిలీ శీలసంపన్నా పాతునః పతిదేవతా ॥

రావణ సంహారమునకు భూమాత గర్భమునుండి ఉత్పన్నమైతివి, పతిని దేవతగా భావించితివి. శీలసంపన్నురాలవు యైన మిథిలేశకుమారీ మమ్ము రక్షించుము. నీలకమల దళములవంటి నేత్రములు, ప్రజ్వలితాగ్నియందు తన పవిత్ర తను ప్రకటించినదియైన రామప్రియ శ్రీ సీతను ధ్యానించుచున్నాను. నేత్రములు శ్రీరాముని చరణములపై నిశ్చలమై యుండునది, సువర్ణకాంతిగలది, రాముని ప్రేయసియైన శ్రీ సీతను ధ్యానించుచున్నాను. నేను శ్రీ రఘునాథునికి తప్ప నా మనోవాక్కాలయ శరీరమునందు మరెవ్వరికి స్థానమివ్వనైతినేని ఓ అగ్నిదేవా! నన్ను దహించుము అనుచు అగ్ని ప్రవేశము చేసిన సీతను ధ్యానించుచున్నాను.

ఉత్తమ విమానమందు ఇంద్ర రుద్ర కుబేర వరుణాదులతో పూజింపబడు రాముని పత్ని సీతను ధ్యానించుచున్నాను. అగ్నిశుద్ధి సమయమున సమస్త దేవతలు చూచుచుండగా తన తేజస్సును దశదిశల వ్యాపింపజేసి విస్మయ పరచిన రఘురామ పత్ని సీతను ధ్యానించుచున్నాను అని సీతామాతను పూజించి ప్రదక్షిణ నమస్కారములుచేసి తదుపరి ప్రసాదమును పంచవలెను. వ్రతసమాప్తి దశమి దినమున సువర్ణరజత కాంస్య ప్రతిమలను (సీతారాములు) దానము చేయవలెను. అన్నదానము గోదానము భూదానము మొదలగు దానములుచేసి పూర్ణాహుతి గావించవలెను.

## 17. శ్రీ జానకీ నవమి - వ్రతోత్సవము

**(వైశాఖ శుక్లనవమి)**

పరమ పునీతమైన (శ్రీ మాధవమాస) వైశాఖ మాసము శుక్లపక్ష నవమితిథి పుష్యమీ నక్షత్రము మంగళవారము మధ్యాహ్న సమయమున శుభవేళలో విదేహ వంశ వైజయంతి జానకి బహు దివ్యముగా ప్రకటనమయ్యెను. ఈ తిథి యందు చేయు వ్రతము అతి పుణ్యప్రదమైనది.

**వ్రతనియమములు :-** వ్రతకర్త అష్టమి ప్రాతఃకాలమందేలేచి నదియందుగాని సరోవరమందుగాని స్నానము చేసి సంధ్యావందనాదులొనరించి దేవతలకు పితరులకు తర్పణముగావించి ఒక్కపూట స్వల్పముగా హవిష్యాన్నమును భుజించి బ్రహ్మచర్య పాలనతో భూమిపై పరుండవలెను. నవమినాడు బ్రహ్మముహూర్తముననే లేచి శ్రీ విదేహ రాజనందినని స్మరించవలెను.

నిత్యకర్మలానంతరము పదునాఱుగాని (16) లేక ఎనిమిదిగాని మరియు నాలుగు స్తంభములతోగాని అందముగ మండపమును నిర్మించవలెను. ధ్వజ పతాకములతో మండపమును అలంకరించవలెను. అందు సుందరమైన ఆసనముపై కిశోరి(జానకి) ప్రతిమ నుంచవలెను. వేదశాస్త్రపారంగతులై నిర్మల ఆచార వ్యవహార సంపన్నుడు పవిత్రుడైన బ్రాహ్మణుని ఆచార్యునిగా నియమించవలెను.



అనంతరము "శ్రీ సీతాయై నమః" అను మూల మంత్రముతో ప్రాణాయామము చేయవలెను. ఋషిన్యాస అంగన్యాసాదుల అనంతరము జానకీ బాల స్వరూపమును ఈ విధముగ ధ్యానించవలెను.

**వందే విదేహతనయా పదపుండరీకం**
**కౌ శోగసౌరభ సమాహూత యోగిచిత్తమ్ ।**
**హన్తుం త్రితాపమనిశం మునిహంస సేవ్యం**
**సన్మాన సావి పరిపీత పరాగ పుంజమ్ ॥ (జానకీస్తవరాజము)**

హే కిశోరీ! సమస్త ప్రాణులకుమీ నిత్య కైశోర సౌరభముతో త్రితాపములను తొలగించుదానవు, మునులతో సేవింపబడు దానవు, భక్తజనమానస భ్రమరావలివి, పీతపరాగ పుంజమైన శ్రీవిదేహవంశ వైజయంతి జానకీ పాదపద్మములకు వందనములు, అనుచు పూజించవలెను. నృత్యగాన కీర్తనాదులతో తన్మయులై ఏకాగ్ర చిత్తముతో ధ్యానించవలెను.

గణేశుని సూర్యుని అగ్నిని బ్రహ్మవిష్ణు మహేశ్వరులను పార్వతిని హనుమానుని పూజించి కలశమును స్థాపించవలెను.

అనంతరము శ్రీ కిశోరిని "శ్రీ సీతాయై నమః" అను మంత్రముతో ఆవాహనముచేసి, ఆసన పాద్య,అర్ఘ్య ఆచమన మధుపర్క స్నాన వస్త్రాభూషణ చందన సౌభాగ్య ద్రవ్యాది పుష్పములతో పూజించి ప్రదక్షిణ నమస్కారములు చేయవలెను. తరువాత అష్టదళ కమలమందు అష్టసఖియలను పూజించవలెను.

తరువాత జ్ఞానశిరోమణి శ్రీయాజ్ఞవల్క్య మహర్షిని ఆవాహనముచేసి పూజించవలెను. గౌతమ పుత్రుడైన శ్రీ శతానందుని ఆవాహనముచేసి పూజించవలెను. అనంత రము శ్రీ జనక మహారాజుని ఆవాహనముచేసి పూజించవలెను.

శ్రీ విదేహరాజనందని జానకి జన్మోత్సవమును వాద్యాది గీతములతో పురజన పరిజన సహితులై చేయవలెను. ఈ విధముగా జానకిని పూజించి వ్రతముచేసిన దయామయి సీత కృప అవశ్యము లభించును.

## 18. శ్రీ నృసింహ చతుర్దశీ వ్రతము

**(వైశాఖ శుక్ల చతుర్దశి)**

సర్వవిశ్వాత్ముడు విశ్వస్వరూపుడు జగత్తునకు ప్రభువైన భగవానుడు భక్తప్రహ్లాదుని అభీష్టసిద్ధికి నృసింహరూపముతో ప్రకటమయ్యెను. ఈ తిథి రోజున ఉత్సవము చేయుదురు.

హిరణ్యకశిపుని వధించుటకు దేవాదిదేవుడు నృసింహ భగవానుడు ఉద్భవించెను. నృసింహభగవానుని ఒడిలో కూర్చుండిన ప్రహ్లాదుడు నారాయణా! నృసింహరూపము ధరించిన నీకు నమస్కారము నేను మీ భక్తుడను. స్వామీ! నాయందు మీకింతటి ప్రేమగలుగుటకు కారణమేమో చెప్పు డని అడిగెను.

**నృసింహాభగవానుడు :** వత్సా! నీవు పూర్వజన్మలో బ్రాహ్మణ పుత్రుడవు. ఐనను నీవు వేదాధ్యయనము చేయలేదు. అప్పుడు నీవు వసుదేవ నామముగలవాడవు. ఆజన్మయందు నీవెట్టి, పుణ్యము చేయలేదు. కేవలము నా వ్రత ప్రభావముచేత నీకు నాయందు భక్తి యేర్పడెను. పూర్వము బ్రహ్మదేవుడు జగత్తును సృష్టించుటకు ఈ వ్రతమును అనుష్ఠానము చేసెను. నా వ్రత ప్రభావముచేతనే బ్రహ్మ చరాచర జగత్తును సృష్టించెను. దేవతలు ప్రాచీనులైన ఋషులు రాజులు మరెందరో నా వ్రతమును చేసిరి. ఈ వ్రత ప్రభావమున వారందరు సర్వసిద్ధులను పొందిరి. ఎట్టివారైనను ఈ వ్రతము చేసిన వారికి నేను సర్వసౌఖ్యములను భోగమోక్షములను ప్రసాదించెను.

**ప్రహ్లాదుడు :** "దేవా! మీ ప్రేమను భక్తిని ప్రసాదించు నృసింహ చతుర్దశీ నామ ఉత్తమవ్రత విధానమును వినగోరుచున్నాను. ప్రభూ! యే మాసమున యేదినమున ఈ వ్రతము చేయవలెనో చెప్పు"డని అడిగెను.

**నృసింహాభగవానుడు :** పుత్రా! ప్రహ్లాద! నీకు శుభమగుగాక, ఏకాగ్రచిత్తుడవై వినుము. ఇది నా ప్రాదుర్భావమునకు సంబంధించినది. వైశాఖశుక్ల పక్ష చతుర్దశీ తిథియందు ఈ వ్రతమును చేయవలెను. నేను బహు సంతోషించెదను. భక్తులకు సుఖమొసగుటకే నేనీ విధముగ ఆవిర్భవించితిని. పశ్చిమ దిశలో ఒక కారణమున నేను ప్రకటమైతిని. అది నా మూలస్థానము. ఇది ములతాన క్షేత్ర నామముతో ప్రసిద్ధిగాంచియున్నది. ఈ క్షేత్రమందు హారీతయను నామముగల బ్రాహ్మణుడుండెను. ఇతడు వేదవేదాంగ పారంగతుడు. సదా ధ్యాన తత్పరుడు. ఇతని భార్య లీలావతి. ఈమె పరమ పతివ్రత. వీరిరువురు బహుకాలము తపస్సుచేసిరి. తపస్సులో వారికి ఇరువది ఒక్క (21) యుగములు గడచెను. అప్పుడా క్షేత్రమందు నేను ప్రకటమై వారికి దర్శనమొసగితిని. అప్పుడు వారు. భగవాన్! మీరు మాకు వరమొసగుటకు వచ్చితిరేని, మీవంటి పుత్రుని ప్రసాదించుడని కోరుకొనిరి. అప్పుడు నేను నిస్సందేహముగ నేను మీకు పుత్రుడు నగుదును, కాని నేను సమస్త విశ్వమును సృష్టించు పరాత్పర పరమాత్మను, సనాతన పురుషుడును, అందువలన నేను గర్భమందు నివాసము చేయను. అనగ, వారు అట్లే యనిరి, అప్పటినుండి నేను ఆ క్షేత్రమున నివాసము చేయుచున్నాను. నా భక్తులు అచటికివచ్చి నన్ను దర్శించెదరు. నేను వారి బాధలను తీర్చెదను. లీలావతి దంపతులను తలచుకొని నన్ను పూజించు వారి సమస్త కోరికలు తీరును.

నా వ్రత దినమున ఈ విధముగ సంకల్పము చేయవలెను. "భగవాన్! నేడు నేను మీ వ్రతము చేయబోవుచున్నాను. నిర్విఘ్నముగ నెరవేర్చుడు. మధ్యాహ్న సమయమున మరల స్నానముచేసి సంధ్యాతర్పణము గావించవలెను. పూజా స్థలమును అలికి అష్టదళకమలమును వేయవలెను. దానిలో పంచర్నతములను రాగి కలశమందువేసి కలశమును స్థాపించవలెను. కలశముపై బియ్యము నిండుగ



పోసిన పాత్రనుంచి తమశక్తికి తగినట్లు (బంగారు) లక్ష్మీసహితముగా నాప్రతిమను (లక్ష్మీనరసింహా) స్థాపించవలెను. పంచామృతముతో స్నానము చేయించవలెను. శాస్త్రజ్ఞుడైన బ్రాహ్మణుని ఆచార్యునిగ నియమించి అర్చనాదులు చేయించవలెను. పూజామండపమును పుష్పములతో అలంకరించవలెను. షోడశోపచారములతో నన్ను పూజించవలెను. చందన కర్పూర పుష్ప తులసీదళములను నాకు అర్పించవలెను. అగరు ధూపమును సమర్పించవలెను. దీపమును వెలిగించవలెను. ఇది అజ్ఞానాంధ కారమును నశింపజేయును. ఘంటానాదముతో ఆరతినివ్వవలెను. అనంతరము నైవేద్యమును ఈ మంత్రముతో సమర్పించవలెను.

**నైవేద్యం శర్కరాం చాపి భక్ష్యభోజ్య సమన్వితమ్ ।**
**దదామి తే రమాకాన్త సర్వపాపక్షయం కురు ॥**

లక్ష్మీకాంతా! భక్ష్య భోజ్య నైవేద్యములను చక్కెరను మీకు నివేదన చేయుచున్నాను. నా పాపములను నశింపజేయుము.

అనంతరము ఈ విధముగా భగవానుని ప్రార్థించవలెను.

నృసింహా! అచ్యుతా! దేవేశ్వరా! మీ శుభ జన్మదినమున నేను అన్ని భోగములను త్యజించి ఉపవాసము చేయుదును. స్వామీ! ప్రసన్నులై నాజన్మ బంధము లను పాపము లను తొలగించుము. అని ప్రార్థించి రాత్రి గీతాది వాయిద్యనాదము లతో జాగరణ చేయవలెను. నృసింహ పురాణమును పఠించవలెను. ప్రాతఃకాలమందే లేచి స్నానము చేసి నన్ను పూజించవలెను. అనంతరము ఇక లోక పరలోక సుఖముల కొరకు బ్రాహ్మణునకు గోవును భూమిని సువర్ణమును దుప్పటిని సప్తధాన్యములను ఇతర వస్తువులను శక్త్యానుసారముగ దానము చేయవలెను. బ్రాహ్మణునకు భోజనముపెట్టి దక్షిణతాంబూల మివ్వవలెను. ధనహీనులును ఈ వ్రతముచేసి వారి శక్తికి తగినట్లుగ దానమీయవచ్చును. ఈ వ్రతము చేయుటకు అందరు అధికారులే.

వ్రతధారులీవిధముగ ప్రార్థించవలెను.

సర్వజీవస్వరూపా! విశ్వేశ్వరా దేవేశ్వరా సూర్యమండలస్థిత దయాసింధు ఇరువదిమూడు (23) తత్త్వములకు సాక్షివి, ఇరువదినాలుగు(24) తత్త్వముల స్వరూపుడవు, కాలరుద్రాగ్నులు మీరూపములే. నరసింహ రూపము ధరించిన మీకు నమస్కారము. దేవేశా! నా వంశమందు ఉత్పన్నమైనవారిని, ఉత్పన్నముకానున్నవారిని అందరిని భవసాగరమునుండి ఉద్ధరించుడు. శేషశాయీ దేవేశ్వరా! ఈ వ్రతముతో ప్రసన్నులై భోగమోక్షములను ప్రసాదించుడు" అని ప్రార్థించి వ్రతానంతరము సమస్త వస్తువులను బ్రాహ్మణునకు సమర్పించి దక్షిణ ఇచ్చి సంతుష్టుని గావించవలెను. భగవానుని స్మరించుచు సోదరీ సోదరులతోను బంధు బాంధవులతోను కలసి భుజించవలెను. ఈవిధముగా చేసిన వారికి సమస్త కోరికలు తీరి భోగమోక్షములు లభించును.

## జ్యేష్ట మాస వ్రతములు

## 19. వటసావిత్రీ వ్రతము

### (జ్యేష్ఠ కృష్ణ అమావాస్య)

వట వృక్షము దేవ వృక్షము. వట వృక్షమునకు మూలభాగమందు బ్రహ్మ, మధ్యభాగమందు విష్ణువు, అగ్రభాగమందు శివుడు ఉందురు. సావిత్రీదేవి వటవృక్షమందు ప్రతిష్ఠితమైయుండును. ప్రళయ కాలమందు శ్రీకృష్ణుడు బాలరూపములో మార్కండేయ మునికి ఈ వట పత్రముపై ప్రథమ దర్శనమొసగెను. (వటపత్రసాయిగ) ప్రయాగలో గంగాతీరమున వేణీ (త్రివేణీ) మాధవుని సమీపమున అక్షయవట ముండెను. భక్తతులసీదాసు త్రివేణీ సంగమమందున్న అక్షయ వటవృక్షమును ఈ తీర్థక్షేత్రమనెను.

ఇదే విధముగ ఐదు వటవృక్షములు కూడియున్న స్థానమును పంచవటి అని పేర్కొనబడినది. కుంభజముని పరామర్శతో సీతారామలక్ష్మణులు వనవాస కాలమున ఈ పంచవటిలో నివసించిరి. వటవృక్షమూలికలను ఔషధములలో ఉపయోగించెదరు. ఇది దీర్ఘకాలము అక్షయమైయుండును. దీని ఆరాధించిన దీర్ఘాయువు సౌభాగ్యము అభ్యుదయ ప్రాప్తికలుగును.

ఈ వటవృక్షము క్రిందనే సావిత్రి తన పాతివ్రత్యముతో మరణించిన భర్తను పునర్ జీవితుని గావించెను. ఆ నాటినుండి ఈ వ్రతము వట సావిత్రీ నామముతో ఖ్యాతిగాంచెను. జ్యేష్ఠమాస వ్రతములలో ఇదియొకటి. ఈవ్రతమందు వటవృక్షమును పూజించెదరు. స్త్రీలు అఖండ సౌభాగ్యమునకు ఈ వ్రతము చేయుదురు. త్రయోదశి నుండి అమావాస్య వరకు మూడు దినములు ఉపవాసము చేయుదురు. త్రయోదశి దినమున వటవృక్షము క్రింద వ్రతసంకల్పము చేయవలెను.

**"మమవైధవ్యాది సకలదోష పరిహారార్థం బ్రహ్మసావిత్రీ ప్రీత్యర్థం సత్యవత్సావిత్రీ ప్రీత్యర్థం చ వటసావిత్రీ వ్రతమహం కరిష్యే।"**

అని ఈ విధముగ సంకల్పముచేసి మూడు దినములు ఉపవాసముచేయలేని వారు, త్రయోదశిరాత్రి భోజనముచేసి చతుర్దశి అమావాస్యలందు ఉపవాసముచేసి, ప్రతిపదాతినాడు పారాయణ చేయవలెను. అమావాస్యనాడు ఒక రాగి బుట్టలో సప్తధాన్యములుపోసి దానిపై బ్రహ్మను స్థాపించవలెను. రెండవ పాత్రలో సత్యవంతుని సావిత్రిధి ప్రతిమలను స్థాపించవలెను. వటవృక్ష సమీపమున యథావిధిగ పూజించవలెను. యముని కూడ పూజించవలెను. పూజానంతరము స్త్రీలు వటవృక్షమును పూజించి జలము పోయవలెను. వృక్షమునకు ప్రదక్షిణచేసి నూటఎనిమిది మారులు "నమోవైవస్వతాయ" అను మంత్రముతో వటమునకు ప్రదక్షిణ చేయవలెను.

**"అవై ధవ్యంచ సౌభాగ్యం దేహిత్వమమ సువ్రతే ।**
**పుత్రాన్ పౌత్రాంశ్చ సౌఖ్యం గృహాణార్ఘ్య నమోఽస్తుతే ॥**



అను ఈ మంత్రముతో సావిత్రికి అర్ఘ్య ప్రదానముచేసి వటవృక్షమును ప్రార్థించవలెను. శెనగలపై రూపాయినుంచి వాయనముగా తమ అత్తగారికి ఇచ్చి ఆశీర్వాదము పొందవలెను. సౌభాగ్యపాత్రను పూజాసామాగ్రినిని బ్రాహ్మణునకు దానమీయవలెను. సింధూరము, దర్పణము, కాటుక, గోరింట, గాజులు, పసుపు, కుంకుమలు, సువర్ణము, చీర ఇత్యాది సౌభాగ్యవస్తువుల నన్నింటిని రాగిపళ్ళెములో పెట్టి సౌభాగ్యవతులను పూజించి ఇవ్వవలెను. కొందరు అమావాస్య ఒక్కదినముననే ఈవ్రతమును చేయుదురు.

**కథ :-** ఒకానొక సమయమున మద్రదేశమందు అశ్వపతియనురాజు రాజ్యమేలుచుండెను. ఇతనికి సంతానము లేకుండెను. సంతానము కొరకు యజ్ఞము చేసెను. దాని ప్రభావముతో కొంతకాలమునకు ఒక పుత్రిక జన్మించెను. ఈమె పేరు సావిత్రి. కన్య పెరిగి పెద్దదయ్యెను. వివాహము చేయతలచి వరుని వెదకసాగెను. సావిత్రి ద్యుమత్సేన పుత్రుడైన సత్యవంతుని పతిగా వరించెను.

నారదునకీ విషయము తెలిసి రాజు దగ్గరకు వచ్చి ఇట్లనెను. రాజా! "సత్యవంతుడు ధర్మాత్ముడు గుణవంతుడే, కాని అల్పాయువుగలవాడు, ఒక సంవత్సరము తరువాత అతడు మరణించును". అని నారదుడు చెప్పగ రాజు తన పుత్రికకు నచ్చచెప్పుటకు ప్రయత్నించెను. మరొకరిని వరించు మనెను. సావిత్రి తండ్రీ! కన్యలు భర్తగ ఒకరినే వరించెదరు. వేరొకరిని వరించ నని చెప్పెను.

రాజ్యము పోగొట్టుకొనిన ద్యుమత్సేనుడు భార్యతోను పుత్రునితోను కలసి వనమందొక వృక్షము క్రింద నివాసము చేయుచుండెను.

అశ్వపతి సావిత్రిని సత్యవంతుని కిచ్చి వివాహముచేసెను. వనమందు సావిత్రి అత్తామామలను సేవించుచుండెను. నారదుడుచెప్పిన మాటలు మరవలేదు. మరణ కాలము సమీపించు సమయము ఆసన్నమగుచుండగనే సావిత్రి ఉపవాసము చేయసాగెను. ఒకనాడు సత్యవంతుడు కట్టెలు కొట్టి తెచ్చుటకు వనమునకు వెళ్ళుటకు సిద్ధమగుచుండెను. సావిత్రికూడ అత్తమామల ఆజ్ఞను తీసుకొని సత్యవంతుని వెంట వనమునకు వెళ్ళెను. సత్యవంతుడు ఒకచెట్టును ఎక్కబోవగ తలనొప్పివచ్చి సావిత్రి ఒడిలో తన శిరస్సునుంచి పరుండెను. కొంతసేపటికి యముడు తనదూతలతోవచ్చి సత్యవంతునకు యమపాశమువేసి తీసుకొనిపోవుచుండగ సావిత్రికూడ యముని వెంటపడెను.

యముడు సావిత్రితో సావిత్రీ! "ఇంతవరకెవ్వరు మరణించినవారి వెంట మరొకరు సజీవముగ రాలేదు. నీవు వెనుకకు తిరిగిపొమ్మనెను". సావిత్రి, నా పతి ఎక్కడికిపోయిన అక్కడికి నేను కూడ వచ్చెదను, ఇది సనాతన ధర్మము, ఇది సత్యమనెను.

యముడు సావిత్రి ధర్మవాక్కులకు సంతసించి "వరమడుగుమనెను". సావిత్రి "నా అత్తమామలు అంధులు వారికి నేత్ర జ్యోతిని ప్రసాదించు" డనెను. యమధర్మ

రాజు అట్లే ప్రసాదించితిని. ఇంక తిరిగి వెళ్ళు మనెను. ఐనను సావిత్రి యముని వెంట పడుచునే యుండెను. యముడు పునః "వరమడుగుమ"నెను. సావిత్రి "నా మామగారు పోగొట్టుకొనిన రాజ్యము తిరిగి పొందవలెనని కోరుకొనెను". యమధర్మ రాజు తథాస్తు పలికి ఇంక సావిత్రిని తిరిగివెళ్ళు మనెను. ఐనను సావిత్రి వెంటపడుట మానలేదు. సావిత్రి పతిభక్తికి యముడు ద్రవించెను. సావిత్రీ! మరి ఒక్క వరము కోరు కొమ్మనెను. "సావిత్రి నేను సత్యవంతుని నూరుగురు పుత్రులకు తల్లిని గావలెనని కోరుకొనెను. దయతో నాకీవరమిండ"నెను.

యమధర్మరాజు సావిత్రి పతి భక్తికి ప్రసన్నుడై అంతిమ వరమును కూడా ప్రసాదించి సత్యవంతుని యమపాశవిముక్తినిగావించి అదృశ్యమయ్యెను.

సావిత్రి వనమున పడియున్న సత్యవంతుని దగ్గరకు తిరిగి వచ్చెను. వట వృక్షము క్రింద పడియున్న సత్యవంతుడు లేచి కూర్చుండెను.

సత్యవంతుని తల్లితండ్రులకు నేత్ర దృష్టి వచ్చెను. పోయిన రాజ్యము తిరిగి వచ్చెను. సావిత్రి వ్రతకీర్తి దేశమంతటా వ్యాపించెను. సౌభాగ్యవతులు వ్రతము చేసుకొని ఈ కథను వినవలెను. వారికి సమస్త కోరికలు తీరును.

## ౨౦. గంగాదశహర (జ్యేష్ఠశుక్ల దశమి)

**నమామిగంగే తవ పాద పంకజం సురాసురైర్వన్దిత దివ్యరూపమ్ ।**
**భుక్తించ ముక్తించ దదాసి నిత్యం భావానుసారేణ సదా నరాణామ్ ॥**

హేమాత గంగే! సురాసురలతో పూజింపబడు నీదివ్య చరణకమలములకు నమస్కారము. నిత్యము నిన్ను పూజించు మనుష్యులకు వారి భావానుసారముగ భుక్తిని ముక్తిని ప్రసాదించుము.

గంగ దేవనది. మానవ కల్యాణార్థము భూమిపైకివచ్చినది. జ్యేష్ఠశుక్లపక్ష దశమినాడు భూమిపై గంగ అవతరించినది. అందువలన ఈ తిథి ఆమె నామముపై గంగాదశహర నామముతో ప్రసిద్ధిగాంచినది. ఈ తిథి సోమవారము హస్తా నక్షత్రమై యున్న ఇది సమస్త పాపములను హరించును. జ్యేష్ఠశుక్ల దశమి సంవత్సరము ను ముఖమని యందురు. (కాలముఖము) ఈ దినము స్నానముచేసి దానముచేసిన మంచిది. ఈ తిథియందు గంగా స్నానముచేసి గంగను పూజించిన పదిరకముల పాపములు (కాయికము, శరీరసంబంధమైనవి మూడు, వాచిక సంబంధమైనవి నాలుగు, మానసిక సంబంధమైనవిమూడు, ఈ పది పాపములు) నశించును. ఇందు వలన ఇది దశహర యని చెప్పబడెను.

స్నానముచేసి, ఈ దినమున గంగా స్నానముచేయలేనివారు సమీపమందున్న నదియందుగాని లేక సరోవరమందుగాని, అభయముద్రాయుక్త మకరవాహిని గంగను ధ్యానించి పూజించవలెను. గంగనుతెచ్చిన భగీరథుని కూడ పూజించవలెను.



పదిరకముల పుష్పములు దశా గధూపములు, దశదీపములు దశవిధ నైవేద్యములు, పది తాంబూలమును పదిఫలములును, గంగకు సమర్పించవలెను. పదిమంది బ్రాహ్మణులకు దక్షిణ తాంబూలములను దానమీయవలెను. దానములో నువ్వులు, ధాన్యమును పదహారు పిడికిలలు ఇవ్వవలెను. గంగ పదిరకముల పాపములను నశింపజేయునదిగాన సమస్త వస్తువులు నైవేద్యములు పది పది చొప్పున నుండవలెను.

**కథ :-** శ్రీరాముడు అయోధ్యనగరమందు జన్మించెను. వాని పూర్వజుడు సగరమహారాజు. ఇతనికి కేశిని, సుమతి యను యిరువురు భార్యలు కలరు. అసమంజ సుడు కేశనీపుత్రుడు. సుమతికి అఱువది (60)వేలమంది పుత్రులు. అసమంజసుని పుత్రుడు అంశుమానుడు. సగరుని పుత్రులందరు దుష్టులే. కాని పౌత్రుడైన అంశు మానుడు ధార్మికుడు దైవ-గురుపూజాతత్పరుడు.

సగర మహారాజు దుష్టుడైన అసమంజసుని దేశబహిష్కారముచేసి, అంశ మానుని తన ఉత్తరాధికారిగ నియమించెను. సగరుని పుత్రులందరితోను దేవతలు దుఃఖములపాలగుచుండిరి.



ఒకమారు సగరమహారాజు అశ్వమేధ యజ్ఞము చేయుచు అశ్వమును విడచెను. ఇంద్రుడు అశ్వమేధయజ్ఞాశ్వమును తీసుకొని పాతాళమున కపిలముని ఆశ్రమమందు బంధించి యుంచెను. ధ్యాననిమగ్నుడైయున్న కపిలమునికి ఇది తెలియదు.

అశ్వము కొరకు సగరుని 60 వేల మంది పుత్రులు భూమిని త్రవ్వసాగిరి. ఐనను అశ్వము కానరాలేదు. అంతమున వారు పాతాళమందు వెదుక సాగిరి, కపిలముని ఆశ్రమమున ప్రవేశించిరి. అచట అశ్వమును చూచి క్రోధాగ్నులై శస్త్రము లతో కపిలముని సంహరించుటకు పరుగులు పెట్టిరి. ఆ ధ్వనులకు తపస్సులో నున్న కపిలముని నేత్రములు తెరచెను. వాని తేజస్సుతో 60వేలమంది పుత్రులు ఆక్షణముననే భస్మమయ్యిరి.

గరుడుని వలన ఈ విషయమును వినిన అంశుమానుడు కపిలముని ఆశ్రమమునకువచ్చి మునిని ప్రార్థించెను. వాని వినయమునకు ప్రసన్నుడైన ముని, అంశుమానూ! "అశ్వమును గొనిపొమ్ము పితామహుని యజ్ఞమును పూర్తిచేయుము. ఈ సగరపుత్రులు పాపులు అహంకారులు, గంగాజల స్పర్శతో (భస్మరాశికి) వీరికి ముక్తి కలుగు"నని చెప్పెను.

అంశుమానుడు అశ్వమును తీసుకొని వెళ్ళి పితామహుని యజ్ఞము పూర్తిగా వించెను. సగరుని తరువాత అంశుమానుడు రాజయ్యెను. కాని తన చిన్నాన్నల ముక్తి కొరకు చింతించసాగెను. కొంతకాలమునకు తనపుత్రుడు దిలీపునకు రాజ్య మొసంగి తాను వనమును వెళ్ళెను. తాను గంగను స్వర్గమునుండి పృథ్విపైకి తెచ్చు టకు గాను తపమాచరించసాగెను. తపస్సులోనే శరీరము అంతమయ్యెను. దిలీప

మహారాజుకూడ తనపుత్రుడు భగీరథునకు రాజ్యమప్పగించి తానుకూడ తన తండ్రి మార్గమునే అనుసరించెను. ఇతడుకూడ తపస్సులోనే అంతమయ్యెను. అనంతరము భగీరథుడు ఘోరమైన తపస్సు చేసెను. మూడుతరములనుండి కొనసాగుచున్న తపమునకు ప్రసన్నుడైన బ్రహ్మ భగీరథునికి ప్రత్యక్షమై "వరముకోరుకొమ్మ"నెను.

భగీరథుడు "హే పితామహా! నా పూర్వజులు అఱువదివేలమంది కపిలముని శాపముతో భస్మమయ్యిరి. వారు ముక్తులగుటకు గంగను పృథ్విపైకి పంపు"డని కోరెను.

బ్రహ్మ, "నేను గంగను పృథ్విపైకి పంపుదును. కాని దాని వేగమును ఎవరాప గలరు? దీనికిగాను నీవు దేవాధిదేవుడైన శంకరుని ఆరాధించు" మనెను.

భగీరథుడు ఒకే కాలుపై నిలువబడి తపమాచరించి శంకరుని ప్రసన్నుని గావించు కొనెను. శంకరుడు తన జడలయందు బంధించియున్న గంగను ఒక జడను వదిలెను. ఒకపాయను పృథ్విపైకి వదలెను. భగీరథునివెంట గంగ వెళ్ళసాగెను. ముందు భగీరథుడు వెనుక గంగ. గంగకు మార్గమందు జాహ్నమహర్షి ఆశ్రమము కనుపించెను. గంగవాని కమండలమును దండమును కొట్టుకొని పోవసాగెను. ఇది చూచిన ఋషి గంగను త్రాగివేసెను. వెనుకకు తిరిగి చూచిన భగీరథునకుఇది అంతయు తెలిసిపోయెను. వెనుకకు తిరిగివచ్చి మునిని ప్రార్థించెను. ప్రసన్నుడైన ముని గంగను తనపుత్రికగా తలచి ఆమెను తన కుడి చెవి నుండి వెలుపలకు వదలెను. ఇందువలన గంగకు జాహ్నవి నామము గలిగెను. భగీరథుని తపస్సుతో అవతరించిన కారణమున గంగకు "భాగీరథీ" యను నామము గలిగెను.

అనంతరము భాగీరథీ గంగ మార్గమంతయు సశ్యశ్యామలముచేయుచు, కపిలముని ఆశ్రమమునకు వెళ్ళి భగీరథుని అరువదివేల మంది పూర్వజుల భస్మరాశిని పవిత్రము గావించెను. గంగా స్పర్శతో వారందరు దివ్యరూపములను ధరించి దివ్యలోకములకు వెళ్ళిపోయిరి.

## 21. నిర్జల ఏకాదశి (జ్యేష్ఠశుక్ల ఏకాదశి)

జ్యేష్ఠమాసమందొచ్చు శుక్లపక్ష ఏకాదశిని నిర్జల ఏకాదశి యని యందురు. అన్యమాస ఇతర ఏకాదశి తిథులందు ఫలహారమును స్వీకరించవచ్చును. కానీ ఈ ఏకాదశి నాడు జలమును కూడ స్వీకరించరాదు. ఇది గ్రీష్మఋతువునందొచ్చును. బహుకష్టసాధ్యమైనది. ఇది ఆరోగ్యవృద్ధిని, ఉత్తమలోకప్రాప్తిని కలిగించును. మహాభారతానుసారము అధికమాసముతో కలసి మొత్తము ఇరువది ఆరు (26) ఏకాదశులనుచేయకున్నను, కేవలము ఈ నిర్జల ఏకాదశీ వ్రతమును చేసిన సంపూర్ణ ఫలము లభించును.

నిర్జల ఏకాదశీ వ్రతానంతరము ద్వాదశినాడు స్నానమాచరించి శక్తికి తగినట్లుగ బంగారులేక ఇతరకలశములేవైనను జలముతో నింపి దానము చేయవలెను. అనంతరము వ్రతపారాయణ నివేదన ప్రసాదమును స్వీకరించవలెను.



**కథ :–** పాండవులలో భీమసేనుడు అందరికంటె బలవంతుడు, శక్తిమంతుడు. ఇతని ఉదరమందు వృక నామముగల అగ్ని గలదు. అందువలన ఇతనిని వృకోదరు డందురు. ఇతడు నాగలోకమునకువెళ్ళినప్పుడచట పదికుండముల (కుండల) రసమును త్రాగినందువలన ఇతనికి పదివేల గజములతో సమానమైన శక్తి ప్రాప్తించెను. ఈ రసపాన ప్రభావమున ఇతనికి ఆకలి అధికముగనుండును. పాండవులు, ద్రౌపది అందరు ఏకాదశీ వ్రతములను చేయువారు. భీమునకు మాత్రము కష్టముగ నుండెను. వ్యాసులవారు ఇతనికి ఒక్క నిర్జల ఏకాదశి వ్రతమును మాత్రము చేయు మనియు, ఇది చేసిన అన్ని ఏకాదశుల ఫలము దక్కుననియు చెప్పెను. వ్యాసులవారి ఉపదేశానుసారము భీమసేనుడు ఈ నిర్జల ఏకాదశీ వ్రతముచేసెను. ఇందువలన ఈ ఏకాదశికి "భీమసేన ఏకాదశి" యను నామము కూడ కలిగెను.

## ఆషాఢమాస వ్రతములు

## 22. శ్రీ జగన్నాథ భగవానుని రథయాత్ర

### (గుండిచా మహోత్సవము) (ఆషాఢశుక్ల ద్వితీయ)



జగన్నాథ భగవానుని ద్వాదశ యాత్రలందు గుండిచాయాత్ర ముఖ్యమైనది. విశ్వకర్మ జగన్నాథుని బలభద్రుని సుభద్రలయొక్క ప్రతిమలను దేవదారు కొయ్యలతో నిర్మించి ఈ మందిరమందుంచెను. ఇంద్రద్యుమ్న మహారాజు ఈ మూర్తులను మందిర మందు ప్రతిష్ఠించెను. గుండిచా మందిరమును బ్రహ్మలోకమనియు జనకపుర మనియు అందురు. ఇచట జరుగు మహోత్సవమును గుండిచా మహోత్సవమందురు.

శ్రీకృష్ణ బలభద్ర సుభద్రలకొరకు మూడు రథములను నిర్మించెదరు. ఇవి అతి సుందరముగ నుండును. రథ మహోత్సవ సమయమున మార్గమంతయు పుష్పములతో వస్త్రములతో అలంకరించియుండును. మార్గమునకు ఇరువైపుల సుగంధ ధూపపాత్రలనుంచెదరు. బజారులందు చందన జలమును జల్లుదురు. నగారా, ఢక్కా ఆది వాయిద్యములు మ్రోగుచుండును. బంగారు, వెండి ధ్వజముల తోను చిత్రకారులు సిద్ధముచేసిన పతాకములతోను, వైజయంతీ మాలలతోను బహు శృంగారముగ నుండును. గజములు అశ్వములు శృంగారముగ నుండును.

ఆషాఢ శుక్ల పక్షమున పుష్యనక్షత్రయుక్త ద్వితీయ తిథియందు అరుణోదయ సమయమందు భగవానుని పూజించెదరు. బ్రాహ్మణులు వైష్ణవులు తపస్వులు యతులందురు కలసి చేతులు జోడించి భగవానుని యాత్రలో పాల్గొని ఈ విధముగ ప్రార్థించెదరు.

"ప్రభూ! మీరు పూర్వకాలమున ఇంద్రద్యుమ్న మహారాజుని ఆజ్ఞాపించిన విధముగ రథయాత్ర జరుగుచున్నది. వచ్చి మండపములందు ఆశీనులుకండు. మీకృపాకటాక్ష వీక్షణములతో దశదిశలందున్న సర్వప్రాణులకు శుభము"గలుగును. జనోద్ధరణ కొరకేమీరు ఈ అవతారమును ధరించితిరి. ప్రసన్నులైరండు.

జనులు మంగళగీతములు పాడుచుండిరి, జయ జయ గానములు చేయు చుండిరి. సూత మాగధులు భగవానుని యశస్సును గానము చేయుచుండిరి. భగవాను నకు ఇరువైపుల సువర్ణమయమైన (కుంచెలతో) వానితో వింజామరలు వీచు చుండరి. సుగంధ అగరు ధూపముల సువాసనలు అంతటా వ్యాపించియుండెను. వీణా వేణు ఆది మధుర వాయిద్య నాదములతో గోవిందుని రథయాత్రకు సిద్ధపడు చుండిరి. మూడు రథములందు శ్రీకృష్ణ బలరాములను సుభద్రను ఆశీనులను గావించిరి. వివిధ అలంకారములతో శోభాయమానముగ నుండెను. ఈ విధముగ రథములందు విరాజమానులైయున్న జగన్నాథుని దర్శించినవారుభగవానుని ధామమున కేగుదురు. వీని నామమును కీర్తించిన నూరు జన్మల పాపము నశించును. వైష్ణవులు భగవానునకు సాష్టాంగ ప్రణామము చేయుదురు. కొందరు నృత్యములు చేయుదురు. మరికొందరు గీతాలాపనలు చేయుచుందురు. శ్రీకృష్ణునివైపు భక్తితో చూచుచు జయ కృష్ణ జయ కృష్ణ జయ కృష్ణ యనుచు తన్మయులగుచుందురు. సహస్రనామములను పఠించుచు రథము నకు ప్రదక్షిణ చేయుచుందురు. కొందరు భగవానుని ఎదుట నిలచి అడగుగడుగునకు దండములు పెట్టుచు భగవానుని ముఖారవిందమును గాంచుచు గానము చేయు చుందురు.



ఈ విధముగ శ్రీకృష్ణ బలరామ సుభద్రలు రథములందు ఆశీనులై తమ స్పర్శవాయువులను జనులకు ప్రసాదించుచు రథయాత్ర చేయుచుందురు. ఈ విధముగ ప్రతి సంవత్సరము జనులకు దర్శనమొసగుదురు. భగవానుడీవిధముగ బిందు తీర్థతీరమునకు వెళ్ళి అచట ఏడురోజులు(7) నివాసముండును. యేలనన, ప్రాచీన కాలమున ఇంద్రద్యుమ్న రాజునకు ఈ విధముగ వరమొసగెను.

"నేను నీ తీర్థ సమీపమున ప్రతి సంవత్సరము 7 రోజులు నివాసముందును. నేనిచటనున్నప్పుడు సమస్త తీర్థములు ఇందు నివాసముండును. దీనిలో స్నానము చేయుచు ఏడు దినములు గుండిచా మండపమందున్న నన్ను బలరాముని సుభద్రను దర్శించి పూజించువారు నా సాయుజ్యమును పొందుదురు. ఈ ఏడు దినములు మౌనభావముతో నుండి మూడువేళల స్నానమాచరించి కలశస్థాపన చేసి భక్తితో భగవా నుని పూజించవలెను. ఆవునేతితోగాని నువ్వులనూనెతోగాని దీపమును వెలిగించ వలెను. భగవానుని ఎదుట భగవన్నామమును జపించుచు జాగరణ చేయవలెను. ఇట్లు ఏడు దినములుచేసి ఎనిమిదవ రోజున వ్రతమును సమాప్తము గావించవలెను. ఈ విధముగ చేసిన ధర్మార్థ కామ మోక్షములను పొందుదురు.

ఎనిమిదవ రోజున మూడు రథములను దక్షిణాభిముఖముగ చేయుదురు. ఆషాఢశుక్లనవమి ప్రాతఃకాలమున రథములందు విగ్రహములను ఆశీనులను గావిం చెదరు. భగవానుని దక్షిణాభిముఖ యాత్ర దర్శనము అతి దుర్లభమైనది. భగవానుని రథయాత్ర 'పునఃమందిర ప్రవేశము' ఇవి రెండు మహోత్సవములు. గుండిచా మండపములందు విరాజమానులై యున్న రథములు తిరిగి దక్షిణదిశగా వచ్చుట దర్శించిన వారు మోక్షమును పొంది వైకుంఠ ధామమున కేగుదురు. ప్రతి దినము దీనిని చదివను, వినినను భగవానుని కృపనుపొంది వైకుంఠ ధామమునకేగుదురు.



## 23. వ్యాసపూజ-గురుపూర్ణిమల మహిమ (ఆషాఢపూర్ణిమ)

గురువు సర్వేశ్వరుని సాక్షాత్కరమును గలుగజేయును. జననమరణ బంధన ములనుండి విముక్తుని చేయును. అందుచేత లోకమందు గురువుయొక్క స్థానము విశేషమైనది. పరాశరుని కృపవలన వ్యాసుడు భారత వసుంధరలో ఆషాఢ పూర్ణిమ నాడు అవతరించెను. ఇందువలన ఆషాడశుక్ల పూర్ణిమనాడు అందరు తమ తమ గురువులను విశేషముగ పూజించెదరు. వ్యాసుడు గురువులకు గురువు. ఈ గురుపూజ విశ్వవిఖ్యాతి గాంచినది. ఇది వ్యాసుని పూజించు పర్వదినము. ఈ పూజోత్సవము నాడు సత్సంగములు జరుగును. విజ్ఞాన జ్ఞానములులేనిదే మోక్షము లభించదు. అట్లే సద్గురువులేనిదే జ్ఞానము ప్రాప్తించదు. గురువు సంసార సాగరమును దాటించును. గురోపదేశజ్ఞానము నావవంటింది. ఈ జ్ఞానమును పొందినవారు భవసాగర మునుదాటి కృతకృత్యులగుదురు. శ్రీకృష్ణభగవానుడు జగత్తునకే గురువు. ఇట్టి భగవానునకు పదే పదే ప్రణామములు.

"కృష్ణం వందే జగద్గురుమ్"

**గురుర్బ్రహ్మ గురుర్విష్ణుగురుదేవో మహేశ్వరః ।**
**గురుస్సాక్షాత్పర బ్రహ్మ తస్మై శ్రీ గురవే నమః ॥**

గురుపూర్ణిమను వ్యాసపూర్ణిమ యనియు అందురు. వశిష్ఠమహర్షి పౌత్రుడైన పరాశర ఋషి పుత్రుడు వేదవ్యాసుడు. ఇతడు జన్మించిన మరుక్షణమే తల్లితో "అమ్మా! నేను తపస్సు చేసికొనుటకు వెళ్ళుచున్నా"ననెను. తల్లి "పుత్రా! పుత్రుడు తల్లి తండ్రులను సేవించుట ధర్మము, వారి కార్యములు నెరవేర్చుట ధర్మము. మరి నీ విప్పుడే వెళ్ళుచున్నావా"? యనెను.

వ్యాసుడు "అమ్మా! నీవెప్పుడు తలచిన అప్పుడు నీ ఎదుట ప్రత్యక్షమగుదును. నీవు కోరినది నెరవేర్చెదను". అనిమాట ఇచ్చి తల్లి ఆజ్ఞతో వ్యాసుడు తపమునకు వెళ్ళిపోయెను.

బదరికాశ్రమమునకు వెళ్ళి తపో నిష్ఠుడయ్యెను. రేగుచెట్టు చెంత జీవనము గడిపినందువలన ఇతనికి "బదరాయణు"డను నామము కలిగెను. ద్వీపమున ప్రకటమైనవాడు గనుక "ద్వైపాయన" నామము గలిగెను. నల్లని వాడు గనుక కృష్ణద్వైపాయనుడందురు. వేదములను విస్తరింప జేసినవాడు గనుక "వేద వ్యాసు"డయ్యెను.

జ్ఞానసాగరుడు భక్తికాచార్యుడు విద్వత్ పరాకాష్ఠుడు అపారక విత్వశక్తి సంపన్నుడు, ఆషాఢశుక్ల పూర్ణిమనే వ్యాసపూర్ణిమ అందురు.

వేదములను విభజించిన వాడు, బ్రహ్మసూత్రకారుడు పంచమవేదమైన మహా భారతమును రచించినవాడు భక్తి గ్రంథమైన భాగవత పురాణమును రచించినవాడు, అష్టాదశ (18) పురాణములను ప్రతిపాదించినవాడు, మానవజాతి కల్యాణమునకు మార్గము చెప్పినవాడు, వేదవ్యాసునికృప సమస్త సాధకుల చిత్తములందు చిరస్థాయిగ నుండును.వ్యాసుని శాస్త్రములే ఆధ్యాత్మిక ఉపదేశకములు.

గురువు ఋణము తీర్చుకొనుటయే వ్యాస పూర్ణిమ (గురు పూర్ణిమ) పర్వదిన మును జరుపుకొనుట శ్రీరాముడుకూడ గురువు చరణారవిందములకు తల్లిదండ్రుల పాదారవిందములకు నమస్కారము చేయువాడు.

గురుజనులను శ్రేష్ఠజనులను పెద్దవారిని పూజించుట భారతీయ సనాతన సంస్కృతి. గురుపూర్ణిమ ఆస్తికులకు పర్వదినము.

### శ్రావణమాస వ్రతములు

## 24. చాతుర్మాస్య వ్రతము

### (శ్రావణము మొదలు కార్తీకము వరకు)



విష్ణుభగవానుని శయనానంతరము చాతుర్మాస్యవ్రతమొచ్చును. ఇది అనంత ఫలమొసగును. దీనికి కొన్ని నియమములుగలవు. విష్ణుభగవానుని ప్రీతికొరకు నియమ జపహోమాదులు చేయవలెను. ఇది అనంత ఫలమొసగును. శాఖాహారులై సంవత్సరములో నాలుగునెలలు నియమములను ఆచరించవలెను. విష్ణుభగవానుని శయ కాలమైన ఈ నాలుగు నెలలు నక్షత్రములను దర్శించి ఒక్కపూట భుజించవలెను. ఇట్టివారు ధనవంతులు రూపవంతులగుదురు. అయాచిత అన్నమును భుజించ వలెను. బ్రహ్మచర్యమును పాటించవలెను. ఉప్పునుతినరాదు. విష్ణుసూక్త మంత్రము లతో నువ్వులను ధాన్యమును ఆహుతిగావించవలెను. ప్రతిదినము స్నానానంతరము విష్ణుభగవానుని ఎదుటనిలచి పురుషసూక్తమును జపించవలెను చేతియందు యేదేని పండునుపెట్టుకొని మౌనముగ విష్ణుభగవానునకు 108 ప్రదక్షిణలు చేయవలెను. కార్తీకమాసమున శ్రేష్ఠుడైన బ్రాహ్మణునకు మృష్టాన్నమును పెట్టవలెను. ఇట్లొనర్చిన సోదర బంధువియోగము గలుగదు, విమానమున కూర్చుండి స్వరమున కేగుదురు. కోరికలు ఫలించును, రోగ విముక్తులగుదురు. బుద్ధి వికసించును, పాపములు తొలగును. అగ్నిష్టోమయజ్ఞఫలము లభించును.

ఈ నాలుగు నెలలు వేదాధ్యయనముతో విష్ణువును ఆరాధించి మందిరమందు నృత్యగానాదులు సలిపిన గంధర్వభావము ప్రాప్తించును. నాలుగునెలలు పాటించ లేకున్న కార్తీకమాసం దైనను ఆచరించవలెను. ఈనాలుగు నెలలు దేవినైనను త్యజించు విధానము గలదు. ఆ త్యజించిన దానిని బ్రాహ్మణునకు దానమీయవలెను. అప్పుడు త్యాగము ఫలించును.



శ్రావణమాసమందు కృష్ణపక్ష ద్వితీయాతిథి శ్రవణానక్షత్రమున ప్రాతఃకాలము ననే లేవవలెను. పాపులతోను పతితులతోను మాట్లాడరాదు. స్నానానంతరము జలశాయి శ్రీహరిని సమీపించి ఈ మంత్రముతో పూజించవలెను.

**శ్రీవత్సధారిఞ్ఛ్రీకాంత శ్రీధామ శ్రీపతే ఽవ్యయ ।**
**గార్హస్థ్యం మా ప్రణాశం మేయాతు ధర్మార్థకామదమ్॥**
**పితరౌ మా ప్రణశ్యేతాం మా ప్రణశ్యన్తు చాగ్రయః ।**
**తథా కలత్ర సంబంధో దేవ మా మే ప్రణశ్యతు ॥**
**లక్ష్మ్యా త్వశూన్యశయనం యథా తే దేవ సర్వదా ।**
**శయ్యా మమాప్య శూన్యాస్తుతథా జన్మని జన్మని ॥**

శ్రీవత్స చిహ్నధారివైన లక్ష్మీకాంత! శ్రీధామ! శ్రీపతీ! అవినాశీ పరమేశ్వరా! ధర్మ అర్థ కామములతోకూడిన నాగార్హ స్థ్య ఆశ్రమమును నశింపజేయకుము. నా మాతాపితరులు నశించినను నా అగ్నిహోత్రగృహమును ఎన్నిటికి ఆరనీయకుము. నాభార్యతో సంబంధమును తొలగించకుము. హే దేవా! మీ శయన గృహము ఎన్నటికి లక్ష్మీ శూన్యము కాకుండు నట్లుగ ప్రతి జన్మయందును నాశయ్య ధర్మపత్ని లేకుం డుగ నుండరాదు అనుచు ఈ విధముగ స్తుతించి శక్తికి తగినట్లుగ బ్రాహ్మణుని పూజించవలెను. ఇదే విధముగ భాద్రపద ఆశ్వీయుజ కార్తీక మాసములందు జలశాయిని పూజించి ఉప్పు లేకుండగ అన్నమును భుజించవలెను. వ్రతానంతరము బ్రాహ్మణునకు దానమీయవలెను. ధ్యానమును శయ్యను, వస్త్రమును సువర్ణాదులను దక్షిణగా నీయవలెను. ఇట్లొనర్చిన వారి యందు విష్ణుభగవానుడు సంతుష్టు డైయుండును.

## 25. శ్రావణ సోమవారము

శ్రావణ మాసము శివునకు అతి ప్రియమైనది. అట్లే సోమవారముకూడ ప్రియమైనది. శ్రావణమాసమంతయు శివుని పూజించలేకున్న కనీసము సోమవార మైనను శివుని పూజించవలెను. నాలుగు సోమవారములు అట్లే చేయ వలెను. ఈ మాసమందు లఘు రుద్రము మహా రుద్రము అతి రుద్రములు చేయించు విధానము గలదు. శ్రావణమాసమందు ఎన్ని సోమవారములు వచ్చిన అన్ని సోమవార ములు చేయవలెను. ఈ వ్రతము చేయువారు గంగా స్నానము గాని లేకున్న నదీ సరోవరము లందుగాని లేకున్న గృహములందైనను స్నానము చేయవలెను. శివుడు మందిరము లకు వెళ్ళి శివలింగమును పూజించవలెను. లేనిచో తమ గృహమందు పార్థివ (మట్టి) శివమూర్తినైనను పూజించవలెను. ఆ పార్థివ (మట్టి) శివునిమూర్తికి షోడశోప చార పూజలు చేయవలెను. పండితులైన బ్రాహ్మణునితో మందిరమందు రుద్రాభి షేకము చేయించవలెను. ఈ విధముగ వ్రతమాచరించుచు శ్రావణమాస మాహాత్మ్య మును, శివపురాణ మాహాత్మ్యములను వినవలెను. పూజానంతరము బ్రాహ్మణునకు

భోజనము పెట్టి తాము వంటిపూట మాత్రమే భుజించవలెను. ఈ వ్రతము చేయు వారికి సమస్త కోరికలు తీరును.

## 26. మంగళగౌరీ వ్రతము

శ్రావణమాసమందెన్ని మంగళవారములొచ్చునో అన్ని మంగళవారములు ఈ వ్రతము చేసి మంగళగౌరిని పూజించవలెను. ఈ వ్రతము వివాహానంతరము స్త్రీలు ఐదు సంవత్సరములు ఈ వ్రతమును చేయవలెను. వివాహమైన మొదటి సంవత్సరము పుట్టినింటియందును, తదుపరి నాలుగు సంవత్సరములు పతి గృహ మందును ఈ వ్రతమును చేసుకొనవలెను.

నిత్యకర్మలానంతరము ప్రాతఃకాలమందే స్నానముచేసి నూతన వస్త్రములు ధరించి (లేకున్నశుద్ధమైన వస్త్రముగాని) కుంకుమతిలకముపెట్టుకొని పూర్వాభి ముఖముతోగాని (తూర్పు) ఉత్తరాభిముఖముతోగాని ఆసనమున ఆసీనులై సంకల్పము చేసుకొనవలెను.

**“మమ పుత్రపౌత్ర సౌభాగ్యవృద్ధయే శ్రీ మంగలా గౌరీ ప్రీత్యర్థం పంచవర్ష పర్యన్తం మంగలాగౌరీ వ్రతమహం కరిష్యే!”**

అని ఈ విధముగ సంకల్పముచేసి గౌరీదేవిని ప్రతిష్ఠించవలెను. పిండితో పదునారు(16) ముఖములుగల ప్రమిదను చేసి, పదునాఱు వత్తులనువేసి నేతితో దీపములను వెలిగించవలెను. అనంతరము పవిత్రీకరణ స్వస్తివాచన గణేశపూజాదులు చేసి, కలశస్థాపనపూజ నవగ్రహపూజ షోడశమాతృకాపూజలు కూడ విధిగా ఆచరించ వలెను.

అనంతరము శ్రీమంగళాగౌర్యై నమః అను మంత్రముతో మంగళగౌరికి షోడశోపచారపూజ చేయవలెను. పూజకు పదునారు రకముల పుష్పములు, పదునారు మాలలు పదునారు వృక్షముల (రకముల) ఆకులు (పత్రి) పదునారు దూర్వాదళములు పదునారు దతూర పత్రములు, పదునారు రకముల ధాన్యము, పదునారు తమల పాకులు వక్కలు యాలుకలు జీరా ధనియాలు (లేకకొత్తిమీర) కూడ సమర్పించవలెను. నమస్కారముచేసి అర్ఘ్యము సమర్పించవలెను. వ్రతమాచరించు స్త్రీ రాగిపళ్ళెములో జలము గంధము అక్షతలు, పుష్పములు, ఫలములు దక్షిణ నారీఫలమును ఉంచి రాగిపాత్రను కుడిచేతితో పట్టుకొని అర్ఘ్యము సమర్పించవలెను. అనంతరము సౌభాగ్య ద్రవ్యములుగల రాగిపాత్రలో లడ్డూలు ఫలములు, వస్త్రమునుంచి బ్రాహ్మణునకు వాయన దానము నీయవలెను. ఆ తరువాత వ్రతము చేసిన స్త్రీ తన అత్తగారి పాదములకు నమస్కారముచేసి ఆమెకు పదునారు లడ్డూలను వాయన మీయవలెను.

మంగళగౌరికి పదునారు ముఖములుగల దీపములతో హారతినీయవలెను. ఆరోజురాత్రి జాగరణచేసి ప్రాతఃకాలమందే గౌరిని చెరువునందుగాని నదియందుగాని విసర్జించవలెను.



**ఈవ్రతకథ :–** కుండిన నగరమందు ధర్మపాలుడను ఒక ధనవంతుడుండెను. ఇతని భార్య సాధ్వి, పతివ్రత. వీరికి పుత్రులులేకుండెను. అన్నిసంపదలు కలిగి యున్నను ఈ దంపతులు సంతానము కొరకు దుఃఖించుచుండిరి. వీరి ఇంటికి ప్రతిరోజు రుద్రాక్షమాలాధారుడైన ఒక భిక్షువు వచ్చుచుండెడివాడు. ఆ ధనవంతుని భార్య ఇట్లాలోచించుకొనెను. ఈ భిక్షువునకు కొంత ధనము దానమొసగిన ఆపుణ్య ఫలముతో సంతానము కలుగునేమోయని తలంచి భర్త అనుమతితో వానిజోలియందు బంగారమును వేసెను. భిక్షువు అపరిగ్రహవ్రతధారుడగుటచే, తన వ్రతమునకు భంగము వాటిల్లినదని గ్రహించి, వారికి “సంతానము కలుగకుండుగాక యని శపించెను”. ఆ దంపతులు అతిప్రాధేయపడి ప్రార్థించగా అల్పాయువు గల నొకపుత్రుడు కలుగుననియు, అతనిని పదునారవ సంవత్సరములో సర్పము కాటు వేయగా మరణించుననియు శపించెను. ఐనను ఆ బాలుని వివాహము చేసుకొను బాలిక తల్లి మంగళగౌరీవ్రతము చేసినదైయున్న ఆ వ్రతప్రభావమున కలిగిన కన్య విధవ కాజాలదు. అప్పుడా బాలునకు శతాయువు గలుగును. ఇట్లు గాకున్న అతడు పదునారవ సంవత్సరములో సర్పము కాటువేయగ మరణించును అనిచెప్పెను. వారు ఆ భిక్షువుచెప్పినట్లే చేసిరి.



ఈ వ్రతము కాశీనగరమందు విశేషముగ జరుగును. ఐదుసంవత్సరములు ఈవ్రతముపూర్తియైన తరువాత ఉద్యాపనచేసుకొనవలెను. లేనిచో ఈ వ్రతము నిష్ఫలమగును. ఐదో సంవత్సరములో ఒక మంగళవారము ఉద్యాపన తీర్చుకొన వలెను.

ఆచార్యునితో సర్వతోభద్ర మండలమును నిర్మింపజేసి అందు కలశమును స్థాపించవలెను. కలశముపై మంగళగౌరి స్వర్ణ ప్రతిమను స్థాపించవలెను. గణేశాది దేవతలను పూజించి పదహారువత్తుల దీపముతో హారతి నీయవలెను. మంగళగౌరికి సమస్త సౌభాగ్య ద్రవ్యములను సమర్పించవలెను.

మరుసటి దినము యజ్ఞముచేయించి పదహారుమంది బ్రాహ్మనదంపతులకు పాయసాదులతో భోజనముపెట్టి నూతన వస్త్రములను సౌభాగ్యద్రవ్యములను దక్షిణలతోసహా దానమీయవలెను. అత్తగారి పాదములకు నమస్కారముచేసి ఆమెకు వెండిపళ్ళెములో పదహారులడ్డూలను నగలను వస్త్రములను సమర్పించవలెను. అందరికి భోజనములు పెట్టి తాము భుజించవలెను. ఈవిధముగ వ్రతము చేసిన వైధవ్యము గలుగదు. సౌభాగ్యవతులైయుందురు.

## 27. నాగపంచమి (శ్రావణ శుక్ల పంచమి)

శ్రావణ శుక్ల పంచమీ తిథిని నాగపంచమి యందురు. ఈనాడు నాగులను పూజించెదరు. నాగులకు మూలస్థానము పాతాళలోకము. నాగలోకమునకు రాజధాని భోగవతీపురము. ఇది పురాణ ప్రసిద్ధమైనది. గరుడపురాణము, భవిష్యపురాణము

చరకసంహిత సుశ్రుత సంహిత భావప్రకాశాది గ్రంథములందు వివిధ నాగుల విషయము వ్రాయబడియున్నది. పురాణములందు యక్షకిన్నెర గంధర్వులతోపాటు నాగులనుకూడ వర్ణించిరి. విష్ణుభగవానుడు నాగశేషశయనుడే. శివుడు గణేశుడు నాగులను ఆభరణములుగా అలంకరించుకొనిరి. సూర్యభగవానుని రథమందు ద్వాదశ నాగులు కలవని పురాణములందు గలదు. భారతీయ సంస్కృతియందు నాగదేవతను దేవతగా ఆమోదించిరి. గ్రామములందు నగరములందు గ్రామదేవత లోకదేవతలవలె నాగదేవతకు కూడ పూజాస్థలముగలదు.

ఒకమారు మాతృశాపముతో నాగలోకము జ్వలించసాగెను. నాగులకు దాహపీడానివృత్తికి ఆవుపాలను పోసిరి. నాగులను చల్లబరచిన భక్తులకు సర్పభయము గలుగదు. నాగపంచమీ కథకు ప్రవక్త సుమంతముని, శ్రోతపాండవ వంశీయుడైన శతానీకరాజు.

**కథ :-** దేవాసురులు సముద్రమంథనముచేయునప్పుడు లభించిన పదు నాలుగు రత్నములందు ఉచ్చైః శ్రవమను అశ్వరత్నముకూడ లభించెను. ఈ అశ్రము శ్వేత వర్ణముగలిగియుండెను. దానిని చూచిన నాగమాత కద్రూ మరియు విమాత వినత (గరుత్మంతునితల్లి) ఇరువురు అశ్వము రంగును గురించి వాదోపవాదములాడు కొనుచుండిరి. కద్రువ అశ్వకేశములు (తోక) శ్యామవర్ణమనియు కాదని వినతయు పందెములు వేసుకొనిరి. నామాట అసత్యమైన నేను నీకు దాసీనై దాస్యముచేయుదును. నీ మాట అస్యతమైన నీవు నాకు దాసీగా నుండవలెనని షరతులు పెట్టుకొనిరి. కద్రూ నాగులను అశ్వశరీరమందు ప్రవేశించి తోకను చుట్టుకొని యుండుడని ఆజ్ఞాపించెను. అందులకు నాగులు సమ్మతించలేదు. కద్రువ కోపముతో నాగులను శపించెను. పాండవవంశీయుడైన జనమేజయరాజు సర్పయజ్ఞమును చేయును, ఆయజ్ఞమందు మీరందరు జ్వలించి భస్మమయ్యెదరని శపించెను.

శాపభయముతో నాగులన్నియు వాసుకితో కలసి బ్రహ్మదేవుని శాపవిముక్తి గలిగించుమని ప్రార్థించిరి. బ్రహ్మ ఇట్లనెను. "యా యావరవంశమందు ఉత్పన్నుడై తపస్వియైన జరత్కారుడు మీసోదరి భర్త మీకు బావ యగును. వాని పుత్రుడైన ఆస్తీకుడు మిమ్మురక్షించు"నని బ్రహ్మ పంచమీతిథినాడు నాగులకు వరమొసగెను. ఈ తిథినాడే ఆస్తీకముని నాగులను రక్షించెను. అందువలన నాగపంచమినాడు నాగులను పూజించెదరు. ఒకేమారు భుజించవలెను. ధూపదీపనైవేద్యమును నాగులకు సమర్పించి పూజించవలెను.

నాగులందు అనేక జాతులుగలవు. మణిధారి ఇచ్ఛాధారి నాగులు కూడ గలవు. సమస్త ప్రాణులందు ఈశ్వరుడుండును. అందువలన జీవుల ఎడ దయగలిగి యుండవలెను. విషసర్పములు కొన్నిమాత్రమే యుండును. నాగులు మన కృషి (సేద్యము, పొలము, వ్యవసాయము) సంపదను కృషినాశక కీటకములనుండి రక్షించును. పర్యావరణమును వనసంపదలను నాగులు రక్షించును.



## 28. (శ్రావణ శుక్ల పూర్ణిమ)-రక్షాబంధనము

శ్రావణశుక్లపూర్ణిమను రక్షాబంధన పర్వదినమందురు. ఈ దినమున దేవతలను పూజించి పితరులకు తర్పణముగా వించవలెను. ఆవుపేడతో అలికి అచట కలశమును స్థాపించి దానిపై రక్షాసూత్రమునుంచి పూజించవలెను. దేవాసుర సంగ్రామమందు దేవతలు పరాజితులై అసురులు విజయులుగాక, ఇంద్రుడు దుః ఖముతో దేవగురువైన బృహస్పతి చెంతకు వెళ్ళి, "నాకు పరాభవమే సంభవించు చుండ ఇంక నేనెట్లు యుద్ధము చేయుదు"నని అడిగెను. ఈ విషయమును వార్తాలాప కులు చెప్పగా వినిన ఇంద్రాణి ఇంద్రునితో "రేపు శ్రావణశుక్ల పూర్ణిమ నేను విధి విధానముగ రక్షాసూత్రమును సిద్ధము చేయుదును. దానిని మీరు బ్రాహ్మణులతో కట్టించుకొనుడు. మీకు తప్పక విజయము లభించునని" చెప్పెను.

మరుసటిరోజు (పూర్ణిమనాడు) (రక్షాసూత్రమును) బ్రాహ్మణుల ఆశీర్వచనము లతో రక్షాబంధనమును కట్టించుకొనెను. దీనిప్రభావముతో ఇంద్రునకు విజయము లభించెను.

అప్పటి నుండి ఈ పర్వదినమున అక్క చెల్లెంద్రు తమ అన్నదమ్ముల చేతి మణికట్టునకు రక్షాసూత్రము (రాఖీ) ను కట్టు సాంప్రదాయము కొనసాగుచున్నది.



## 29. అశూన్య శయన వ్రతము-శ్రావణ కృష్ణ ద్వితీయ తిథి

ఒక కార్యమును దృఢముగ చేయవలెనని నిశ్చయించుకొనుటయే వ్రతము. బ్రహ్మచర్య వ్రతము, పాతివ్రత్య వ్రతము, ఫలహార వ్రతము ఇత్యాదులను వ్రత మందురు. మహారాణాప్రతాపుడు విధర్ముల నుండి మాతృభూమికి ముక్తి కలుగు నంతవరకు భూమిపై శయనించుదుననియు, మట్టిపాత్రలో భోజనము చేయుదు ననియు వ్రతము పట్టెను. వ్రతమొక తపము. అశూన్య శయనమనగా భార్యాభర్త లిరువురు నిత్యసాహచర్యముతో నుండుట (ఒకరిని విడచి ఒకరుండక) కొరకు, అశూన్య శయన వ్రతమును శ్రావణ కృష్ణ ద్వితీయ తిథి నాడు లక్ష్మీనారాయణుల మూర్తులను శయ్యపై శయనింపజేసి పూజించవలెను. దినమంతయు మౌనముగ నుండవలెను. సాయంకాలము పునఃస్నానముచేసి భగవానునకు శయనోత్సవమును చేయవలెను. చంద్రోదయమైనంతనే అర్ఘ్య పాత్రలో జలము ఫలపుష్ప గంధాక్షతలుంచి భగవానునకు అర్ఘ్యమీయవలెను.

హే "రమానుజ! సత్త్వస్వరూపులు, దేదీప్యమాన ప్రకాశదీపకులైన మీకు నమస్కారము"త అనుచు భగవానుని ప్రార్థించి భోజనము చేయవలెను.

ఆ ఋతువును లభించు ఫలములను బ్రాహ్మణునకు దక్షిణతో సహా ఈయ వలెను. పుల్లని ఫలములను నిమ్మనారంజాది స్త్రీ నామ ఫలములను బ్రాహ్మణు నకీయరాదు. చంద్రుడు లక్ష్మికి అనుజుడగుటచే వానిని కూడ పూజించవలెను.

చంద్రుని పూజించిన లక్ష్మిప్రసన్నురాలగును. సూర్యునివలె చంద్రుడు కూడ ప్రత్యక్ష దైవము. ఈ విధముగ పూజించిన లక్ష్మివారినెన్నటికి విడనాడదు. మూడు జన్మల వరకు వైధవ్యము (విధవ) గలుగదు. ఇది సమస్త కోరికలను తీర్చును, ఉత్తమ భోగములను ప్రసాదించును.

## 30. తీజ పర్వము (తృతీయ - తదియ తిథి)

ఈ తదియ వ్రతమును ప్రాతఃకాలమున ఉద్యానవనములకు వెళ్ళి, మామిడి అశోక పత్రములను పుష్పగుచ్ఛములను తెచ్చి గృహమందు పూజాస్థలమున నుంచవలెను. ఊయలను అలంకరించవలెను. దినమంతయు ఉపవాసముండి, శ్రీకృష్ణ భగవానుని విగ్రహమును ఊయలలో ఉంచి శ్రద్ధతో ఊయలనూపుచు మధుర మైన స్వరముతో పాటలు పాడవలెను. వివాహితులు నవయువతులు తమ మాతృ గృహమునకు సోదరుని వెంటవచ్చెదరు. తమ తమ స్నేహితురాండ్లతో, సఖియలతో నూతన వస్త్రాభరణములను ధరించి, సాయంకాలము సరోవరతీర సమీపమందు ఉద్యానవనములో ఊయలలూగుచు పాటలు పాడుకొందురు. శ్రావణశుక్ల తదియకు ముందురోజు కన్యలు నవ వివాహితులు తమ చేతులకు కాళ్ళకు గోరింటాకును పెట్టు కొందురు. ఎంతో ఉత్సాహముగ గడుపుదురు. రైతులు ఈనాడు వర్షము కొరకు ఎదురుచూచెదరు. ఇది వర్షాకాలపు పండుగ

## 31. పచ్చని పైరు తదియ పండుగ

### (రాజస్థాను పరంపర యందు హరియాలీతీజ పర్వము )

రాజస్థానునందు ఈ తదియను హరియాలీతీజ (పచ్చనిపైరుల తదియ) మం దురు. ఈ దినమున మహిళలు పార్వతిని పూజించెదరు. ఆడపడుచులు అత్తగారి ఇంటినుండి పితృగృహమునకు వచ్చెదరు. ఊయలలు వేసుకొని ఊగుదురు. చేతులకు గోరింటాకు పెట్టుకొందురు. చేతులపై కాళ్ళపై అతి శృంగారముగా చిత్రించు కొందురు. ఇది సౌభాగ్య చిహ్నము. ఈ తదియనాడు మూడింటిని త్యజించెదరు. పతిని మోసముచేసి కపటముగనుండుట, చెడ్డగ వ్యవహరించి అబద్ధములాడుట, పరులను నిందించుట ఇవి మూడింటిని త్యజించు విధానము కలదు. ఈ దినమున గౌరీదేవి విరహాగ్ని తపమునుండి శివుని చేరును. ఈ దినమున జయపూరునందు ఎఱ్ఱని వస్త్రమును ధరింపజేసి పార్వతీదేవిని గొప్పగ ఊరేగించెదరు.

## 32. కజలీ తీజము (శ్రావణ కృష్ణ తృతీయ తదియ)

శ్రావణ మాస కృష్ణ పక్ష తృతీయ తిథిని కజలీ తీజమందురు. ఈ దినమున పార్వతీ పరమేశ్వరులపై పాటలు పాడెదరు. ఈ తిథినాడు శ్రవణా నక్షత్రమున్న విష్ణువును పూజించి వ్రతము చేయుదురు. స్త్రీలు ఈ దినమున చేతులకు కాళ్ళకు



చిత్రాతి చిత్రముగ గోరింటాకు పెట్టుకొందురు. నూతన వస్త్రములను కట్టుకొని ఊయలలూగెదరు.

## 33. (శ్రావణ కృష్ణ పక్ష) నాగ పంచమి

శ్రావణ కృష్ణ పంచమిని నాగ పంచమి యందురు. అన్ని ప్రాంతములందు వారు ఈ నాగపంచమిని చేయుదురు. పుట్టలో నెయ్యి పంచదార పచ్చి పాలను వేసెదరు. పుట్టనుండి కొద్దిగ మన్నుతెచ్చి దానిని పాలతో తడిపి సర్పము వలెచేసి పూజించవలెను. అత్తగారి పాదములకు నమస్కారముచేసి మిఠాయిల వాయనము నిచ్చి ఆశీర్వాదము పొందవలెను. భుజించు పదార్థములను పంచమికి ముందు రోజే వండుకొనవలెను. పంచమిరోజు పొయ్యి వెలిగించరాదు. ముందు రోజు వండిన పదార్థములను తినవలెను. పుట్టనుండి తెచ్చిన మన్నును పాతర గుంటలో వేయవలెను. ఈవిధముగ చేసిన గృహమందు అన్నము నిండుగ నుండును.

## 34. శ్రావణీ ఉపాకర్మ

శ్రావణ శుక్ల పూర్ణిమను ఉపాకర్మ యందురు. ఇది బ్రాహ్మణులకు పండితులకు పర్వదినము. వేదపారాయణ శుభారంభమును ఉపాకర్మయందురు. ఈ దినము యజ్ఞోపవీత పూజావిధానము కూడ కలదు. ఈ దినమున ఋషులను పూజించుట, పాత యజ్ఞోపవీతములను తీసి నూతన యజ్ఞోపవీతములను ధరించుట ఈ దినము చేయు విశేష కృత్యములు. దీనిని గురువు తన శిష్యులతో చేయించును.



## 35. శ్రావణీ పర్వము - స్వాధ్యాయ పర్వము

వైదిక ధర్మమందు స్వాధ్యాయము ప్రధానమైనది. దీని మహిమను పదేపదే వర్ణించిరి. నాలుగు వర్ణముల వారియందు ప్రథమ వర్ణమైన బ్రాహ్మణులకు స్వాధ్యాయము ముఖ్య కర్తవ్యము. విరాట్పురుషుని దేహమందు సర్వశ్రేష్ఠమైన అంగము ముఖము. స్వాధ్యాయముతో ఈ శరీరమునకు బ్రహ్మప్రాప్తి యోగ్యతగలుగును. బ్రహ్మచర్యాశ్రమము కేవలము స్వాధ్యాయమునకొరకే. చదువుట చదివించుట యజ్ఞము చేయుట చేయించుట దానమిచ్చుట దానము తీసుకొనుట బ్రాహ్మణ కర్త వ్యము. మనదేశ ప్రాచీన పరంపర నిత్యవేదపఠనము. వర్షఋతువునందు ఋషులు మునులు సన్యాసులు వర్షకారణమున అరణ్యములను వనములను విడచి గ్రామము లకు సమీపమునవచ్చి యుందురు. అచట వేదాధ్యయనముతోను ధర్మోపదేశముల తోను, జ్ఞానచర్చలతోను చతుర్మాసములను గడిపెదరు. శ్రద్ధగలవారు వారి దగ్గరకు వెళ్ళి వేదాధ్యయమన ఉపదేశ శ్రవణములందు సమయమును గడుపుచు ఋషి జనులను సేవించు చుందురు. ఈ వేదాధ్యయనము శ్రావణ శుక్ల పూర్ణిమ నుండి ప్రారంభమగును. అందు వలన దీనిని శ్రావణీ ఉపాకర్మ యందురు.

## 36. వరలక్ష్మి వ్రతము

సూతమహర్షి శౌనకాదులతో జజమునులారా! కైలాసపర్వతముపై పార్వతీ పరమేశ్వరులు కూర్చొని యుండగ పార్వతి పరమేశ్వరునితో దేవా! లోకమున యే వ్రతము చేసిన స్త్రీలు సర్వసౌభాగ్యములను, పుత్రపౌత్రాదులనుపొంది సుఖముగ నుందురో చెప్పు"మని అడిగెను.

పరమేశ్వరుడు "దేవీ! శ్రావణమాస శుక్లపక్ష పూర్ణిమకు ముందుగ వచ్చెడి శుక్రవారము నాడు చేయవలెను. దీనిని సవిస్తరముగ చెప్పెద"వినుము.

పూర్వము మగధ దేశమున కుండినంబను ఒకపట్టణము గలదు. ఈ నగరమందు చారుమతియను నొక బ్రాహ్మణ స్త్రీ గలదు. ఈమె భర్తను దేవునిగా తలచి, ప్రతినిత్యము ఉదయముననే స్నానమాచరించి పుష్పములతో భర్త పాదములను పూజించి, తరువాత అత్తమామలను కూడ పూజించెడిది.

ఈమెపై లక్ష్మీదేవికి అనుగ్రహము కలిగి ఒకనాడు స్వప్నమందు, "శ్రావణ పూర్ణిమకు ము " నని చెప్పెను.

చారుమతి స్వప్నములోనే లక్ష్మీదేవికి ప్రదక్షిణ నమస్కారములుచేసి "నమస్తే సర్వలోకానాం జనన్యై పుణ్యమూర్తయే శరణ్యే త్రిజగ ద్వంద్వే విష్ణు వక్షస్థలాలయే" అని అనేక విధముల స్తోత్రముచేసి "ఓ జగజ్జననీ! నీ కటాక్షము కలిగెనేని జనులు ధన్యులగుదురు. విద్వాంసులుగను సకలసంపన్నులుగను నయ్యెదరు. నా జన్మాంతర పుణ్యమువలన మీ దర్శనభాగ్యము కలిగె"నని ప్రార్థించెను.

మహాలక్ష్మి చారుమతికి వరమునిచ్చి అంతర్థానమయ్యెను. చారుమతి తక్షణం బుననే మేల్కొని వరలక్ష్మి దేవిని కానక అది స్వప్నమని తలచి, ఆ స్వప్న వృత్తాంత మును భర్తతోను అత్తమామలతోను చెప్పగ వారు ఎంతో సంతోషించి శ్రావణము వచ్చినంతనే ఆ వ్రతము చేయుమని చెప్పిరి. అంతట చారుమతి శ్రావణమాసము వచ్చినంతనే వరలక్ష్మీదేవి చెప్పిన దినమున సూర్యోదయముననే లేచి స్నానమాచరించి గృహములో నొక ప్రదేశమున గోమయముతో అలికి మంటపము ఏర్పరచి, అందొక ఆసనమువేసి, దానిపై క్రొత్త బియ్యమునుపోసి, మట్టిచిగుళ్ళు మొదలుగు ఐదు విధము లైన చిగురుటాకు లతో కలశమును అలంకరించి అందు వరలక్ష్మీదేవిని ఆవాహనము చేసి, స్త్రీలందరితో కలసి సాయంకాలమున "పద్మాసనే పద్మకరే సర్వలోకైక బూజితే, నారాయణ ప్రియేదేవీ సుప్రీతాభవసర్వదా" అను శ్లోకముచే ఆవాహనాది పూజలుచేసి, తొమ్మిది సూత్రములు (ముడులు) గల తోరమును దక్షిణ హస్తమునకు కట్టుకొని వరలక్ష్మీదేవికి అనేక రములైన పిండివంటలను నివేదనచేసి, ప్రదక్షిణ నమస్కారములు గావించి నంతనే స్త్రీలందరి కాళ్ళయందు ఘల్లు ఘల్లుమను శబ్దము వచ్చుచుండగ, వారు కాళ్ళను జూచుకొనిరి. వారి అందరి కాళ్ళకు గజ్జెలు మొదలగు ఆభరణము లుండెను. ఇది అంతయు వరలక్ష్మీదేవి ప్రభావమని గ్రహించి, మరొక ప్రదక్షిణము చేయగ చేతులకు కంకణాది ఆభరణములు గలిగెను. మూడవ ప్రదక్షిణము చేసినంతనే



వారందరు సర్వాభరణ భూషితులైరి. వ్రతము పూర్తి యైనంతనే ఆ స్త్రీలందరిని వారి వారి గృహములనుండి వీరిని తీసుకొని పోవుటకు వాహనములు వచ్చి యుండెను.

స్త్రీలందరు తమతో ఈ వ్రతము చేయించిన బ్రాహ్మణోత్తముని పూజించి, పంద్రెండు(12) కుడుములు వాయనదానమును, దక్షిణతాంబూలములనిచ్చి నమస్కారము చేసిరి. బ్రాహ్మణోత్తముని ఆశీర్వాదములను బొంది వరలక్ష్మి దేవికి నివేదనచేసిన పిండివంటలను బంధువులతో కలసి అందరు భుజించిరి.

తరువాత అందరు తమకొరకు వచ్చి యున్న వాహనములపై ఎవరి ఇండ్లకు వారు పోయిరి. అంతట ఆ స్త్రీలందరు ప్రతి సంవత్సరము ఈ వ్రతము చేయుచు, పుత్రపౌత్రాదివృద్ధి కలిగి సర్వసంపదలు కలిగి సుఖముగ నుండిరి.

ఈ కథను చదువువారికి, వినువారికి సకలకార్యములు సిద్ధించును.

## భాద్రపద మాస వ్రతములు



## 37. గోపూజా వ్రతము (బహుచతుర్థి)

భాద్రపదమాసమందు వచ్చు కృష్ణపక్ష చతుర్థీ తిథిని బహుళ చతుర్థియందురు. ఈ వ్రతమును స్త్రీలు తమ సంతాన క్షేమమునకు చేయుదురు. ఈ దినమున గోవును పూజించెదరు. ఇది గోపూజా పర్వదినము, మరియు సత్యవచన మర్యాదా పర్వదినము. తల్లివలె గోమాత తనపాలతో మనుష్యులను రక్షించును గాన అందుకు కృతజ్ఞతగ అందరు ఈవ్రతమును చేయవలెను. ఈ వ్రతము సంతాన ప్రాప్తిని గలి గించును. ఐశ్వర్యమును పెంచును.

వ్రతవిధానవ - ఈ దినమున ఆవుపాలతో ఎట్టి పదార్థమునుగానిచేసి తిన రాదు, ఆ పాలను గోదూడలకే విడువవలెను. ఈ వ్రతముచేసి సాయంత్రము గోవును పూజించవలెను.

ద్వాపరయుగమందు శ్రీకృష్ణభగవానుడు అవతరించి వ్రజమందు అనేక లీలలు చేసెను. దేవతలుకూడ తమ తమ అంశలతో గోపకులుగను గొల్ల పిల్లలవలెను ప్రకటమైరి. గోశిరోమణి కామధేనువుకూడ తన అంశతో ఉత్పన్నమై, బహుళా నామముతో నందబాబా గోశాలయందు గోవుగా శోభించెను. బహుళా గోవుకు శ్రీకృష్ణుడనిని మాతృభావముండెను. శ్రీకృష్ణుని చూచినంతనే తన స్తనములనుండి క్షీరధారలు స్రవించును. కృష్ణుడా ధారలను పానము చేయువాడు.

ఒకనాడు ఈ గోవు వనమందు పచ్చని గడ్డికై తిరుగుచు మేయుచుండెను. శ్రీకృష్ణుడు తన మాయతో సింహరూపము ధరించి నిలచెను. గోవు వణకుచు దీన ముగ, "హే వనరాజా! నేను నా బిడ్డకు పాలు ఇచ్చి రాలేదు. అది నాకొరకు ఎదురుచూచుచుండును. అందుచేత నన్ను నీవు వెళ్ళనిచ్చిన నా బిడ్డకు పాలిచ్చి నీ

చెంతకు తిరిగి వచ్చెదను. అప్పుడు నన్ను భుజించుము". అని నంతనే సింహము "మృత్యుపాశమందు చిక్కుకొనిన జీవమును విడచిపెట్టిన అది తిరిగి వచ్చునని విశ్వసించుటెట్లు"? అనగ బహుళాగోవు సత్యముగ వచ్చెదనని శపధముచేసి చెప్పుచు ఇది నాధర్మ మని చెప్పెను. అప్పుడా సింహము గోవును విడచిపెట్టెను.

గోశాలయందున్న తన దూడ దగ్గరకు గోవుపరుగున వెళ్ళి దానికి పాలిచ్చి తిరిగి వెనువెంటనే సింహము దగ్గరకు తిరిగివచ్చెను. దానిని చూచి నంతనే సింహ రూపమందున్న శ్రీకృష్ణుడు దాని ఎదుట ప్రత్యక్షమయ్యెను. గోవుతో "నేను నిన్ను పరీక్షించతలచి ఈ రూపమున వచ్చితిని. నీధర్మ సత్య దృఢసంకల్పమునకు సంతసించి తిని. ఇందువలన నీవు ప్రతిగృహమందును పూజింపబడెదవు. జనులు నిన్ను గోమాత యని పిలచెదరు". అని వర మొసగెను. అంతట గోవు తిరిగి గోశాలకువెళ్ళి తన దూడతో ఆనందముగ జీవించెను. ఈ వ్రతముయొక్క ఉద్దేశ్యమేమనగ మనమంద రము సత్యప్రతిజ్ఞులము గావలెను. ఈ వ్రతపాలకులు సత్యధర్మములను అవశ్యము పాటించవలెను. అనాథులను రక్షించవలెను. ఈ విధముగచేసిన వారికి సమస్త కోరికలు తీరును.



## 38. శ్రీకృష్ణ జన్మాష్టమి (భాద్రపద కృష్ణ అష్టమి)

భాద్రపద కృష్ణ అష్టమి రాత్రి 12 గంటలకు మధురానగర కారాగారమందు వసుదేవపత్ని దేవకీ గర్భము నుండి షోడశకళలతో శ్రీకృష్ణ భగవానుడు అవతరించెను. ఈ దినము ఉపవాసము జాగరణలు చేయుదురు. భగవానుని శృంగారముగా అలంకరించి సేవించవలెను. భగవానుని కీర్తించుచు పూజించుట ప్రధానమైనది. మధుర బృందావనములందు ఈ ఉత్సవమును బహువిశిష్టముగ జరుపుదురు. సమస్త భారతీయ మందిరములందు శ్రీకృష్ణభగవానుని అలంకరించెదరు. గృహము లందు శ్రీకృష్ణుని లీలలను చిత్రించెదరు. ఊయలను అలంకరించెదరు. భగవానుని మూర్తిని శృంగారముగ అలంకరించెదరు. స్త్రీ పురుషులందరు ఉపవాసముండి రాత్రి 12 గంటలవరకు శంఖనాదములతోను ఘంటానాదములతోను శ్రీకృష్ణ జన్మోత్సవమును జరుపుకొందురు. హారతినిచ్చి భగవానుని గుణములను గానము చేయుదురు.

ఈ దినమున అరటి స్థంభములతోను మామిడి తోరణములతోను గృహము ద్వారములను అలంకరించెదరు. మంగళ ప్రదమైన కలశమును స్థాపించెదరు. ఆరోజు రాత్రిభగవానుని మూర్తి విగ్రహమునకును శాలగ్రామము నకును పంచామృత స్నానముచేయించి షోడశోపచారములతో విష్ణుభగవానుని పూజించెదరు. ధూపదీపాది నైవేద్యములను సమర్పించెదరు. తియ్యని పదార్థములను పలువిధములైన ఫలములను భగవానునకు నివేదన చేయవలెను. ఈ విధముగ వ్రతము చేసి మిఠాయిలను అందరికి పంచవలెను. ఇట్లొనర్చిన వారికి విష్ణులోకము ప్రాప్తించును.



## శ్రీకృష్ణభగవానుని ప్రాదుర్భావ మహోత్సవము

శాస్త్రములందు భారత భూమి లోకోత్తర మహిమగలదని వర్ణించిరి. ఇచట సృష్టి ప్రారంభము నుండి మంత్రద్రష్టలైన ఋషులు, మహర్షులు, మానవ జీవనము నకు సదాచార నియమాది సాధన సంపత్తిని, ఆదర్శనీయులగుటకు యుగాను సారముగ వివిధ శాస్త్రములను రచించిరి. ప్రతిమాసమందును తిథి వార నక్షత్ర యోగములతో ప్రతిదినము యేయే దేవీ దేవతలకు సంబంధించిన వ్రతములు ఉపవాస పర్వదిన ములు వచ్చునో నిశ్చయించిరి. భారతభూమి అనంతానంత తీర్థ భూమి, మనుష్యులకు కర్మభూమి, మునులకు, ఋషులకు తపోభూమి, ధర్మా చార్యులకు సాధనభూమి మరియు శ్రీకృష్ణ భగవానునికి అవతార లీలాభూమి.

"కృష్ణస్తు భగవాన్ స్వయమ్" శాస్త్రవచనానుసారము సచ్చిదానంద పరబ్రహ్మ పరమాత్మ సర్వేశ్వరుడైన శ్రీకృష్ణ భగవానుడు సమస్త అవతారములందు పరిపూర్ణ అవతారము. అచిన్త్య గుణశక్తియుక్తుడైన ప్రభువు తన దివ్యధామము నుండి భూతల ముపై అవతరించెను. యుగయుగాంతర కల్పకల్పాంతర భక్తుల కోరికలను తీర్చుటకు శ్రీకృష్ణుని అవతారము.

సుదర్శనచక్రావతారుడైన శ్రీ నింబార్కాచార్యుడు ఇట్లనెను.

"ఈ మధురాపురి ధన్యమైనది. మధురయందు ప్రకటమైన తరువాత భక్తవాంఛాకల్పతరువు పరమాత్మ తన యోగమాయ శక్తితో వసుదేవునివలన నంద గోకులముచేరి యశోదానందనుడుగ ప్రకటమయ్యెను. ఇక్కడి నుండే భగవానుడు తన మాధుర్యలీలలను ప్రారంభించెను. శ్రీ-భూ-లీలా-యను త్రిశక్తులతో ఐశ్వర్య ధైర్యమాధుర్య లీలలను భూమండలమున విస్తరింపజేసెను. ఇందువలన ఇతనిని లీలాపురుషోత్తముడనిరి. బృందావన విహారి. సర్వేశ్వర, శ్రీకృష్ణుని నిత్యనికుంజలీలలు పరమాహ్లాదినీశక్తి శ్రీరాధ సహచరియలతో కూడి కిశోరలీలలు మధురాతి మధురం. వ్రజలీలలు వెన్న దొంగలీలలు రోటికి బందీయగుట దుష్టులను వధించుట మధుర ద్వారకాలీలలు. ఇవి అన్నియు మాధుర్యలీలలే. వీనిలీలా గానములు శ్రవణ మనన చింతనాదులతో భక్తజనులు ఆనంద నిమగ్నులగుచుందురు.

శ్రీకృష్ణజన్మాష్టమినాడు శ్రీనింబార్కాచార్య పీఠమందును నింబార్క తీర్థమందును కొన్ని వందల సంవత్సరముల నుండి జన్మాష్టమివేడుకలు ఎంతో గొప్పగ పది దిన ములు వివిధ కార్యక్రమములతో ఉత్సవమును జరుపుదురు. అప్పుడు రాత్రి మూడు మారులు హారతినిచ్చెదరు. విష్ణుభగవానుడు దేవకీ వసుదేవులకు పుత్రుడుగ కంసుని వధించుటకు ప్రకటమయ్యెను. ఈ దినము మంగళప్రదమైనది. భాద్రపద కృష్ణాష్టమి సమయమున రోహిణీ నక్షత్రయోగముయున్న ఆ తిథి మనుష్యులకు మోక్షప్రదాయిని యగును. ఈ తిథియందు సాక్షాత్ సనాతన పురాణ పురుషోత్తమ ప్రభువు భూతలము పై అవతరించెను. ఇది ముక్తి నొసగుతిథి.

భాద్రపదమాస కృష్ణపక్ష అష్టమీతిథినాడు బ్రహ్మాదిదేవతలు దైత్యులను సంహరింపుమని శ్రీహరిని ప్రార్థించగ, దైత్యులకు వినాశహేతువైన రోహిణీ నక్షత్రయుక్త శుభతిథియందు దేవకీ గర్భమునుండి ప్రకటమయ్యెను.

నాలుగు వర్ణములవారు బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రులు తమ తమ శక్త్యానుసారము జన్మమహోత్సవమునుచేసి ఉపవాసముండవలెను. ఆనాడంతయు భుజించరాదు. శ్రీకృష్ణ జన్మోత్సవమునాడు భుజించినవారు నరక నివాసులగుదురు. అర్థరాత్రి సమయమున అష్టమి రోహిణీ నక్షత్రముతో కలసియున్న, ఆ తిథియందు చేయు ఉపవాసము కోటి యజ్ఞఫలమొసగును. కృష్ణాష్టమి లేక రోహిణీ నక్షత్రములు సోమ లేక బుధవారములతో కలసియున్న దానిని జయంతి అందురు. జన్మజన్మాంతర పుణ్యఫలమువలనగాని ఇట్టి యోగము ప్రాప్తించదు. ఇట్టి జయంతీ ఉపవాసము సౌభాగ్యప్రదాయిని, ఇది కోటి జన్మకృతపాపములను నశింపజేయును. జన్మబంధ విముక్తులై పరమ దివ్యవైకుంఠాది భగవద్ధామములందు నివసింతురు.

**వ్రత-ఉపవాస-మహోత్సవ సంక్షిప్త విధి :**

మొదట గురువును ప్రార్థించి గురువు ఉపదేశానుసారము జన్మాష్టమినాడు ఉపవాసముండి భగవానుని పూజించవలెను. కలశమును స్థాపించవలెను. తల్లి ఒడిలో పాలు త్రాగుచున్నట్లుగ బంగారముతోగాని, వెండితోగాని, రాగితోగాని ప్రతిమను చేయించి దానికి అభిషేకము చేయించి స్థాపించవలెను. పుష్పములు తులసీదళములను చేతపట్టుకొని హే జగత్పతీ! జగన్నాథా! హే పురుషోత్తమా! మీ పార్షదులతోను భగవతీదేవి తోను కలసి వైకుంఠము నుండి ఇచటకివచ్చి ఆసీనులు కండు అని ప్రార్థించి షోడశోపచారములతో పూజించి అర్చించవలెను. దేవకిని బాలకృష్ణుని శృంగారాది వస్తువులతో అలంకరించవలెను. అర్ఘ్యమును సమర్పించ వలెను. ధూపదీప నైవేద్య నీరాజనములతో సేవించవలెను. పుష్పాంజలి సమర్పించి ఆచార్యునకు విప్రజనులకు దాన దక్షిణ, తాంబూలములు సమర్పించవలెను. ఉత్సవ మును జరిపించిన విద్వాంసులకు పారణ (ఉపవాసానంత రము మరుసటి దినమున చేయు భోజనము) గావించవలెను.వారికి వస్త్రాదులు సమర్పించవలెను. వైష్ణవ జనులకు భోజనాదులుపెట్టి అనంతరము తాము భుజించవలెను. ఈ విధముగ జన్మాష్టమి వ్రతముచేసినవారు తమ వంశమందు 21 తరముల వారిని ఉద్ధరింప జేయుదురు. వ్రతకర్త అంతమున భగవద్ధామమును పొందును. దేవస్వరూపు లగుదురు. దేవగణములు వీరికి వందనములు చేయుదురు.

జన్మాష్టమీ పర్వదినము గురించి శ్రీకృష్ణభగవానుడు ధర్మరాజునకు చెప్పినట్లుగ భవిష్యపురాణాన్తర్గతమందు వర్ణించునట్లు ఈవిధముగ వర్ణించబడినది.

ధర్మరాజు శ్రీకృష్ణ భగవానుని "హే అచ్యుతా! జన్మాష్టమీ వ్రత విధానమును, యేకాలమందు దానిని చేయవలెను దానివలన కలుగు పుణ్యమెట్టిదో దయతో చెప్పుదని" అడిగెను.



కృష్ణుడు మహారాజా! మధురారంగస్థల మధ్యమున మల్లయుద్ధములో కంసుని అనుచరులను కంసుని నేను వధించిన అనంతరము పుత్రవాత్సల్యముతో దేవకీ మాత నన్ను తన ఒడిలోనికి తీసుకొని విలపించసాగెను. ఆ సమయమున రంగస్థల మందున్న మధువృష్ణి అంధకాది వంశీయులు వారివారి సతులతో దేవకీ మాతను చుట్టుముట్టి ఓదార్చుచుండిరి. వసుదేవుడుకూడ వాత్సల్యభావముతో రోదించ సాగెను. పదేపదే బలదేవుని (బలరాముని) నన్ను హృదయమునకు హత్తుకొనుచు హే పుత్రా! హే పుత్రా! యనుచు ఆనందాశ్రువులతో నేడు నా జన్మ సఫలమైనది నా జీవితము సార్థకమైనది, నా ఇరువురు పుత్రులు నన్నుచేరుకొనిరి. అని ఆనందించు చుండిరి.

అచట చేరియున్న యదువంశీయులందరు నాతో నా హే జనార్దన! నేడు మేమందరము ధన్యులమైతిమి. మీ ఇద్దరు సోదరులు కలసి దుష్టకంసుని వాని అనుచరులందరిని పరివార సహితముగా యమలోకమునకు పంపితిరి. మధు సూదనా! మధురాపుర మందే కాక సమస్తలోకములందును మహోత్సవము జరుగ వలెను. మమ్మనుగ్రహించి, మీరు పుట్టిన దినవార ఘడియలు మాకు చెప్పిన మేమా దినమున ఉత్సవము జరుపుకొందుము. హే కేశవా! హే జనార్ధన! మాపై కృపచూపు నాడని వేడుకొనిరి. ఆ సమయమున పూజ్యపితాశ్రీ "వత్సా! జనసముదాయ ప్రార్థనాను సారము జన్మాష్టమీవ్రతము చెప్పు"మనెను.

అప్పుడు నేను పితాశ్రీ ఆజ్ఞానుసారము జన్మాష్టమీవ్రతమును వర్ణించితిని, "హేభక్త బృందమా! భాద్రపదమాస కృష్ణపక్ష అష్టమీ తిథి బుధవారము రోహిణీ నక్షత్రము అర్థరాత్రి సమయమున దేవకీ వసుదేవులకు జన్మించితిని. ఆ సమయ మందు చంద్రుడు వృషభరాశిలో ఉచ్చస్థానమందుండెను. దేవకీ మాత ఒడియందున్న బాలస్వరూపమును స్మరించుచు నా జన్మ మహోత్సవమును జరుపవలెను. హే ధర్మనందనా! నేను చెప్పిన విధముగ మధురావాసులందరు ప్రథమముగ జన్మాష్టమీ వ్రత-ఉపవాసములను నిర్వహించిరి. తరువాత సమస్త లోకమందు జన్మాష్టమీ వ్రతము ప్రచారమై ప్రసరించినది". అనిచెప్పెను.

శ్రీకృష్ణ భగవానుని శ్రీముఖము నుండి జన్మాష్టమి వ్రతమును వినిన ధర్మరాజు కృతకృత్యుడయ్యెను. అతడు హస్తినాపురమందు ప్రతిసంవత్సరము ఈ మహోత్సవ మును జరిపెను.

## 39. గణేశ చతుర్థి

**గజాననం భూతగణాధి సేవితం కపిత్థ జంబూ ఫలచారు భక్షణమ్ ।**
**ఉమాసుతం శోకవినాశకారకం నమామి విఘ్నేశ్వరపాదపంకజమ్ ॥**

భాద్రపదశుక్ల చతుర్థి మధ్యాహ్న సమయమున విఘ్నవినాయక గణేశ భగవానుడు జన్మించెను. ఈ దినము ఆదివారము గాని లేక మంగళవారముగాని వచ్చిన ప్రశస్తమైనది. గణేశుడు హిందువులకు ప్రథమ పూజ్యుడు. శుభకార్యములందు

గణేశుని విధిగా పూజించెదరు. గణేశుడు విఘ్నములను తొలగించును. ఇతడు గజముఖుడు, లంబోదరుడు మోదకప్రియుడు. తమశక్త్యానుసారము గణేశ ప్రతిమను నిర్మించుకొని పూజించవలెను. 21 లడ్డూలను గణేశునకు నివేదన చేయవలెను. 5 లడ్డూలను గణేశుని చెంత నుంచి 5 లడ్డూలను బ్రాహ్మణునకు ఈయవలెను. మిగి లిన వానిని తాము తమ పరివారము స్వీకరించవలెను. బ్రాహ్మణునకు దక్షిణ తాంబూల మిచ్చి భోజనముపెట్టవలెను. గణేశునిపూజ మధ్యాహ్న సమయమున చేయవలెను. ఈ వ్రతమును చేసినవారి యందు గణేశుడు ప్రసన్నుడైయుండును. గణేశుని సహస్ర నామావళిని ఉచ్చరించుచు ప్రతి నామమునకు లడ్డూను గాని లేక దూర్వాదళము లనుగాని గణేశునకు అర్పించెదరు. దీనిని గణపతి సహస్రార్చన యందురు.

## భాద్రపద శుక్ల చతుర్థశినాడు చంద్రదర్శన నిషేధము

భాద్రపద శుక్లపక్ష చతుర్థశిని సిద్ధి వినాయక చతుర్థశి యందురు. ఈ దినమున చేయు దానము ఉపవాసము అర్చనాదులు గణేశుని కృపతో నూరురెట్లు అధికమగును. కానీ ఈ దినమున చంద్రదర్శనమును నిషేధించిరి. ఈ దినమున చంద్రుని దర్శించిన అపవాదులొచ్చును. అందువలన సావధానులై యుందురు. దైవవశమున చంద్రుని దర్శించిన ఈదోషనివారణకు ఈ మంత్రమును పఠించెదరు.

**సింహః ప్రసేన మవధీ త్సింహో జాంబవతా హతః।**
**సుకుమారక మా రోదీస్తవ హ్యేష స్యమన్తకః॥**

మరియు శమంతకమణి ఆఖ్యానము వినవలెను.

ద్వాపరయుగమందు ద్వారకాపురిలో సత్రాజిత్తుయను యదువంశీయు డుండెను. ఇతడు సూర్యుని భక్తుడు. ఇతని భక్తికి ప్రసన్నుడైన సూర్యభగవానుడు వీనికి శమంతక మణిని ఇచ్చెను. ఇది సూర్యునివలె కాంతిగలది. ఈ మణి ప్రతిదినము ఎనిమిది (8) బారుల బంగారుమునిచ్చును. దీని ప్రభావమున దేశమందు రోగములు అనావృష్టి సర్ప అగ్ని చోర దుర్భిక్షాది భయములు గలుగవు.

ఒకనాడు సత్రాజిత్తు ఆ మణిని ధరించి ఉగ్రసేనుని సభకు వచ్చెను. ఆ మణికాంతికి మనో సూర్యునివలె గోచరించెను. శ్రీకృష్ణుడు ఆ దివ్యరత్నము ఉగ్రసేన మహారాజు చెంతయున్న సమస్త రాష్ట్రమునకు శుభము గలుగునని తలంచెను. దీనిని గ్రహించిన సత్రాజిత్తు ఆ మణిని తన సోదరుడైన ప్రసేనునకు ఇచ్చెను. ఒక దినము ప్రసేనుడు మణిని ధరించి అశ్వముపై వనమందు వేటకు వెళ్ళెను. అచట ఒక సింహము వీనిని చంపెను. ప్రసేనుడు తిరిగి రానందువలన యాదవు లందరు మణికొరకు వానిని శ్రీకృష్ణుడే చంపియుండునని భావించిరి.

వనమందు సింహము నోటిలో నున్న మణిని చూచిన జాంబవంతుడు దానిని చంపి మణిని తీసుకొనెను. ఆ మణిని తనబిడ్డకు ఆడుకొనుటకు ఇచ్చెను.



ద్వారకాపురమందు చెలరేగిన లోకాపవాదు శ్రీకృష్ణుని వరకు వెళ్ళెను. కొందరిని వెంటబెట్టుకొని అశ్వము కాలిగుర్తులతో వనమందు ప్రవేశించెను. అచట ప్రసేనుడు అశ్వము చచ్చిపడి యుండుట చూచెను. వీనికి దగ్గరలో సింహముయొక్క చరణ చిహ్నములు కనుపించెను. వానిని అనుసరించుచు ముందుకు వెళ్ళగా సింహముకూడ చచ్చిపడి యుండెను. అచటినుండి జాంబవంతుని కాలిగుర్తులు కనుపించెను. వానిని చూచుచు వెళ్ళగ జాంబవంతుని గుహ వచ్చెను. యేమి జరిగెనో అంతయు గ్రహించి కృష్ణుడు ఇట్లనెను."నాపై వచ్చిన లోకాపవాదును తొలగించుకొనుటకు నేను గుహ లోనికి ప్రవేశించుచుంటిని. శమంతకమణిని తీసుకొనివచ్చుటకు ప్రయత్నము చేయుదు నని చెప్పి గుహ లోనికి ప్రవేశించెను.

అచట జాంబవంతునితో ఇరువది ఒక్క (21) దినములు ఘోరముగ సంగ్రా మము జరిగెను. అంగములన్నియు శిథిలమైన జాంబవంతుడు భగవానుని గుర్తించి ప్రార్థించుచు "హే ప్రభూ! మీరు నా శ్రీరామప్రభువులు". ద్వాపరమందు నాకు ఈ రూప ములో దర్శన మొసగితిరి. మీకు కోటి కోటి ప్రణామములు. స్వామీ! అర్ఘ్యముగ నా ఈకన్య జాంబవతిని శమంతకమణిని మీకు సమర్పించుచుంటిని. గ్రహించి నన్ను కృతార్థుని చేయుము. నా అజ్ఞానమును క్షమింపుము". అనుచు జాంబవంతుడు భగవానుని పూజించెను.

శ్రీకృష్ణుడు శమంతకమణిని జాంబవతిని వెంటబెట్టుకొని ద్వారకకు వచ్చెను. వీనివెంట వనమునకు వెళ్ళిన యాదవులు 12 దినముల తరువాత తిరిగివచ్చి జరిగినదంతయు చెప్పిరి. అందరు శ్రీకృష్ణుడు గుహలో మరణించి యుండునని తలచిరి. కానీ తిరగివచ్చిన కృష్ణుని చూచిన ద్వారకావాసులందరు ఆనందతరంగముల వలె పరుగులిడిరి. శ్రీకృష్ణుడు యాదవ సభలో మణిని సత్రాజిత్తునకు సమర్పించెను. సత్రాజిత్తుకూడ ప్రాయశ్చిత్తముగ తన పుత్రికయైన సత్యభామను శ్రీకృష్ణునకిచ్చి వివాహము చేసెను.

ఈ శమంతకమణి ఆఖ్యానమును చదివినను వినినను చతుర్థశీ చంద్ర దర్శన దోష విముక్తులగుదురు.

## 40. శ్రీ రాధా జన్మాష్టమీ వ్రత మహోత్సవము

### (భాద్రపద శుక్ల అష్టమి)

### రాధా శబ్దమునకు అర్థము

ర కారము రమ నుండియు ఆ కారమును గోపికలనుండియు ధ కారము భూమి నుండియు అ కారమును విరజానది నుండియు గ్రహించిరి. శ్రీకృష్ణభగవానుని సర్వోత్కృష్ట తేజము నాలుగు రూపములలో విభక్తమయ్యెను. లీల భూమి శ్రీ విరజ అను ఈ నలుగురు సతులు వాని చతుర్విధ తేజములు. వీరందరు కుంజభవనమునకు వెళ్ళి శ్రీరాధికలో లీనమైరి. ఇందువలన శ్రీరాధిక పరిపూర్ణావతారమయ్యెను.

అందుచేత శ్రీరాధా కృష్ణుల నామమును ఉచ్చరించువారికి శ్రీకృష్ణ భగవానుడు సులభముగ వశమగును.

సచ్చిదానంద ఘన శ్రీకృష్ణభగవాను నిత్యుడు, సమాసమయములందు ఈ భూమండలముపై అవతరించెను. అట్లే భగవతి శ్రీరాధకూడ నిత్యమైయున్నది. వాస్తవముగ శ్రీరాధ భగవానుని శక్తి స్వరూపిణి. భగవానునివలె సమాసమయము లందు ఆవిర్భవించుచున్నది. శ్రీహరివలె సత్యస్వరూపిణి. శ్రీరాధ ఆవిర్భావమహోత్స వము అతిప్రాచీనమైనది. పద్మపురాణ బ్రహ్మఖండమందు సప్తమ అధ్యాయమున శ్రీనారద-బ్రహ్మసంవాద రూపమున ఒక ఇతిహాసముగలదు. అందు నారదుడు అడుగగ బ్రహ్మ రాధ జన్మాష్టమి వ్రతమును మాహాత్మ్యమును ఈవిధముగ వర్ణించి చెప్పెను.

వత్సానారద! సత్యయుగమందు లీలావతి యను అతి సుందరి గలదు. ఈమె బహుకఠోరమైన పాపములు చేసెను. ఒకదినము ధనార్జనకు గాను తన నగరమునుండి మరొక నగరమునకు వెళ్ళెను. అచట ఒకదేవాలయమందు రాధాష్టమీ వ్రతమును చేయుచుండిరి. గంధ పుష్ప ధూప దీప వస్త్ర ఫలాదులతో భక్తిగ శ్రీరాధా దేవి మూర్తి విగ్రహమును పూజించుచుండిరి. కొందరు స్తుతించుచుండగా మరి కొందరు నృత్యములు గీతాగానములు మృదంగాది వేణునాదములతో మహోత్సవము జరుగుచుండగ లీలావతి వారిని సమీపించి "పుణ్యాత్ములార! మీరేమి చేయుచుంటిరో దయతో చెప్పుడని" వినయముగ అడిగెను.

అప్పుడావ్రత పరాయణులు భాద్రపదశుక్ల అష్టమీ దినమున శ్రీరాధ, వృషభానుని యజ్ఞభూమియందు ఆవిర్భవించెను. మేమందరము ఆమె వ్రత మహోత్సవమును జరుపుకొనుచుంటిమి, ఈ వ్రతముచేసిన గొప్పగొప్ప పాపములు నశించును అని చెప్పగ వినిన లీలావతికూడ ఆ వ్రతము చేసుకొనుటకు నిశ్చయించు కొని వ్రతముచేసెను. దైవ యోగము వలన ఆమెను సర్పము కాటువేయగ మరణించెను. ఈమె మొదట పాపముచేసి యుండుటచే యమదూతలు వచ్చిరి. అదే సమయమున శంఖచక్రగదలను ధరించిన విష్ణుదూతలువచ్చి చక్రముతో యమ పాశములను ఖండించిరి. లీలావతి పాప విముక్తురాలై విష్ణు దూతలవెంట గోలోకము నకు వెళ్ళెను. శ్రీరాధ జన్మాష్టమి చేయువారికి పాపములు నశించి సర్వ శుభములు గలుగును.

శ్రీరాధను పూజించనివారు శ్రీకృష్ణుని పూజించుటకుకూడ అధికారులుకారు, అందువలన వైష్ణవులందరు భగవతి శ్రీరాధను అవశ్యము పూజించవలెను. శ్రీరాధ శ్రీకృష్ణభగవానుని ప్రాణమునకు అధిష్ఠాత్రిదేవి. అందువలన భగవానుడు ఈమె అధీనమందుండును. ఈమె రాసేశ్వరి. రాధలేనిదే భగవానుడు క్షణముకూడ నిలువలేడు. ఈమె సమస్త కోరికలు తీరుటకు రాధన (సాధన) ము. ఈకారణమున ఈదేవి నామము శ్రీరాధయైనది.



శ్రీ రాధాదేవి భాద్రపదశుక్ల పక్షమున అష్టమినాడు మధ్యాహ్నసమయమున శ్రీకృష్ణ భానుపురమందు ఆవిర్భవించెను.

## శ్రీరాధా జన్మాష్టమి-వ్రతమహోత్సవ మాహాత్మ్యము

### (దేవర్షి నారద సదాశివ భగవానుని సంవాదము)

భాద్రపద కృష్ణపక్షమున శ్రీకృష్ణుని జన్మాష్టమి వచ్చును. అనంతరము శుక్లపక్ష అష్టమి నాడు శ్రీరాధ జన్మదినము వచ్చును.

వృషభానుపురము రత్నములతోనిండి యున్న అతి సుందరమైన నగరము. సువర్ణ మణిమాణిక్యములతో భవనములు ప్రాంగణములు, చిత్రాతి చిత్రముగ నుం డును. ఇట్టి నగరమందు అతిసుందరి, జగత్తును మోహింపజేయు శ్రీరాధాదేవి ప్రకటమయ్యెను.

నారదుడు సదాశివునితో "హేమహాభాగా, నేను మీకు దాసుడనగదును ప్రణామముచేసి అడుగుచుంటిని, దయతోచెప్పుడు శ్రీరాధాదేవి లక్ష్మీదేవియా? దేవపత్నియా, మహాలక్ష్మియా, లేక సరస్వతియా? అంతరంగ విద్యయా, లేక వైష్ణవీ ప్రకృతియా? దేవకన్యయా, వేదకన్యయా లేక మునికన్యయా? చెప్పు"డని అడిగెను సదాశివుడు "హే మునివరా! కోటి కోటి మహాలక్ష్మిలైనను రాధాదేవి చరణకమల శోభకు సరికావు. "హే నారదా ! శ్రీ రాధాదేవి గుణరూపలావణ్యములను వర్ణించుటకు నేను అసమర్థుడను. ఆమె మహిమను కూడ నేను చెప్పలేనందులకు సిగ్గుపడు చున్నాను. త్రిలోకములందుకూడ ఇట్టి సామర్థ్యముగలవారు లేరు. రాధాదేవి రూపమాధుర్యము జగత్తును మోహింపజేయు శ్రీకృష్ణుని కూడ మోహింపజేయును. అనంత ముఖములతో వర్ణించుటకు కూడ నేను అసమర్థుడనే" యని చెప్పెను.

నారదుడు "హే ప్రభూ! భక్తవత్స! శ్రేష్ఠమైన శ్రీరాధా మహోత్సవమును వినగోరుచున్నాను, హే మహాభాగ! వ్రతములన్నింటిలో శ్రేష్ఠమైన శ్రీరాధాష్టమీ వ్రతమును వినిపించుడు, శ్రీరాధను ఎట్లు ధ్యానించవలెను? ఏవిధముగ స్తుతించి పూజించవలెను? ఇవి అన్నియు నాకు దయతో చెప్పు"డని అడిగెను.

సదాశివుడు వృషభాను పురరాజైన వృషభానుడు గొప్పఉదారుడు. శాస్త్ర జ్ఞానము గలవాడు, అణిమాది అష్టసిద్ధులు గ్రహించినవాడు, శ్రీ కృష్ణుని ఆరాధకుడు. శ్రీ కీర్తిద ఇతని భార్య. ఈమె సర్వవిద్యా సంపన్నురాలు గుణవతి మహాపతివ్రత. ఈమె గర్భమందు భాద్రపద శుక్ల అష్టమి మధ్యాహ్న సమయమందు బృందావనేశ్వరి యైన శ్రీ రాధ ప్రకటమయ్యెను. వేదశాస్త్రపురాణాదులు ఈమెను "కృష్ణవల్లభ" యని కీర్తించెను. శ్రీరాధ సదా శ్రీకృష్ణుని ఆనంద పరచునట్టిది, సాధ్వియైన కృష్ణప్రియ. ఇప్పుడింకరాధ జన్మమహోత్సవమును చెప్పెద వినుము.

శ్రీరాధ జన్మాష్టమి నాడు సదా వ్రతము చేయవలెను. రాధాకృష్ణ మందిరమును ధ్వజములు పుష్పములు వస్త్రములు పతాకములు తోరణాది మంగళద్రవ్యములతో పూజించవలెను. మందిరమునకు ఎదురుగ ఐదురంగులతో మండపము నిర్మించి దానిలోపల షోడశదళ ఆకారమున కమలయంత్రమును నిర్మించవలెను. ఆకమలము మధ్యలో దివ్యాసనముపై శ్రీరాధాకృష్ణుల యుగళమూర్తులను పశ్చిమాభిముఖముగ స్థాపించి విధిపూర్వకముగ ఉపాసించి భక్తులతో కూడి తమశక్తికి తగినట్లుగ పూజా సామాగ్రులతో భక్తి పూర్వకముగ పూజించవలెను.

**శ్రీరాధా మాధవ యుగల ధ్యానము :**

**హేమేందీవరకాన్తి మంజులతరం శ్రీమజ్జగన్మోహనం**
**నిత్యాభిర్లలితాదిభిః పరివృతం సన్నీల పీతాంబరమ్ ।**
**నానాభూషణ భూషణాంగ మధురం కైశోర రూపం యుగం**
**గాన్ధర్వాజనమవ్యయం సులలితం నిత్యం శరణ్యం భజే॥ (పద్మపురాణము)**

స్వర్ణము నీల కమలములవలె అతి సుందరమైన కాంతిగలవారలు, జగత్తునమోహింపజేయు శ్రీ సంపన్నులు నిత్య లలితాది సఖియలతో పరివృతులు, సుందరనీల పీతవస్త్ర ధారణులు, వివిధ ఆభరణాది భూషితములు, అతికాంతి మధు రాగములు గలవారలు, అవ్యయ సులలిత యుగలకిశోర రూపులైన శ్రీరాధాకృష్ణులకు మేము నిత్యశరణాపన్నుము. అనుచు యుగలమూర్తులను ధ్యానించి పూజించ వలెను. శాలగ్రామ మూర్తులనుగాని పాషాణాది మూర్తులనుగాని అర్చించవలెను.

మహాప్రసాద వితరణ మహిమ – గంధ పుష్ప చందనాదులతో పూజించిన తరువాత నైవేద్యమును నివేదన చేయవలెను. అనంతరము చరణోదకమును మహాప్రసాదమును భక్తులతో కలసి గ్రహించవలెను. శ్రీరాధా కృష్ణులను స్మరించుచు రాత్రి జాగరణ చేయవలెను. బంగారుది గాని వెండిదిగాని మూర్తులను పెట్టి పూజించ వలెను. బంధు బాంధవులతో కలసి పురాణాది కథలను, ఇష్టదేవతలైన శ్రీరాధాకృష్ణ కథలను కీర్తించవలెను. ఈ విధముగ చేయువారికి శ్రీరాధాకృష్ణ సాన్నిధ్యము లభిం చును.

రాధా రాధా యను నామమును స్మరించువారు సమస్త తీర్థములను సేవించిన వారగుదురు. రాధా నామము ఉచ్చరించిన బృందావనమున శ్రీరాధకు సహచరియ లగుదురు.రాధను పూజించిన సమస్త విద్యలు ప్రాప్తించును. ఈ పృథ్వి ధన్యమైనది. ఈ పృథ్విపైనున్న బృందావనము ధన్యమైనది. బృందావనమందున్న శ్రీరాధ ధన్య మైనది. రాధాకృష్ణులు బ్రహ్మాదిదేవతలకు పరమారాధ్యులు. రాధను భజించువారిని నేను భజించెదను. ఈమె కథను కీర్తించుచు మంత్రమును జపించుచు, సదా రాధా రాధా యను నామమును కీర్తించు చుండవలెను. రాధేకృష్ణ రాధేకృష్ణ యను నామ మును కీర్తించిన దాని మహిమను నేను వర్ణించలేను. రాధా నామము ఎన్నటికి నిష్ఫలము కాదు. ఇది సర్వతీర్థ ఫలమునొసగును. శ్రీరాధ సర్వతీర్థమయి, సర్వైశ్వర్య మయి, శ్రీరాధ భక్తులగృహములందు లక్ష్మీస్థిరముగ నుండును. వారి గృహములందు రాధతోపాటుగ శ్రీకృష్ణుడును నివసించును. శ్రీరాధాకృష్ణులు ఇష్టదేవతలుగ నున్నవారికి ఇది శ్రేష్ఠమైన వ్రతము.



అని సదాశివుడు చెప్పగ, నారదుడు ప్రణామము లాచరించి శ్రీరాధాష్టమినాడు యజ్ఞముచేసి పూజించెను.

ఈ వ్రతముచేసి ఈ కథను వినువారు సర్వగుణసంపన్నులై ధనవంతులై, సుఖించెదరు రాధా నామమును జపించువారు ధర్మార్థ కామమోక్షములను పొందెదరు. కృష్ణ భక్తులైన వైష్ణవులకు రాధాభక్తియు ప్రాప్తించును.

శ్రీరాధా ప్రాదుర్భావ కారణము మాహాత్మ్యము గర్గ సంహిత యందు ఈవిధముగ నున్నది.

బహులాశ్వుడు అడుగగ నారదుడు ఈ విధముగ చెప్పెను.

నీ కులము ధన్యమైనది. మీ వంశమందు నిమి రాజు జన్మించెను. అతడు శ్రీకృష్ణుని భక్తుడు. నీవును ఈ వంశమందే ఉత్పన్నుడవైతివి. నీ స్వభావము బహువిలక్షణమైనది, సంసారమందుండియు త్యాగి వైతివి. నీవిప్పుడు శ్రీకృష్ణుని లీలలను వినుము. అది కళ్యాణప్రదమైనది. భగవానుడు అవతరించినది కేవలము కంస సంహారమునకేకాదు. పృథ్విపై సంతజనులను రక్షించుటకుకూడ. భగవానుడు తన మహాశక్తిని ప్రేరేపించగ అది వృషభానుపత్ని హృదయమందు ప్రవేశించెను. ఆ శక్తియే రాధికా నామముతో అది భాద్రపద శుక్లపక్ష అష్టమీతిథి. మధ్యాహ్న సమయము. ఆకాశమున మేఘములు కమ్ముకొని యుండెను. దేవతలు పుష్పవర్షము కురిపించెను. నదులు స్వచ్ఛముగ నుండెను. సమస్త దిశలు ఆనందముగ నుండెను. సుగంధ వాయువులు వీచుచుండెను. అవి మనోహరముగ అతి శీతలముగ నుండెను. వృషభాను కన్య శరత్కాలీన చంద్రునివలె ప్రకాశించుచుండెను. రూపము మనస్సును హరించునట్లుండెను. వృషభాను దంపతులు తమ పుత్రిక శుభమునుకోరి రెండు లక్షల గోవులను బ్రాహ్మణులకు దానమొసగెను.

గోపికలు ఊయలనూపుచుండిరి. అదిసువర్ణ నిర్మితమైన రత్నములు పొదగబడియుండెను. రాధిక దినదినాభివృద్ధిజెందు చుండెను. వృషభాను భవనము దీపావళివలె ప్రకాశిచుచుండెను.

అనంతరము కీర్తి, వృషభానుల పూర్వజన్మ కథను వినిపించెను.

నగయను నొక రాజుండెను. అతనికి సుచంద్రుడను పుత్రుడు గలిగెను. ఇతడు రాజులపై కూడ శాసనము చేయువాడు. ఇతడు భగవానుని అంశయని అనుకొందురు. ఇతని సంకల్పముతో ముగ్గురు పుత్రికలు జన్మించిరి. వారు కళావతి రత్నమాల, మేనక యనువారలు. కళావతి సుచంద్రుని వివాహమాడెను. సుచంద్రుడు గొప్ప విద్వాంసుడు, భగవానుని అంశావతారమైనవాడు. రత్నమాల విదేహరాజు

(జనక) ని వివాహమాడెను. మేనక హిమాలయుని వివాహమాడెను. రత్నమాలకు సీత జన్మించెను. మేనకకు పార్వతి జన్మించెను.

అనంతరము కళావతిని వెంటబెట్టుకొని సుచంద్రుడు గోమతీ నదీ తీరమునకు వెళ్లెను. అచట ఇరువురు తపస్సుచేయసాగిరి. తపము 12 సంవత్సరములు కొన సాగెను. అనంతరము బ్రహ్మ ప్రత్యక్షమై వరమొసగెను.

బ్రహ్మ వారిని "స్వర్గమునకు రండనెను. మీరు సమయమాసన్నమైనప్పుడు పృథ్విపై జన్మించెదరు. ద్వాపరాంతమున గంగాయమునల చెంత భారతదేశమందు మీరు జన్మించెదరు. మీకు పరిపూర్ణభగవానుడైన శ్రీకృష్ణుని ప్రాణప్రియురాలైన రాధా దేవి పుత్రికగా జన్మించును. అప్పుడు మీకు పరమధామము లభించు"ననెను.

బ్రహ్మ వరదానమును పొందినవారే భూమండలమున కీర్తి వృషభానులైరి. వీరికే రాధ పుత్రికగా జన్మించెను. భాద్రపద శుక్లఅష్టమినాడు రాధావ్రతమును చేయవలెను. కలశమును స్థాపించవలెను. దానిపై రాధ బంగారు ప్రతిమనుంచి పూజించవలెను. ఏకభుక్తముతో వ్రతము చేయవలెను. దీనిని చదివినవారు వినువారు పాపవిముక్తులై పరమధామమును పొందుదురు.



## 41. దశావతార వ్రతము

ఈ వ్రతమును భాద్రపద శుక్లపక్ష దశమినాడు చేయుదురు. ఈ దినమున జలాశయములందుగాని నదులందు గాని స్నానము చేసి, పితరులకు తర్పణము గావించి, భగవానుని దశావతారములైన మత్స్య, కూర్మ, వరాహ,వామన, పరశురామ, నారసింహ, రామ, కృష్ణ, బుద్ధ, కల్కి మూర్తులను యధావిధిగ పూజించి పిండివంటలను సమర్పించ వలెను. ఆ పిండివంటలలో పదిబ్రాహ్మణునకు ఇచ్చి మరోపది తాము ఉంచుకొని భుజించవలెను. ఈపిండివంటలు ప్రతిసంవత్సరము వేరువేరు రకములైనవి చేయవలెను (10సంవత్సరములు 10 రకములైనవి) ఈ విధముగ పది సంవత్సరములు ఈ వ్రతము చేసిన విష్ణులోకము ప్రాప్తించును.

## 42. అనంత చతుర్దశి (భాద్రపద శుక్లచతుర్దశి)

భాద్రపదశుక్ల చతుర్దశిని అనంత చతుర్దశి యందురు. ఈ దినమున అనంత భగవానుని పూజించవలెను.

**వ్రతవిధానము :-** వ్రతముచేయువారు పర్వాన్న నైవేద్యమును తీసికొని నదికిగాని సరోవర తీరమునకుగాని వెళ్ళి అచట స్నానాదులుచేసి ఈ విధముగ సంకల్పము చేయవలెను.

**"మమాఖిల పాపక్షయ పూర్వక శుభఫలవృద్ధయే శ్రీమదనన్త**
**ప్రీతికామనయా అనన్త వ్రత మహంకరిష్యే "**



అని సంకల్పముచేసి నదీభూమి తీరమున ఆవుపేడతో అలికి అచట కలశమును స్థాపించి దానిని పూజించవలెను. అనంతరము కలశముపై శేషశాయి విష్ణుభగవానుని ప్రతిమ నుంచవలెను. దాని ఎదుట పదునాలుగు (14) ముడులుగల అనంత సూత్రమునుంచవలెను. తరువాత ఓం అనన్తాయ నమః అను ఈ మంత్ర ముతో విష్ణుభగవానుని అనంత సూత్రమును షోడశోపచారములతో పూజించ వలెను. ఆ తరువాత పూజింపబడిన అనంత సూత్రమును ఈ మంత్రమును పఠించి పురుషులు కుడిచేతికి, స్త్రీలు ఎడమ చేతికి కట్టుకొనవలెను.

**అనన్త సంసార మహాసముద్రే మగ్నాన్ సమభ్యుద్ధర వాసుదేవ ।**
**అనన్త రూపే వినియోజితాత్మా హ్యనన్తరూపాయ నమో నమస్తే ॥**

అనుచు అనంత సూత్రమును కట్టుకొని బ్రాహ్మణునకు నైవేద్యముపెట్టి, తాము భుజించవలెను. నారాయణ భగవానుని ధ్యానించుచు గృహమునకు వెళ్ళవలెను.

పూజానంతరము పరివారజనులతోకలసి ఈ వ్రతకథను వినవలెను. పూర్వము సుమంతుడను ఒక ముని యుండెను. ఇతడు వసిష్ఠ గోత్రీయుడు. ఇతనికి శీలయను పుత్రికగలదు. (సుశీల) సుమంతుడు ఈమెను కౌండిన్యమునికి ఇచ్చి వివాహము కావించెను. శీలభాద్రపదమాసశుక్ల పక్షచతుర్దశినాడు అనంత వ్రతమును చేసి అనంత సూత్రమును తన ఎడమచేతికి కట్టుకొనెను. వీరు అన్ని విధముల సుఖముగ జీవించు చుండిరి.

దుర్భాగ్యవశమున ఒకనాడు కౌండిన్య ముని క్రోధముతోవచ్చి శీలచేతికి కట్టుకొనియున్న అనంత సూత్రమును త్రెంచి కుండలో విసరికొట్టెను. దీనివలన వారి సంపదలన్నియు నశించి బహుదుఃఖములపాలైరి. ఒకదినము దుఃఖితుడై కౌండిన్య ముని వనమునకు వెళ్ళెను. అచట వృక్షములను లతలను జీవజంతువులను అనంతభగవానుని గురించి అడుగుచు తిరుగుచుండెను. అనంతభగవానుడు వృద్ధ బ్రాహ్మణ రూపములో కౌండిన్య మునికి దర్శనమొసగి అనంత వ్రతమును చేయుమని చెప్పెను. శీల కౌండిన్య ముని ఇద్దరు అనంతవ్రతమునుచేసి పునఃసంపదలతో సుఖముగ నుండిరి.

## అనంతకథా రహస్యము

ధర్మరాజు తన సోదరులతో ద్రౌపతితో వనమందు అనేక కష్టములు పడు చుండగా, శ్రీకృష్ణుడు వారి కష్టములను తొలగించుటకు అనంత వ్రతమును చేయు మని ఉపదేశించెను. పదునాలుగు (14) ముడులు గల అనంతసూత్రము భగవానుని విశ్వరూపమునకు ప్రతీకము. దీనిని తిరస్కారభావముతోచూచిన కౌండిన్య మునివలె దుర్గతి పాలగుదురు.

కౌండిన్యుని భార్యశీల ఈవ్రతము చేసుకొని చేతికి సూత్రమును కట్టుకొనెను. కౌండిన్యముని ఆ సూత్రమును గాంచి భార్యతో "నీవు ఎవరిని వశముచేసుకొనుటకు

ఈ సూత్ర”మును కట్టుకొంటివి? అని అడుగగ ఆమె ఇది అనంతభగవానుని సూత్రమనెను. కాని కౌండిన్యుడు ఐశ్వర్య మదముతో దానిని త్రెంచి మంటలో విసరి కొట్టెను. ధన మదముతో అనుచిత కార్యములు చేసిన సంపదలు నశించును. కౌండినకు కూడ ఇదే సంభవించెను. ఇతడు భగవానుని క్షమింపుమిన ప్రార్ధించుటకు వనమునకు వెళ్ళిమార్గమున కనుపించువారి నందరిని అనంతభగవాను డెక్కడుండునని అడుగుచుండెను. ఎవ్వరుచెప్పనందువలన నాశతో ఒకవృక్షశాఖతో ఉరివేసు కొనబోవు చుండగా భగవానుడు ఒకవృద్ధ బ్రాహ్మణ రూపములోవచ్చి ఆపి, నాతోరమ్ము భగవానుని చూపించెదననుచు వానిని ఒక గుహలోనికి తీసుకొని వెళ్ళెను. అచట కౌండిన్యునకు చతుర్భుజములతో భగవానుడు దర్శనమొసగెను.

“మహామునీ! నీవు అనంతభగవానుని సూత్రమును తిరస్కరించితివి. ఆ పాపము తొలగవలెననిన నీవు పదునాలుగు సంవత్సరములు అనంత వ్రతమును చేయవలెను. దీనివలన నశించిన నీ సంపదలను తిరిగి పొందగలవు” అని చెప్పెను.

అనంతరము కౌండిన్యుడు ఈ వ్రతమాచరించి సర్వసంపదలతో దంపతులు సుఖముగనుండిరి.



## 43. శ్రీ మహాలక్ష్మీ వ్రతము (సోర హియావ్రతము)

భాద్రపద శుక్లపక్ష అష్టమి నుండి ఆశ్వీయుజ కృష్ణ అష్టమి వరకు మహాలక్ష్మీ వ్రతమును 16 దినములు జరుపుదురు. ఈ వ్రతము చేయువారికి ధర్మార్థ కామమోక్ష ములు లభించును. తీర్థములందు ప్రయాగ నదులందు గంగ శ్రేష్ఠమైనట్లుగ వ్రతము లందు మహాలక్ష్మీ వ్రతము శ్రేష్ఠమైనది.

**వ్రతవిధానము :-** భాద్రపద శుక్ల అష్టమినాడు ప్రాతఃకాలమందే లేచి 16 మారులు చేతులు నోరు కడుగుకొని స్నానము చేసి చందనాదులతో నిర్మించబడిన మహాలక్ష్మీ ప్రతిమను స్థాపించవలెను. దాని సమీపమున పదహారు పోగులు పోసిన దారమునకు పదహారు ముడులువేసి మహాలక్ష్మై నమః అను మంత్రముతో ప్రతిముడిని పూజించి లయప్రతిమకు షోడశోపచార పూజ చేయవలెను. అనంతరము ఈ మంత్ర మును పఠించి (దారమును) తోరణమును కుడిచేతికి కట్టుకొనవలెను.

**ధనం ధాన్యం ధరాం హర్మ్యయ కీర్తిమాయుర్యశః శ్రియమ్ ।**
**తురగాన్ దన్తినః పుత్రాన్ మహాలక్ష్మీ ప్రయచ్ఛమే ॥**

పదహారు గరికలు పదహారు అక్షతలు పట్టుకొని కథను వినవలెను. ఈ విధముగ పదహారు దినములు వ్రతముచేసి ఆశ్వీజ కృష్ణ అష్టమి రాత్రి జాగరణ చేయవలెను. పదహారవ దినమున దారమును వూడదీసి లక్ష్మీదగ్గర ఉంచవలెను. ఈవ్రతమందు ఒక్కమారే ఫలహారము చేయవలెను. పదహారువత్తులతో దీపమును వెలిగించి దక్షిణతోసహా దానిని బ్రాహ్మణునకు దానమీయవలెను.



**కథ:-** ఒకరాజునకు ఇద్దరు రాణులుండిరి. ఒకరాణికి అనేకమంది పుత్రులు గలరు. చిన్నరాణికి ఒకే ఒక పుత్రుడు. పెద్దరాణి మట్టితో యేనుగును నిర్మించుకొని దానిని పూజించెను. చిన్నరాణి అది చేయలేక ఉదాసీనురాలైయుండెను. తల్లి ఉదాసీన తను గాంచిన ఆమె పుత్రుడు ఇంద్రుని ప్రార్థించి ఐరావతమును (గజము) తెచ్చి, “అమ్మా! నీవు నిజమైన గజమును పూజింపుము” అని చెప్పగా, ఆ తల్లి ఐరావత మును పూజించెను. దీని ప్రభావముతో ఈమె పుత్రుడు ప్రఖ్యాతి గాంచిన రాజయ్యెను. అందువలన ఈ దినమున ఏనుగును పూజించెదరు. కాశీ నగరమందు లక్ష్మీకుండ మున పదుహారు దినములు మహాలక్ష్మికి ఉత్సవము జరుపుదురు. దీనిని సోరహియా ఉత్సవమందురు. ఇచటినున్న భక్తులు నియమముగా లక్ష్మిని దర్శించెదరు.

## 44. ఋషి పంచమి (భాద్రపద శుక్ల పంచమి)

భాద్రపద శుక్లపంచమిని ఋషిపంచిమ అందురు.

రజస్వలావస్థయందు గృహపాత్రాది స్పర్శదోష నివారణకు ఈ వ్రతముచేయు దురు. ఈవ్రతమందు సప్తర్షులను అరుంధతిని పూజించెదరు. అందువలన దీనిని ఋషి పంచమి యందురు. ఈ దినమున ఉపవాసముండి శరీరమునకు మట్టి రాసుకొని స్నానము చేయవలెను. నదీ స్నానము శ్రేష్ఠమైనది. పూజా స్థలమును ఆవు పేడతో అలికి రంగులతో ముగ్గువేసి దానిపై రాగి కలశమునుగాని మట్టి కలశమును గాని స్థాపించ వలెను. దానిని గంధపుష్ప అక్షతాదులతో పూజించవలెను.

కలశముచెంత అష్టదళకమలమును నిర్మించి ఆ దళములందు కశ్యప, అత్రి భరద్వాజ, విశ్వామిత్ర, గౌతమ, జమదగ్ని, వశిష్ఠులను సప్తర్షులను, వసిష్ఠపత్ని అరుంధతీదేవిని ప్రతిష్ఠించవలెను. అనంతరము వీరిని షోడశోపచారములతో పూజించవలెను. ఈ దినము ఉప్పులేకుండ ఒక్కపూట మాత్రమే భుజించవలెను. కలశాది పూజాసామాగ్రులను బ్రాహ్మణునకు దానమీయవలెను. బ్రాహ్మణునకు భోజ నముపెట్టిన తరువాత తాము భుజించవలెను.

సత్యయుగమందు శ్యేనజిత్తుడను రాజుండెను. ఇతని రాజ్యమందు సుమిత్రు డనునొక బ్రాహ్మణుడుండెను. ఇతడువేదపండితుడు. వ్యవసాయముతో తన పరివార మును పోషించుకొనుచుండెను. ఇతని భార్య జయశ్రీ సతీసాధ్వియైన పతివ్రత. ఈమె కూడ పొలమునకు వెళ్ళి తన పతికి సహాయపడుచుండెడిది. ఒకానొకనాడు రజస్వలావస్థ యందు తెలియక గృహకార్యములు నెరవేర్చి పతినిగూడ తాకెను. రజస్వలావస్థ యందు స్పర్శాస్పర్శలు గలిగిన కారణమున ఈమె కుక్కగాను ఈమె భర్త ఎద్దుగాను పుట్టిరి. ఐనను పూర్వజన్మ పుణ్యములన జ్ఞానము నశించలేదు.

బ్రాహ్మణునకు సుమతి యను పుత్రుడుండెను. ఇతడు కూడ తండ్రివలె వేద పండితుడు. తన తల్లిదండ్రులకు శ్రాద్ధము పెట్టుటకు పాయసము చేయించి, బ్రాహ్మ ణుని పిలచెను. అంతలో ఒక సర్పము ఆపాయసమును త్రాగి విషతుల్యము

గావించెను. కుక్కగా జన్మించిన బ్రాహ్మణి ఇది అంతయు చూచుచుండెను. ఇది త్రాగిన విషప్రభావమున వీరు మరణించెదరు. పాపము కూడ తగులును అని విచారించుకొని ఆ పాయసమును ముట్టుకొనెను. అదిచూచిన సుమతిభార్య కుక్కను కాలుచున్న కట్టెతో కొట్టెను. ఆరోజు కుక్కకు అన్నముకూడ పెట్టలేదు.

ఆరోజురాత్రి దుఃఖించుచు జరిగినదంతయు ఎద్దుగానున్న తన భర్తకు చెప్పెను. ఈరోజు నాకుకూడ తినుటకేమియు పెట్టలేదు. సుమతి మన ఇరువురకు నేడు శ్రాద్ధము పెట్టుచున్నాడు. మన ఇరువురిని ఆకలితో మాడ్చుచున్నారు. నేడు వీరు పెట్టు శ్రాద్ధము వ్యర్థమే యగును అని చెప్పుకొనుచుండగా, పశువుల భాష నెరిగిన సుమతి అంతయు గ్రహించినవాడై తన తల్లిదండ్రులు ఈ విధమైన జన్మలెత్తి రని దుఃఖించుచు, ఒక ఋషి చెంతకేగి జరిగినదంతయు చెప్పి వారు పశుయోని విముక్తులగుటెట్లని అడిగెను.

ఋషి యోగ బలముతో సర్వము గ్రహించెను. సుమతితో "మీ భార్య భర్తలిరువురు భాద్రపద శుక్లపంచమినాడు ఋషి పంచమీ వ్రతమాచరింపుడు. ఆ దినము ఎద్దులు దున్నగా పండిన ధాన్యపుటన్నమును భుజించరాదు. ఈ వ్రతప్రభావమున నీతల్లి దండ్రులు ముక్తిని పొందెద"రని చెప్పెను.



## 45. వామనజయంతి మహోత్సవము

**(భాద్రపద శుక్లద్వాదశి)**

భాద్రపద శుక్లపక్ష ద్వాదశిని వామన ద్వాదశియనియు, వామన జయంతి అనియు అందురు.

**వ్రతవిధానము :-** వామన ద్వాదశి చేయువారు మధ్యాహ్న సమయమున వామనభగవానునకు షోడశోపచార పూజలుచేసి పూజించి, భగవానుని కథను వినవలెను. తరువాత మట్టిపాత్రలో బియ్యము పంచదార పెరుగునుంచి దానిని బ్రాహ్మణునకు దానమీయవలెను. ఈ దినము ఫలహారముచేసి మరునాడు (త్రయోదశి) పారణచేయవలెను. (భుజించవలెను)

సత్య యుగమున ప్రహ్లాదపౌత్రుడు దైత్యరాజు బలి చక్రవర్తి స్వర్గలోకమును స్వాధీనము చేసుకొనెను. సమస్త దేవతలు స్వర్గభ్రష్టులై ఇంద్రుని వెంట బెట్టుకొని విష్ణుచెంతకేగిరి. తమకష్టమును చెప్పుకొనిరి.

భగవానుడు వారితో "నేను దేవదూత అదితి గర్భమున జనించి మిమ్ములను స్వర్గాధిపతులను కావిచెంద"నని పలుకగ సమస్త దేవతలు సంతోషముగా అదితి దగ్గరకువెళ్ళి భగవానుని అవతారమను ప్రతీక్షించసాగిరి.

బలి చక్రవర్తి భృగు వంశీయుడైన బ్రాహ్మణునితో నర్మదా తీరమున అశ్వమేధ యజ్ఞము ప్రారంభించెను. భగవానుడు అవతరించు సమయమాసన్నమైనదని గ్రహిం



చిన గ్రహములన్నియు శుభస్థితులైనవి. ఆకాశమందు శంఖ మృదంగాది వాయిద్య ములు మ్రోగుచుండెను. భాద్రపద శుక్లపక్ష ద్వాదశినాడు వామనుడవతరించెను.

భగవానుడు బలియజ్ఞము చేయుచున్నాడని విని బ్రహ్మచారి రూపమున యజ్ఞశాలకు వెళ్ళెను. వాని తేజోమయ స్వరూపమును గాంచిన బలి అర్ఘ్యపాద్య ఆసనాదులను సమర్పించి షోడశోపచార పూజ కావించెను. చరణోదకమును గ్రహిం చెను. అనంతరము "హే బ్రహ్మణకుమారా! మీకేమికావలెనో కోరుకొనుడనెను.

వామన భగవానుడు దైత్యరాజా! నీవు ప్రహ్లాద వంశీయుడవు. కోరినదిచ్చు వారిలో శ్రేష్ఠుడవు. గాన మీ పాదముతో కేవలము మూడు అడుగుల పృథ్విని ఇమ్మని కోరుచున్నాను, ఆవశ్యకతలేక అధికముగ కోరుట పాపము అనెను.

భగవానుని మాటలువిని బలి నవ్వుకొనుచు అట్లే కానిండనెను. ఆ సమయ మున దైత్యగురువైన శుక్రాచార్యుడు ఆగు యనుచు ఇట్లనెను. ఇతడు స్వయముగా శ్రీహరి భగవానుడు, మూడడుగులతో బ్రహ్మాండములన్నియు వ్యాపించి నిన్ను రాజ్యహీనుని గావించుననెను.

అందుకు బలి."యెవరికొరకు యజ్ఞయాగాదులు చేయుదురో ఆ విష్ణు భగవానుడే స్వయముగా ఉపస్థితుడై దానము కోరుచుండెను. గాన నేను అవశ్య మిచ్చెద"ననెను.

అంతట శుక్రాచార్యుడు "నా ఆజ్ఞను ఉల్లంఘించినందుకు నీవు శ్రీ హీనుడవ గుదు"వని శపించెను". బలి దానమొసగుటకు భగవానుని చరణములను కడుగు చుండగా, దేవగంధర్వాదులందు ప్రశంసించి పుష్పవర్షము కురిపించసాగిరి.

వామన భగవానుడు ఒక అడుగుతో పృథ్విని రెండవ అడుగుతో మహర్లోక జనలోక తపోలోక సత్యలోకాదులన్నియు వ్యాపించెను. మూడవ అడుగు ఎచట పెట్టవలెనని అడుగగా బలి తన శిరస్సును వంచెను. అంతట భగవానుడు తన పాదకమలమును బలి శిరస్సుపై నుంచి వానిని సుతల లోకాధిపతిని కావించెను. అంతేకాక తన సుదర్శన చక్రమును వాని రక్షణార్థము నియమించెను. బలిచక్రవర్తి ఎల్లప్పుడు భగవానుని దర్శించు వరమునుకూడ పొందెను.

## 46. గోవత్స ద్వాదశి (భాద్రపద కృష్ణ ద్వాదశి)

భాద్రపదకృష్ణ ద్వాదశి నాడు స్త్రీలు గోవును దూడను పూజించు పండుగ. ఇది తమ పుత్రులకు శుభములు గలుగవలెనని చేయునది. గోవులేని వారు ఇతరుల వద్దనున్న గోవును దూడను పూజించవలెను. ఆగ్రామమున గోవులే లేకున్న మట్టితో ఆవును, దూడను చేసుకొని వానిని పూజించవలెను. ఇట్లు చేసిన పిల్లలకు భూతప్రేత భయములు దృష్టి దోషములు గలుగవు. పుత్రుడు జన్మించినప్పుడు సజ్జలను దాన మీయవలెను. ఒక పళ్ళెములో సజ్జలనుపోసి, దానిపై రెండు పిడికెలు సజ్జపిండిని

పోసి, దానిపై నెయ్యి, శెనగలుపెట్టి వానిపై నువ్వులను ఒకరూపాయిని ఉంచి అత్త పాదములకు నమస్కారముచేసి ఆమెకు వాయనమీయవలెను. తరువాత దూడను బావిని, పూజించి, పాటలుపాడి, బ్రాహ్మణునకు దక్షిణతాంబూలమీయవలెను.

## 47. కుశోత్పాటినీ అమావాస్య

### (భాద్రపద అమావాస్య) (దర్భలను పెఱకుట)

భాద్రపద మాస అమావాస్య తిథిని కుశోత్పాటినీ అమావాస్య యందురు. ఈ దినమున సంవత్సరమునకు సరిపడ ధార్మిక కృత్యములకు, శ్రాద్ధాది కృత్యములకు కుశను (దర్భలు) పెఱకుదురు. హిందువులు యేధార్మిక క్రియాకలాపములు చేయవలె నన్నను దర్భలు గావలెను. ప్రతి గృహస్థునకు ఈ దినమున దర్భలుగా వలెను. శాస్త్రము లందు పదిరకములైన దర్భలున్నట్లు వివరణగలదు. కుశను పెఱకుటకు పూర్వాహ్న కాలమందు దర్భస్థలమునకు వెళ్ళి ఉత్తర ముఖముగ కూర్చుండి, ఈ మంత్రమును పఠించి కుడిచేతితో ఒకేమారు లాగవలెను.

విరించనా సహోత్పన్న పరమేష్ఠిన్ని సర్గజ ।
నృద సర్వాణి పాపాని దర్భ స్వస్తి కరోభవ ॥

## 48. అఖండ సౌభాగ్య రక్షక హరితాలికా వ్రతము

### (తృతీయ తిథి) (తీజ పర్వము)

భాద్రపద శుక్ల తదియనాడు సౌభాగ్యవతులైన స్త్రీలు తమ అఖండ సౌభాగ్య రక్షణకు శ్రద్ధతో విశ్వాసముతో ఈ వ్రతమును చేయుదురు. వ్రతపరాయణులు మరుసటి దినమున సౌభాగ్య ద్రవ్యములను వాయనముగ బ్రాహ్మణులకు ఈయ వలెను. ఆతరువాత జలము త్రాగి పారణ చేయవలెను. ఈ వ్రతమందు పార్వతీ పరమేశ్వరులను గణేశుని పూజించవలెను. ఈ వ్రతమును మొదట గిరిజానందిని ఉమాదేవి చేసెను. దాని ఫలితముగ శివభగవానుని పతిగ పొందగలిగెను. ఈ వ్రత దినమున స్త్రీలు ఈ కథను కూడ విందురు.

దక్ష కన్య సతీదేవి తండ్రి యజ్ఞమందు తన పతికి జరిగిన అవమానమును సహించలేక, యోగాగ్నిలో దగ్ధమై మైనా హిమవానుల తపఃఫలముగ వారికి పుత్రికగ జన్మించి పార్వతీ నామముతో పునఃప్రకటమయ్యెను. ఈమె నిత్యనిరంతరము శివభగవానుని చరణారవిందములను స్మరించుచుండెను. శివుని పతిగా పొందుటకు తండ్రి ఆజ్ఞను తీసుకొని తపము ప్రారంభించెను. నిరాహారముతో కఠోరముగ తపమాచరించుచుండెను. "అప్పుడొకనాడు నారదుడు హిమవానుని చెంతకువచ్చి, విష్ణుభగవానుడు మీకన్యను వివాహమాడదలచి, ఈ సందేశమును మీకు చెప్పుమని నన్ను పంపెను అని నారదుడు చెప్పగ, హిమవానుడు అంగీకరించెను". నారదుడు పార్వతి దగ్గరకు వచ్చి "ఉమాదేవి! ఇంక తపస్సును త్యజించుము. నీ తండ్రి నిన్ను



విష్ణుభగవానునకు ఇచ్చి వివాహము చేయుటకు నిశ్చయించుకొనెను", అని చెప్పి వెళ్ళిపోయెను.

ఈమాటలను వినినంతనే పార్వతి మూర్ఛపోయెను. తెలివి వచ్చిన తరువాత తన మనస్సులోని మాటలను తన సఖియలకు చెప్పెను. అంతట వారు "నీ తండ్రి ఇచటికి రాకముందే నీవు యేదైన కీకారణ్యమునకు వెళ్ళి దాగియుండు"మని చెప్పిరి. అట్లే పార్వతి ఒక పర్వత గుహలో శివలింగమును స్థాపించుకొని, ఉపాసనాది అర్చనలు ప్రారంభించెను. దీనితో సదాశివుని ఆసనము ఊగిపోవుచుండెను. అంతట శివభగవానుడు పార్వతి సమక్షమున ప్రత్యక్షమై ఆమెను పత్నిగా చేపట్టెదనని వాగ్దానముచేసి అంతర్ధాన మయ్యెను. తనపుత్రికను వెదకుచు హిమవానుడు పార్వతి చెంతకు వచ్చెను. సమస్త విషయమును గ్రహించిన హిమవానుడు పార్వతిని శివభగవానునకు ఇచ్చి వివాహము చేసెను. పార్వతి భాద్రపద శుక్ల తదియ హస్తా నక్షత్రమందు ఆరాధన ప్రారంభించెను. అందువలన ఈతిథినాడు ఈవ్రతమును చేయుదురు. అప్పటి నుండి స్త్రీలు తమ పతులకు దీర్ఘాయువు గలుగుటకు కుమారి కన్యలు తమ మనోవాంఛిత వరులు ప్రాప్తించుటకు ఈ వ్రతమును చేయుచున్నారు. ఇది చేసిన వారికి అఖం



## 49. ఉండ్రాళ్ళ తదియ

పూర్వము కైలాస పర్వతముపై కూర్చొనియున్న శివునితో పార్వతి "స్వామీ! స్త్రీలకు సౌభాగ్యమొసగునది, సత్సంతాన ఐశ్వర్యముల నొసగు వ్రతమును చెప్పు"మని అడిగెను.

శివుడు "భాద్రపద తృతీయ తిథి నాడు సౌభాగ్యమొసగునట్టిది గౌరీవ్రతము. దీనికి ముందురోజు తలార స్నానముచేసి గోరింటాకు పెట్టుకొనవలెను. తెల్లవారు జామునలేచి, రాత్రివండిన పదార్థములను ఐదుగురు సౌభాగ్యవతులైన స్త్రీలతో కలసి భుజించి ఊయల లూగవలెను. అనంతరము గౌరిని పూజించవలెను. ఐదుముడులు వేసిన తోరమును ఐదు ఉండ్రాళ్ళను వాయనముపై దక్షిణ తాంబూలములనుంచి సౌభాగ్యవతులైన ఐదుగురు స్త్రీలకు వాయనమీయవలెను. వ్రతము చేయువారు ముందుగ ఒక తోరమును కట్టుకొనవలెను. వ్రతముచేయించిన బ్రాహ్మణుకు దక్షిన తాంబూల మీయవలెను.

భాద్రపద బహుళ విదియ నగరమంతయు అలంకరణలతో నుండెను. స్త్రీల ఉత్సాహమును చూచి ఒక వేశ్య "ఈ నగరమందేమి జరుగుచున్న"దని అడిగెను. అంతట ఆ స్త్రీలు మేము "ఉండ్రాళ్ళతదియ వ్రతమును చేయుచున్నా"మని చెప్పిరి. వాని నడిగి వ్రతవిధానమును తెలుసుకొని ఆ వేశ్య రాజు దగ్గరకు వచ్చి "నేను కూడ ఉండ్రాళ్ళ తదియ నోము చేయదలచితిని, దానికి కావలసిన సామాగ్రులను పంపుమని చెప్పెను. విదియ నాటి తెల్లవారుజామున మరోఐదింటిని పుణ్యస్త్రీకి తోరముతో సహా వాయనమిచ్చి సుఖముగ నుండెను.

రాజుభార్యలు విషాదగ్రస్తులై, తమకీస్థితి యేలకలిగె"నని ఒక బ్రాహ్మణుని పిలిచి అడుగగ" మీరు ఉండ్రాళ్ళతద్ది వ్రతము చేయుడని చెప్పెను. ఆ పురోహితునిచే వారు ఆ వ్రతమును చేయించుకొని సుఖముగ నుండిరి. ఈ విధముగ ఐదు సంవత్సరము చేసి ఐదుగురు ముత్తయిదువులకు ఐదు ఉండ్రాళ్ళ వాయనము నిచ్చి రవికెల గుడ్డలను కూడ పెట్టవలెను. అనంతరము ఊయలలూగి అందరు కలసి భోజనము చేయవలెను. బ్రాహ్మణునకు దక్షిణతాంబూలము నీయవలెను.

## 50. అనంత పద్మనాభ స్వామి వ్రతము

**(దారిద్ర్య నివారణా వ్రతము)**

సూతమహర్షి శౌనకాది మహర్షులతో యిట్లనియె. "లోకమున మనుజుడు దరిద్రముచే పీడింపబడుచుండెనేని అట్టి దారిద్ర్యమును తొలగించునట్టియొక" వ్రతము గలదు చెప్పెద వినుడు.

పూర్వము పాండురాజు పుత్రుడైన ధర్మరాజు తమ్ములతోడ నరణ్య వాసము చేయుచు మిగుల కష్టములనుభవించుచుండిరి. వీరొకనాడు శ్రీకృష్ణునిగాంచి, "మహాత్మా! మేము కష్టముల నుండి కడతేరునట్టి ఉపాయమేదైనయున్న చెప్పుమని" ప్రార్థించెను.

శ్రీకృష్ణుడు "ధర్మరాజా! సమస్త జనులకు పాపములు నశింపజేసి, కష్టముల నుండి కడతేర్చి, సమస్త సంపదలొసగు వ్రతమొకటి గలదు. అది అనంత వ్రతము. ఈ వ్రతము భాద్రపద శుక్ల చతుర్దశి నాడు చేయవలెను. ఇది చేయువారికి సమస్త దుఃఖములు తొలగిపోయి,సంపదలతో సుఖముగ నుందురు" అని చెప్పెను,

ధర్మరాజు "శ్రీకృష్ణా! ఈ అనంతుడను దైవ మెవ్వరు? ఆదిశేషుడా? బ్రహ్మాది స్వరూపుడా? చెప్పుమని అడిగెను".

శ్రీకృష్ణుడు "ధర్మరాజా! అనంతుడనువాడును నేనే". కాల స్వరూపుడను నేనే. అనంతుడను నామముతో భూభారము తగ్గించుటకై రాక్షస సంహారమునకు వసుదేవుని గృహమున జన్మించితిని. నన్ను గృహస్తునిగను, హరిహర బ్రహ్మాదులుగను, సర్వవ్యాపకుడనైన పరమేశ్వరీ స్వరూపునిగను, సృష్టిస్థితిలయ కారణభూతునిగను, అనంతపద్మనాభునిగను, మత్స్య కూర్మాద్యవతార స్వరూపునిగను నెరుంగుము. నా హృదయమందు పదునలుగురు ఇంద్రులు అష్టవసువులు ఏకాదశ రుద్రులు ద్వాదశాదిత్యులు సప్తర్షులు భూర్భువ శ్లోకాదులు సమస్తములుగల నా స్వరూపమును నీకు తెలిపితిని" అని చెప్పెను.

ధర్మరాజు "జగన్నాథా! నీవు చెప్పిన అనంత వ్రతము నెట్లాచరించవలెను? యే దానములు చేయవలెను. యే దైవమును పూజించవలెను. పూర్వము దీనిని ఎవరు ఆచరించిరి? చెప్పు"మని అడిగెను.



"ధర్మరాజా! కృతయుగంబున వసిష్ట గోత్రోద్భవుండు వేదశాస్త్రార్థ సంపన్నుడు యైన, సుమంతుడను నొక బ్రాహ్మణుడు గలడు. అతనికి భృగుమహర్షి పుత్రిక దీక్షాదేవి యను భార్య గలదు. దీక్షాదేవికి శీలయను పుత్రిక గలదు. కొన్ని దినములకు దీక్షాదేవి మృతి చెందెను. అనంతరము సుమంతుడు కర్కశయను నొక కన్యను వివాహమాడెను. ఈమె మిగుల కఠిన చిత్తురాలు. కలహకారిణి.

మొదటిభార్య దీక్షాదేవి పుత్రికయైన శీల తండ్రి గృహమున పెరుగుచు, గోడలయందును, గడపలయందును, చిత్రవర్ణంబులతో దేవతా ప్రతిమలను చిత్రించుచు, శంఖ పద్మాదుల వలె ముగ్గులుపెట్టుచు దైవభక్తి గలదై యుండెను.

కౌండిన్యమునికి పెండ్లి చేసుకొనవలెనను కోరిక గలిగి, దేశసంచారము చేయుచు, సుమంతుని గృహమునకు వచ్చెను. సుమంతుడు కౌండిన్యుని పూజించి తన కుమార్తె నిచ్చి వివాహము చేసెను. అల్లుని కేదైన ఇచ్చి పంపవలెననుకోరికతో తన భార్య కర్కశను అడుగగా, కోపముతో యేమియులేదు పొమ్మనెను. సుమంతుడు చింతించుచు దారి బత్తెమునకు పిండి నిచ్చి అల్లునితోడ కూతురును పంపెను. వీరొక బండినెక్క తమ ఆశ్రమమునకు బోవుచుండగ మధ్యాహ్న వేళయైనందున సంధ్యావందనాది క్రియలు సలుపుటకై బండి దిగి తటాకమునకు పోయెను. ఆరోజు అనంతపద్మనాభ చతుర్దశియైనందున అచట నొకస్థలమందు స్త్రీలు ఎఱ్ఱని వస్త్రములు ధరించి మిగుల భక్తితో వ్రతము చేయుచుండిరి. కౌండిన్యుని భార్యశీల అది చూచి ఆ స్త్రీల వద్దకుపోయి "ఓ వనితామణులారా! మీరు యే దేవుని పూజించుచున్నారు? ఈ వ్రతము పేరేమి? నాకు సవిస్తరముగ చెప్పు"మని అడిగెను.

ఆ స్త్రీలు "ఓ పుణ్యవతీ! ఇది అనంత వ్రతము ఈ వ్రతము చేసిన అనంత ఫలములు గలుగును. భాద్రపద శుక్ల చతుర్దశినాడు నదీ తీరమున స్నానమాడి, పరిశుద్ధమైన స్థలమందు గోమయముచే అలికి సర్వతో భద్రంబను నెనిమిది దళములు గల తామర పుష్పమువంటి మండలమును నిర్మించి యా మండలమునకు చుట్టును పంచవర్ణములతోను బియ్యపు పిండితోను ముగ్గులుబెట్టి, ఆ వేదికకు దక్షిణ పార్శ్వంబున జలపూరిత కలశమునుంచి, ఆవేదిక నడుమ సర్వవ్యాపకుడైన అనంత పద్మనాభ స్వామిని దర్భతో నొనర్చి ఆవాహనము చేసి " కృత్వాదర్భమియం దేవం శ్వేత ద్వీపే స్థితం హరమ్ సమన్వితం సప్త ఫణైః పింగళాక్షం చతుర్భుజమ్" అను నీ శ్లోకమును చెప్పవలెను.

శ్వేతద్వీప వాసిగను, పింగళాక్షుడుగను, సప్త సహితుడుగను, శంఖ చక్ర గదాధరుడుగను ధ్యానముచేసి కల్పోక్త విధముగ షోడశోపచార పూజ కావించి, ప్రదక్షిణ నమస్కారముచేసి పదనాలుగు (14) ముడులుగల క్రొత్త తోరమును కుంకుమతో తడిపి, పద్మనాభస్వామి చెంతనుంచి, పూజించి గోధుమ పిండితో ఇరువది ఎనిమిది (28) పూర్ణములుగాని బూరెలుగాని నైవేద్యముపెట్టి తోరము గట్టుకొని పదునాలుగు నతిరసములను బ్రాహ్మణునకు వాయన దానమునిచ్చి,

తక్కినవానిని తాము భుజింపవలెను. మరియు పూజాద్రవ్యములన్నియు పదునాలు గేసిగా నుండవలెను. అనంతరము బ్రాహ్మణ సమారాధన చేసి, అనంతపద్మనాభ స్వామిని ధ్యానించుచు నుండవలెను. ఈ విధముగ వ్రతము పరిసమాప్తము గావించ వలెను. ప్రతి సంవత్సర మును నూతన తోరమును కట్టుకొనవలెను. ఇట్లు పదు నాలుగు సంవత్సరములు చేసి యుద్యాపనము చేసుకొని, మరల వ్రతమును ఆచరించు చుండవలెను" అని చెప్పిరి.

ఇది వినిన కౌండిన్యుని భార్య శీల స్నానముచేసి స్త్రీల సహాయముతో వ్రత మాచరించి తోరము గట్టుకొని త్రోవ బత్యమునకు దెచ్చిన సత్తుపిండిని బ్రాహ్మణునకు వాయనదానమిచ్చి, తానును భుజించి సంతుష్టురాలై భర్తకు భోజనముపెట్టి బండి నెక్కి ఆశ్రమమునకు పోయిరి.

అనంత వ్రతము నాచరించిన మాహాత్మ్యము వలన ఆశ్రమ మంతయు స్వర్ణమయ మయ్యెను. దంపతులిరువురు ఆనందముగ జీవించసాగిరి. ఇట్లుండ నొకనాడు కౌండిన్యుడు తన భార్య శీల కట్టుకొనిన తోరమును చూచెను."ఈ తోర మును ఎవరిని వశము చేసుకొనుటకు కట్టుకొంటి"వని దూషించెను.

"శీల ఇది అనంతపద్మనాభ స్వామి తోరము. ఈ స్వామి అనుగ్రహముననే మనకీ సంపదలు గలిగె"నని యధార్థము చెప్పినను కౌండిన్యుడు కోపావేశుడై "అనంతుడనగా యే దేవు"తడని దూషించుచు ఆ తోరమును త్రెంచి మండుచున్న అగ్నిలో పడవేసెను. శీల యేడ్చుచు పరుగెత్తి మండుచున్న తోరమును తీసి పాలలో తడిపి ఉంచెను.

ఈ విధముగ చేసినందువలన కౌండిన్యుని యైశ్వర్యము నశించెను. గోధనము దొంగల పాలయ్యెను. గృహముఅగ్ని పాలయ్యెను. గృహమందు పెట్టిన వస్తువులన్ని అచ్చటనే నశించెను. అందరితో కలహము వచ్చుచుండెను. ఎవ్వరును మాట్లాడ కుండిరి.

కౌండిన్యుడు యేమియుతోచక దారిద్ర్యంబుచే పీడింపబడుచు మహారణ్యము లలో తిరుగు చుండెను. అంతట అనంతపద్మనాభస్వామి జ్ఞాపకము వచ్చెను. భగవానుని ఎట్లయినను దర్శించవలెనని అనుకొనుచు, ఒక చోట ఫల పుష్పాదులతో నిండియున్న మామిడి చెట్టును చూచి, ఆ చెట్టుపై నొక్క కాకి కూడ వాలకుండుటను గాంచి, యశ్చర్యముతో "ఓ వృక్షరాజమా! అనంతుడను నామముగల దైవమును చూచితివా?" యని అడుగగా; ఆ వృక్షము"నేనెరుగ"నని చెప్పెను. కౌండిన్యుడు మరి కొంత దూరము వెళ్ళగ అచట గడ్డిలో నిలబడి గడ్డిమేయక అటు నిటు తిరుగుచున్న ఆవు దూడ కనుపించెను. ఆ గోవు చెంతకేగి "గోమాత! అనంతపద్మనాభ స్వామిని చూచితివా?" అని అడుగగా, "నేను చూడలేద"నెను. మరి కొంతదూరము వెళ్ళగా మోకాలు వరకు ఉండిన పచ్చికలో నిలబడియున్న వృషభమును చూచి "ఓ వృషభరాజా! అనంత పద్మనాభ స్వామిని చూచితివా? అని అడుగగా చూడలేదనెను.



మరికొంత దూరము వెళ్ళగ కమలములతో నిండియున్న రెండు కొలనులను చూచి "మీరు అనంతపద్మనాభుని చూచితిరా"యని అడుగగా, మేము చూడలేదనిరి. కౌండి న్యుడు మరికొంత దూరము వెళ్ళగ ఒకగాడిద ఒక యేనుగు నిలబడి యుండుట చూచి "మీరు అనంత భగవానుని చూచితిరా?" అని అడుగగా చూడలేదనిరి.

అంతట కౌండిన్యుడు విచారముతో దుఃఖాక్రాంతుడై మూర్ఛపోయి క్రిందపడెను. అప్పుడు భగవానుడు వృద్ధబ్రాహ్మణరూపము ధరించి కౌండిన్యుని వద్దకువచ్చి "ఓ విప్రోత్తమా! ఇటు రమ్మని" కుడిచేతిని పట్టుకొని తన గృహమునకు తీసికొనివెళ్ళెను. ఆ గృహము నవరత్నమణులతోను దేవాంగనలతోను ఉండుట గాంచి యాశ్చర్యము నొందుచుండగా గరుడసేవితుడు శంఖ చక్రధరుడు నగు పద్మనాభస్వామి కౌండిన్యునకు దర్శన మొసగెను. కౌండిన్యుడు ఆనందపరవశుడై

నమోనమస్తే వైకుంఠ శ్రీవత్స శుభలాంచన త్వన్నామస్మరణా త్పాప మశేషం

నః ప్రణశ్యతి నమోనమస్తే గోవింద నారాయణ జనార్దన" అనుచుస్తోత్రము చేయగ, అనంతస్వామి సంతుష్టుడై

"విప్రోత్తమా! నీవు చేసిన స్తోత్రముతో మిగుల సంతసించితిని. నీకు ఎల్లప్పటికిని దారిద్ర్యము సంభవింప కుండునట్లును, అంత్యకాలమున శాశ్వత విష్ణులోకము గలుగునట్లుగను వరమొసగితి" ననెను.

కౌండిన్యుడు ఆనందభరితుడై "ఓ జగన్నాథా! నేను దారిలో చూచిన ఆ మామిడిచెట్టు వృత్తాంతము" అని తాను దారిలో చూచిన వాటి నన్నింటి గురించి అడిగెను.

భగవానుడు "బ్రాహ్మణోత్తమా! పూర్వము ఒక బ్రాహ్మణుడు సకల విద్యలు చదువుకొనిన గర్వముచే నెవరికిని విద్య చెప్పక పోవుటచే నడవిలో ఎవరికిని ఉపయోగపడని మామిడి చెట్టుగ జన్మించెను. మరొకడు భాగ్యవంతుడైయుండియు ఎన్నడు అన్నదానము చేయనందువలన పశువుగా పుట్టి గడ్డితినుటకు నోరాడక పచ్చిగడ్డిలో దిరుగుచున్నాడు. మరొకరాజు ధన గర్వముతో బ్రాహ్మణులకు చవిటి భూమిని దానము చేసినందువలన ఆ రాజు వృషభమై అడవిలో తిరుగుచున్నాడు. ఆ కొలనులు రెండును ధర్మము ఒకటి అధర్మము మరొకటి యని గ్రహించుము. మానవుడు సర్వదా పరులను దూషించుటవలన గాడిదయై పుట్టి తిరుగుచున్నాడు. మరొకడు తన పెద్దలు చేసిన ధర్మమును విక్రయించి నందువలన యేనుగుగా జన్మించెను. అనంతపద్మనాభుడనైన నేనే బ్రాహ్మణ స్వరూపముతో నీకు ప్రత్యక్షమైతిని. కావున నీవు అనంత వ్రతమును పదునాలుగు సంవత్సరములు ఆచరించితివేని నీకు నక్షత్రస్థానమిచ్చెద"నని చెప్పి భగవానుడు అంతర్ధానమయ్యెను.

అనంతరము కౌండిన్యుడు గృహమునకు తిరిగివచ్చి భార్యకు జరిగినదంతయు చెప్పెను. పదునాలుగు సంవత్సరములు వ్రతమునాచరించి ఇహలోక సుఖములను భవించి అంత్యకాలమున నక్షత్ర మండలమునకు వెళ్ళెను.

ఓ ధర్మరాజా! ఆ కౌండిన్యుడు నక్షత్రమండలమున కనుపించు చుండును. అగస్త్య మహాముని ఈ వ్రతము చేసి లోక ప్రసిద్ధుడయ్యెను. సగర దిలీప భరత హరిశ్చంద్ర జనకమహారాజు మొదలగు అనేకమంది రాజులు ఈ వ్రతము చేసి ఇహలోకమున రాజ్యములనుభవించి అంత్యమున స్వర్గము పొందిరి.

ఈ కథను చదువువారు వినువారు ఇహలోకమున అష్టైశ్వర్యముల ననుభవించి అంతమున పరమపదమును బొందుదురు.

### ఆశ్వీయుజ మాసవ్రతములు

## 51. పిత్ృపక్షము - (ఆశ్వీయుజ కృష్ణ పక్షము)

ఆశ్వీయుజ కృష్ణపక్షము 15 దినములను పితృపక్షమందురు. ఈ 15 దినములు జనులు తమపితరులకు తర్పణము విడచెదరు. వారు మరణించిన తిథినాడు శ్రాద్ధము చేయుదురు. పితరుల ఋణము శ్రాద్ధముతో తీరును. యే మాసమందు యేతిథి యందు స్వర్గవాసులైనను ఆ తిథినాడు శ్రాద్ధము జరిపెదరు. శ్రాద్ధమనిన శ్రద్ధతో జరుపునది. పితృశ్రాద్ధము జరిపిన పితృగణములు ఆ సంవత్సరమంతయు ప్రసన్నులై యుందురు. అమావాస్య పితరులకు పుణ్యతిథి. నవమితిథి తల్లిశ్రాద్ధమునకు పుణ్యప్రద మైనది.

శ్రాద్ధమునకు పవిత్రస్థానము గయాతీర్థము. సిద్ధపురము తల్లి శ్రాద్ధమునకు పవిత్రమైనది. దీనితో మాతృఋణముతీరును. దీనిని మాతృగయ అందురు. పితరులకు పిండదానము చేయువారు దీర్ఘాయువులుగను పుత్రపౌత్రదులతోను ధన ధాన్యాది సంపదల గలిగియుందురు. ఆశ్వీయుజ, మాసమందు పితరులు తమ పుత్రులు పౌత్రులు చేయుపిండదానము కొరకు ఎదురుచూచెదరు. తమశక్తికి తగినట్లుగ తమ పితరులకు దేనినైనను తర్పణము గావించి శ్రాద్ధము చేయవలెను.

మహాలయ అమావాస్య పితరుల తిథులు తెలియనివారు మహాలయ అమావాస్యనాడు తర్పణాది శ్రాద్ధములు చేయుదురు.

సద్గుణ సంపన్నుడైన బ్రాహ్మణుని శ్రాద్ధమునకు వినియోగించవలెను. వికలాంగులైన బ్రాహ్మణులు శ్రాద్ధమునకు పనికిరారు.

శ్రాద్ధకర్మలు 15 దినముల వరకు క్షౌరకర్మలు చేయరాదు. బ్రహ్మచర్యమును పాలించవలెను. ప్రతిదినము స్నానాంతరము తర్పణము గావించవలెను.

పుల్లతో దంతములు తోముకొనుట, తాంబూలము, తైలము పూసుకొనుట, భోజనముచేయుట, స్త్రీసంగమము, ఔషధ మును సేవించుట, పరుల అన్నమును తినుట ఇవి ఏడును శ్రాద్ధ కర్తలు విసర్జించవలలెను. తాము భుజించినదే పితరులకు పెట్టవలెను. శ్రాద్ధానంతరము బ్రాహ్మణునకు దక్షిణా తాంబూలములనిచ్చి నమస్కారము చేయవలెను.



## 52. నవరాత్రులు (ఆశ్వయుజ)

### (అశ్విని శుక్లపక్ష ప్రతిపత్ తిథి నుండి నవమి వరకు)

ఆశ్వీయుజ శుక్లపక్ష ప్రతిపదాతిథి నుండి నవమి తిథి వరకు నవరాత్రవ్రతము చేయుదురు. ఇవి వాసంతిక (వసంత) నవరాత్రులు, శారద నవరాత్రులని రెండు విధములైనవి. విష్ణువును ఉపాసించువారు వసంత నవరాత్రులను, శక్తిని ఉపాసించు వారు శారదా నవరాత్రులను జరుపుకొందురు. రెండును ముఖ్యమైనవే. అన్ని వర్ణములవారును ఉపాసించవచ్చును.

ఉపవాసముండి నవరాత్రులందు దుర్గను పూజించెదరు. కొందరు ఏకభక్తులై ఉపాసించెదరు. కొందరు శ్రీదుర్గాసప్తశతిని నిష్కామ భావముతో పఠించెదరు. నియమముతో దుర్గను నవరాత్రులందు పూజించువారు తప్పక ఫలమును పొందుతారు. పవిత్రమైన స్థానమును వేదికను నిర్మించి ధ్యానమును పోయవలెను. దానిపై శక్త్యాను సారముగ కలశమును స్థాపించవలెను. దానిపై మూర్తిని (లేకున్న చిత్రపటమునైనను) స్థాపించవలెను. పూజ సాత్త్విక రాజస తామస మను మూడు విధములు గలదు. ప్రథమముగా గణేశుని పూజించి మాతృకా లోకపాల నవగ్రహ వరుణదేవులను పూజించవలెను. ప్రధానుడైన మూర్తికిషోడశోపచారములతో పూజచేయవలెను. రామకృష్ణ లక్ష్మీనారాయణులను భగవతి దుర్గాదేవి ఆదిమూర్తులను షోడశోపచారములతో పూజించవలెను. దుర్గాదేవి ఆరాధనా అనుష్ఠానములందు మహాకాళి మహాలక్ష్మి మహాసరస్వతులను పూజించవలెను.

దేవీవ్రతమందు కుమారీలనుపూజించవలెను. తొమ్మిది దినములు కన్యల చరణములు కడిగి, వారిని దేవీ రూపిణులుగా తలచి గంధపుష్పాదులతో అర్చన గావించి, వారికి మృష్టాన్న భోజనముపెట్టి వస్త్రాదులను సమర్పించవలెను. ఈవిధముగా ఒక కన్యను పూజించిన ఐశ్వర్యము, ఇరువురు కన్యలను పూజించిన భోగమోక్షములు, ముగ్గురు కన్యలను పూజించిన కామములు, నలుగురు కన్యలను పూజించిన రాజ్యపదవి, ఐదుగురు కన్యలను పూజించిన ధర్మార్ధ విద్యయు, ఆరుగురు కన్యలను పూజించిన షట్కర్మసిద్ధులు, ఏడుగురు కన్యలను పూజించిన రాజ్యము, ఎనిమిది మంది కన్యలను పూజించిన సంపదలు, తొమ్మిది మంది కన్యలను పూజించిన పృథ్వియందు ప్రభుత్వ ప్రాప్తిగలుగును. ఒకొక్కరోజునకు ఒకొక్కరిని పెంచుతు కన్యలను పూజించవలెను. 10 సంవత్సరముల వయస్సులోపు కన్యలేపూజకు అర్హులు. (2) రెండు సంవత్సరములకన్య కుమారి యగును. 3 సంవత్సరముల కన్య త్రిమూర్తిని యగును. 4 సంవత్సరములుగల కన్య కల్యాణి యగును. 5 సంవత్సరములుగల కన్యరోహిణి యగును. 6 సంవత్సరములు గల కన్య కాళియగును. 7 సంవత్సరములు గల కన్య చండిక యగును. 8 సంవత్సరములుగలకన్య శాంభవి యగును. 9 సంవత్సరములు గల కన్య దుర్గ యగును. 10 సంవత్సరములు గలకన్య సుభద్ర స్వరూపిణియగును.

దుర్గాదేవికి ప్రతిపదా తిథి నాడు కేశసంస్కారమునకు సుగంధతైలము, ద్వితీయ తిథినాడు కేశములుకు కట్టుటకు పట్టుదారము, తృతీయతిథినాడు సింధూర దర్పణములు, చతుర్థీతిథినాడు మధుపర్కము తిలకము, కాటుక, పంచమీతిథినాడు అంగరాగ చందనాది ఆభూషణములు, షష్ఠీతిథినాడు పుష్పములు పుష్పమాలాదులు, సమర్పించవలెను. సప్తమీతిథినాడు గ్రహమధ్యపూజ, అష్టమీతిథినాడు ఉపవాసముండి పూజించుట, నవమితిథినాడు మహాపూజ మరియు కుమారీపూజ చేయవలెను. దశమినాడు పూజానంతరము పాఠకుని పూజించి దక్షిణ లీయవలెను. మరియు హారతి నిచ్చి విసర్జించవలెను. యజ్ఞాదులతో వ్రతము సమాప్తము గావించవలెను.

## 53. విజయదశమి (ఆశ్వీయుజ శుక్ల దశమి)

క్షత్రియులకిది గొప్ప పర్వదినము. బ్రాహ్మణులు ఈ దినమున సరస్వతిని పూజించెదరు. క్షత్రియులు శస్త్రములను పూజించెదరు. దుర్గను విసర్జించుట, అపరాజితను పూజించుట, విజయుని ప్రయాణము, శమీపూజ, నవరాత్రపారాయణ (ఉపవాసముండి మరునాడు చేయుభోజనము) ముఖ్యమైన కార్యములు. సూర్యుడస్తమించగనే రావణకుంభకర్ణ మేఘనాదుల బొమ్మలను కాల్చెదరు. ఈ పండుగను భగవతీ నామమున విజయదశమియని అందురు. మరియు ఈనాడు శ్రీరాముడు రావణుని వధించెను. ఇందువలనను ఈ దినమును విజయదశమి యందురు. జనులు ఈదినమున తమకు విజయము గలుగవలెనని ప్రారంభించెదరు.

## 54. శారదా నవరాత్రులు

శారదా నవరాత్రులు విజయదశమి శరత్పూర్ణిమలు మూడు పరస్పర సంబంధమైనవి. ఆశ్వీయుజ శుక్ల ప్రతిపదాతిథి నుండి పూర్ణిమవరకు దేవీ పక్షమందురు. ఆశ్వీయుజ కృష్ణ ప్రతిపదా తిథినుండి అమావాస్యవరకు పితృపక్షమందురు. అందువలన మొదట పితరులకు శ్రాద్ధ తర్పణములు గావించి, దేవీపక్షమును ప్రారంభించెదరు. మాతపితరులు ప్రసన్నులైన సమస్త దేవతలు ప్రసన్నులగుదురు.

ఆశ్వీయుజ కృష్ణ పక్ష అమావాస్యను మహాలయ అమావాస్యయందురు. ఈ తిథికి ముందు పితృకర్మలు చేసి, అనంతరము దేవీపక్షమును ప్రారంభించెదరు. ఈ సంగమతిథి తీర్థ స్వరూపమైనది. మహాలయ పావన తిథి శాస్త్రీయమైనది, వైజ్ఞానికమైనది.

నాలుగు నవరాత్రులుగలవు. 1. చైత్రశుక్ల ప్రతిపదాతిథినుండి దశమివరకు 2. ఆషాఢ శుక్ల ప్రతిపదా తిథినుండి దశమివరకు, 3. ఆశ్వీయుజశుక్ల ప్రతిపదా తిథినుండి విజయదశమివరకు 4. మాఘశుక్ల ప్రతిపదా తిథినుండి దశమివరకు సారస్వత నవరాత్రులు. ఈ నాలుగింటిలో వాసంతిక (వసంత) నవరాత్రులు చైత్రమందును, శారదీయ (శారద) నవరాత్రులు ఆశ్వీయుజమందు వచ్చును. ఇవి



రెండును అతిప్రసిద్ధమైనవి. సర్వత్ర ఆరాధనీయమైనవి. మిగిలిన రెండు శక్తి పీఠములందు జరుగును.

### దుర్గా - శబ్దార్థము

దైత్యనాశార్థ వచనో దకారః పరికీర్తితః।
ఉకారోవిఘ్ననాశస్య వాచకో వేదసమ్మతః॥
రేఫోరోగఘ్న వచనో గశ్చ పాపఘ్న వాచకః।
భయశత్రుఘ్న వచన శ్చాకారః పరికీర్తితః॥

దుర్గా శబ్దమునకు 'ద'కారము దైత్య నాశకము, 'ఉ'కారము విఘ్న నాశకము, 'రేఫ' రోగ నాశకము, 'గ'కారము పాప నాశకము 'ఆ'కారము భయశత్రునాశకము. అందువలన దుర్గ 'దుర్గతినాశిని' యైనది.

ప్రథమముగా శ్రీరాముడు ఈ శారద నవరాత్రులను సముద్రతీరమున ప్రారంభించెను. అందువలన ఇది రాజసపూజయైనది. విజయదశమినాడు దశముఖ రావణుని వధించుటకు శ్రీరాముడు కపిసేనలతో బయలుదేరి వెళ్ళెను.

శరద్ వసంత నామములతో ఇరువురు భయంకరమైన దానవులుండిరి. వీరు వివిధ రోగములకు కారణులగు చుండిరి. ఈ ఋతువులందు వివిధ రోగములను మహామారి జ్వర శీతల కఫాది రోగముల నివారణార్థము శారద నవరాత్రులు వసంత నవరాత్రులందు దుర్గను పూజించుట ప్రశస్తమైనది.

కలశమందు తొమ్మిదిరోజులున్న జలము అమృతమయమగును. ఈ జలమును జల్లుకొనిన రోగవినాశకులై పాపవిముక్తు లగుదురు. తామ్ర పాత్రలో ఈ జలమునుంచిన అది అమృతమయమై మూడు నెలలు తరువాత సర్వరోగనాశక మహౌషధి యగును. దీనిని ఆధునిక వైజ్ఞానులు చికిత్స కొరకు పరీక్షించిరి.

కలశముపై స్థాపించిన నారికేళ మందున్న జలముతో శరత్పూర్ణిమ సాయంకాలము మహాలక్ష్మిని పూజించవలెను. ఈరాత్రిని "కోజాగర్తి" (కోజాగరి) యని అందురు. ఈ రాత్రి జాగరణ అతి విశిష్టమైనది.

## 55. కోజాగర వ్రతము (ఆశ్వీయుజ పూర్ణిమ)

ఆశ్వీయుజపూర్ణినాడు మహాలక్ష్మి రాత్రియందు ఎవరు జాగరణ చేయుచున్నారో చూచుటకు తిరుగుచుండును. ఆ రాత్రి జాగరణ చేయువారికి లక్ష్మి ధనమునొసగును. లక్ష్మికొరకు జాగరణచేయు కారణమున ఈ వ్రతమునకీ పేరు వచ్చెను. ఈ రోజు ఐరావతముపైనున్న ఇంద్రుని మహాలక్ష్మిని పూజించవలెను. ఉపవాసముండవలెను. గంధపుష్పాదులతో పూజించి నేతితో 100గాని, అంతకు మించిగాని దీపములను దేవమందిరములందుగాని, తోటలోగాని తులసి లేక అశ్వత్థవృక్షము క్రిందగాని భవనమునందుగాని వెలిగించవలెను. ప్రాతఃకాలమైనంతనే

స్నానాదులుచేసి ఇంద్రుని పూజించి, బ్రాహ్మణులకు పాయసముతో భోజనముపెట్టి వస్త్రాది దక్షిణలిచ్చి, స్వర్ణదీప మును దానమొసగిన అనంతమైన ఫలము దక్కును. ఈదినమున శ్రీసూక్తమును లక్ష్మీ స్తోత్రమును బ్రాహ్మణులచే పఠింపజేసి, యజ్ఞముచేయంచవలెను.

మగధ దేశమందు అయాచకవ్రత బ్రాహ్మణుడుండెను. ఇతని భార్యచండి అతి కర్కశురాలు. రోజు భర్తను ధనము దోచుకొని రమ్మని దూషించుచుండెను. ఒకనాడు శ్రాద్ధపిండమును తీసి విసరికొట్టెను. బ్రాహ్మణుడు దుఃఖించుచు అడవికి వెళ్ళెను. అచట నాగకన్యలు కనుపించిరి. నాగకన్యలు లక్ష్మిని ప్రసన్నురాలిని చేసు కొనుటకు కోజాగర వ్రతమును చేయుమని చెప్పిరి. ఆరోజు ఆశ్వీయుజపూర్ణిమ యగుటచే బ్రాహ్మణుడావ్రతము చేసి అతి ధనవంతుడయ్యెను. లక్ష్మీదేవి కృపతో వీనిభార్యకూడ నిర్మల మనస్కురాలయ్యెను. అనంతరమీ దంపతులు సుఖముగ నుండిరి.

## 56. శరత్పూర్ణిమ



ఆశ్వీయుజ శుక్లపక్ష పూర్ణిమను (పౌర్ణమి) శరత్పూర్ణిమ యందురు. ఈరోజు రాత్రి చంద్రుడు వెన్నెలలో అమృత ముండును. చంద్ర కిరణామృతముతో ఆరోగ్యము ప్రాప్తించును.

ఈదినము ప్రాతఃకాలమున తమ ఆరోగ్య దేవుని వస్త్రాభూషణములతో అలంకరించి యథావిధిగ షోడశోపచార పూజలు చేయవలెను. అర్ధరాత్రి సమయమున ఆవుపాలతో పాయసముచేసి భగవానునకు నివేదన చేయవలెను. పాయసమును పాత్ర నిండుగనుంచి ఆరుబయట వెన్నెలలో నుంచి అర్ఘ్య ప్రదానము చేయవలెను.

ఈదినము కంచుపాత్రలో నిండుగ నెయ్యి పోసి సువర్ణసహితముగ బ్రాహ్మణునకు దానమొసగిన తేజస్వులగుదురు. అపరాహ్న (పగటి మూడవజాము) సమయమున గజములకు నీరాజనముచేయు విధానము కూడకలదు.

శ్రీకృష్ణభగవానుడు ఈ దినముననే రాసలీల చేసెను. ఇందువలన వ్రజమందు ఈ పర్వదినమును విశేషముగ జరుపుకొందురు. దీనిని రాసోత్సవమనియు కౌముదీ మహోత్సవమనియు కూడ అందురు.

## 57. ఆశ్వయుజ మాసవ్రత పర్వోత్సవములు
## అట్ల తదియ వ్రతము (ఆశ్వీయుజ బహుళ తదియ)

నాలుగు వర్ణములకన్యలు అట్ల తదియ వ్రతముచేసుకొనుటకు ఉపవాస ముండిరి. ఈ వ్రతమునకు ఐదుగురు సౌభాగ్యవతులైన స్త్రీలు ముత్తయిదువులుగ



నుండవలెను. తదియకు ముందురోజు ఐదురుగు ముత్తయిదువు లకు తలార స్నానముచేయుటకు, కుంకుడుకాయలు, సున్నిపిండి, నూనె ఇవ్వవలెను. చేతులకు పెట్టుకొనుటకు గోరింటాకును కూడ ఇవ్వవలెను. తెల్లవారు జామున ఈ ఐదుగురు ముత్తయిదువలకు భోజనముపెట్టి తాము భుజించవలెను. వారికి కాటుక, పసుపు, కుంకుమ, పుష్పములను ఈయవలెను. తెల్లవారి తదియనాడు మరల చంద్రోదయ మగునంతవరకు భుజింపరాదు. వ్రతముచేయువారు, ఐదుగురు ముత్తయిదువులు పగలంతయు ఉపవాసముండవలెను. నలుగురు కన్యలలో రాచవారి కన్య సుకుమారి యగుటచే నీరసించి పడిపోయెను. విషయము తెలుసుకొనిన ఈమె అన్నలు సమీప మందు స్థలముతో గడ్డికుప్పను తగులబెట్టి, ఆమంటను అద్దములో చంద్రుడు వచ్చెనని చెల్లెలికి చూపగా, ఆమె భోజనముచేసెను. వ్రతభంగమైనందున యే సంబంధము చూసినను ముసలి వారే కనుపించుచుండిరి. వారిని ఇచ్చి వివాహము చేయుదురని భయపడి ఆ కన్య ఇల్లువిడచి పారిపోవుచుండ పార్వతీ పరమేశ్వరులు మారువేషమున కనుపించిరి. విషయమును వినినవారు, నీవు వ్రతభంగముచేసితివి. నీ అన్న లీ విధముగ చేసిరి, మరల నీవు ఆ వ్రతమును చేసిన నీకు యువకుడైన భర్త లభించునని చెప్పగ, ఆమె తిరిగి వచ్చి నియమముగ వ్రతముచేసి యువకుని భర్తగా పొందెను.

తదియ నాడు ఉపవాసానంతరము చంద్రుని చూచి ముత్తయిదువులతో కలసి భోజనము చేయవలెను. ఆ రోజు ముత్తయిదువులకు ఒక్కొక్కరికి పదునొకండు (11) అట్లు, పదునొకండు నూలుపోగులుపోసి, పదునొకండు ముడులువేసి (ఆకులు, పుష్పములుపెట్టి) న తోరములు ఐదుగురు ముత్తయిదువులకు, అట్ల వాయనములపై పెట్టవలెను. పదనొకండు నూలుపోగులు పోసిన దారమును ముడులులేకుండగ మెడలో వేసుకొనుటకు ఐదువాయనములపై పెట్టి, తాంబూలము జాకెట్టు గుడ్డను కూడపెట్టి ఐదుగురుకు వ్రతము తీర్చుకొనువారు వాయన మీయవలెను. ఆ తరువాత ఐదుగురు ముత్తయిదువులతో కలసి ఊయల ఊగి, ఆ తరువాత భోజనము చేయవలెను. తోరములను వ్రతధారులుకూడ ధరింపవలెను. ఈ విధముగచేసిన అఖండ సౌభాగ్యవతులగుదురు. గౌరీదేవికి అట్ల వాయనము సమర్పించి ముందుగ పూజించవలెను. అనంతరము వ్రతము చేయించిన బ్రాహ్మణునకు దక్షిణ తాంబూల మీయవలెను. ముత్తయిదువుల పాదములకు నమస్కారముచేసి ఆశీర్వాదములను పొందవలెను. తన అత్తగారికి కూడ వాయనమిచ్చి పాద నమస్కారముచేసి ముందుగ ఆమె ఆశీర్వాదములను పొందవలెను.

గౌరీదేవి జన్మించుట, వివాహాది సమస్త కార్యములు తృతీయ (తదియ) తిథినాడు జరిగినవి. గౌరీదేవికి తదియ (అట్లతద్ది) యనిన చాలాఇష్టము. తదియనాడు ఎవ్వరూఉప్పు తినకూడదు. లోహ ఉప్పును త్యజించి (ప్రతి తదియ యందును) ఉపవాసముండిన అచల సౌభాగ్యము ప్రాప్తించును. ధనసంపదలు సమస్త కోరికలు తీరును.

## 58. ఉత్తముడైన పతిని పొందు వ్రతము

నారదుడు అప్సరసలకు చెప్పిన విష్ణువ్రతము.

నారదుడు పూర్వకల్పమందు మానస సరోవరమునకు స్నానమునకెళ్ళెను. అక్కడతడు అప్సరసలను చూచెను. వారుకూడ నారదుని చూచిరి. వారు నారదునితో మహామునీ! బ్రహ్మతనయా! "మేము నారాయణ భగవానుని భర్తగా పొందవలెను, ఇదెట్లు సాధ్యమో చెప్పుడని" అడిగిరి.

నారదుడు నమస్కరించి "అడుగుట శుభప్రదమైనది. కానీ మీరు గర్వముతో యౌవన మదముతో"నాకు నమస్కరించలేదు. దేవదేవుడైన విష్ణువు నామమును మీరు ఉచ్చరించినారు గాన సర్వము చేసినట్లగును.

ఇప్పుడొక వ్రతము చెప్పుచున్నాను. దానివలన హరి వరదాయకుడగును. భర్తకూడయగును. వసంత మాసములో శుక్ల పక్ష ద్వాదశి శుభప్రదమైనది. ఆ దినము ఉపవసించి యథావిధిగ హరిని అర్చించవలెను. వెండితో లక్ష్మీనారాయణుల ప్రతిమను చేయించవలెను. భగవానునకు ఎల్లని పుష్పములతో మండపమును నిర్మించవలెను. నృత్యాది గీతములతో జాగరణ చేయవలెను.

ఓం భవాయ నమః, ఓం అనంగాయ నమః, ఓం కామాయ నమః, ఓం సుశాస్త్రాయ నమః, ఓం మన్మథాయ నమః, ఓం హరయే నమః, అనుచు భగవానుని శిరస్సును, కటిని, రెండు భుజములను, ఉదరమును, పాదములను సర్వాంగములను మల్లిజాతి పుష్పములతో పూజించవలెను. మండపమునకు నాలుగువైపులా నాలుగు చెరకుగడలను ఉంచవలెను. జాగరణచేసి ప్రాతఃకాలమున వేదవేదాంగ వేత్తయైన సర్వావయవ (వికలాంగుడుకాని) పరిపూర్ణుడైన బ్రాహ్మణునకు ప్రతిమను దానము చేయవలెను. ఈ విధముగ చేసిన విష్ణు భగవానుడు అవశ్యము మీకు పతియగును. చెరకు రసమును భగవానునకు నివేదనచేసి మల్లెపువ్వులతో దేవేశ్వరుని పూజించ వలెను.

అప్సరసలారా! మీరు నాకు ప్రణామముచేయక అడిగితిరి గాన మీకు అష్టావక్రముని శాపముగలుగును. (అతనిని పరిహసించినకారణమున) ఈ వ్రతముచేసి దేవేశుని పతిగా పొందిన గర్వముతో చేసిన అవమానమువలన గోపాలుర చేత మీరు అపహరించబడెదరు" అని చెప్పి నారదుడు వెళ్ళిపోయెను.

ఈ వ్రతమును చేసిన కన్యలుకు ఉత్తమ భర్తృ ప్రాప్తి గలుగును.

(వరాహపురాణము)

## 59. సరస్వతీ వ్రతము

సూతుడు : "శౌనకమహర్షులారా !ఆశ్వీయుజ శుక్లపక్ష పాడ్యమి మొదలు తొమ్మిది రాత్రులు దుర్గాలక్ష్మీ సరస్వతులను పూజింపవలయును. లేనిచో మూలా నక్షత్రము మొదలుకొని యైనను పూజింపవలెను. ఇదియును చేయలేనివారు నవమినాడైనను పూజింపవలెను.



కృతయుగమునందు సుకేతుడను రాజు గలడు. ఇతని భార్యపేరు సువేది. ధర్మము తప్పక రాజ్యమేలు చుండెను. ఇట్లుండ శత్రువులతో యుద్ధముకలిగి పరాజితుడై పారిపోవుచుండ ఇతని భార్యకూడ వీనివెంట వెళ్ళెను. వీరొక నగరము ప్రవేశించిరి. క్షుద్బాధాపీడితుడై రాజు వ్యాధిగ్రస్తుడయ్యెను. రాణి శోకించుచు తిరుగు చుండ అంగీరస మహర్షి ఈమెను చూచి దగ్గరకువచ్చి "మీరెవ్వ"రని అడిగెను. ఆమె జరిగినదంతయు చెప్పి యేడ్వసాగెను.

అప్పుడాముని "నీవు నీ భర్తను తీసుకొని నాతో"రమ్ము. ఇచట పంచవటీ తటను కలదు. అందు దుర్గాక్షేత్రముండెను. నీవు దుర్గాదేవిని భక్తితో పూజించిన మరల నీకు రాజ్యము, తదితర సంపదలన్నియు లభించును. అని చెప్పెను.

ఆమెభర్తను మోసుకొని వెళ్ళి ఆ సరస్సులో స్నానము చేసెను. అనంతరము అంగిరసుడు వారితో దుర్గా సరస్వతులకు పూజచేయించెను. ఈ విధముగ పాడ్యమి మొదలు తొమ్మిది రోజులు పూజ చేయించి పదియవనాడు పాయసమును దుర్గాదేవికి నివేదనము చేసి, దశవిధములైన దానములుచేసి, ఆశ్రమ మందే కొంతకాలముండిరి. కొంతకాలమునకు ఈమెకు ఒక పుత్రుడు కలిగెను. ఆ బాలునకు అంగీరసుడు జాతకర్మాది సంస్కారములు గావించి సూర్యప్రతాపుడను పేరు పెట్టెను. ఐదుసంవత్స రములకు విద్యాభ్యాసము చేయించెను. అంతటా బాలుడు సకల శస్త్రాస్త్రవిద్యల నభ్యసించెను. పెద్దవాడైన తరువాత మహర్షి అనుజ్ఞతీసుకొని శత్రువులపై యుద్ధము నకు పోయెను. వారు ఆ బాలునితో పోరాడలేక పరాజితులైరి. వారు తిరిగి తమ రాజ్యమును పొందిరి. ఆ నాటినుండి వారు దుర్గను సరస్వతిని పూజించుచుండిరి.

ఇది పఠించువారు, వినువారు పాపవిముక్తులై పరమ పదమును పొందుదురు.

### కార్తీకమాస వ్రతములు

## 60. కార్తీక మాస వ్రతపర్వతోత్సవములు

**(ధర్మార్థకామ మోక్షములనొసగు కార్తీకము)**

సూర్యుడు తులారాశిపై వచ్చినంతనే కార్తీకమాసము ప్రారంభమగును. కార్తీకమాస మాహాత్మ్యము పద్మపురాణము స్కంధపురాణములందు బహువిస్తారముగ నుండెను. ఈ మాసమందు స్త్రీలు బ్రహ్మముహూర్తమందేలేచి స్నానముచేసి రాధా దామోదరుని పూజించెదరు. ఈ వ్రతము మోక్షసాధనమైనది. ధర్మార్థ కామమోక్షముల నొసగునట్టిది.

నారాయణ భగవానుడు బ్రహ్మకు, బ్రహ్మ, నారదునకు, నారదుడు పృథు మహారాజు నకు కార్తీకమాస మాహాత్మ్యమును చెప్పిరి. పరివార జనులకు యేదో విధముగా కష్టనష్టములు దుఃఖములు గలుగుచున్నను, సుఖసంతోషాదులు లేకున్నను వాని నివారణకు ఈవ్రతము చేయవలెను. ఈ మాసమంతయు బ్రాహ్మము హూర్తమునేలేచి స్నానముచేసి భగవానుని పూజించవలెను.

ఈవ్రతముచేయు స్త్రీలు అక్షయ నవమినాడు ఉసిరిచెట్టుక్రింద కార్తికేయ భగవానుని కథ వినవలెను. అనంతరము బ్రాహ్మణునకు ధనధాన్యములను దానమీయ వలెను. కార్తీకమాసమంతయు దానముచేయు విధానముగలదు. ఈ మాసమందువచ్చు అమావాస్య పర్వదినమును దేశమంతటను చేయుదురు. దీనిని ప్రకాశ పర్వదిన మందురు. దీపావళి దినమున విష్ణుప్రియలక్ష్మీదేవిని అంతట తిరుగుచుండును. తనభక్తులను అన్నివిధముల ధనధాన్యపరిపూర్ణులనుచేయును.

స్కంధపురాణ వైష్ణవ ఖండమున కార్తీక మాహాత్మ్యము నీవిధముగ జెప్పిరి. ఇది రోగవినాశకమైనది. సద్బుద్ధి నొసగునట్టిది, లక్ష్మీ అనుగ్రహమును గలిగించు నది.

కార్తీకమాస మంతయు దీప దానము చేయవలెను. ఆకాశ దీపమును పెట్ట వలెను. ఇది కార్తీకమాస మందు ముఖ్యమైనది. కార్తీకమందు తులసీ ఆరాధనకు విశేషమైన మహిమగలదు. తులసి రోగ వినాశిని. ముక్తిప్రదాయిని తులసీవనము పర్యావరణశుద్ధి గలిగించును. భక్తితో తులసీ పత్రములతోగాని, లేతచిగురు టాకులతో గాని భగవానుని పూజించిన అత్యంత లాభమును పొందుదురు. తులసిని విష్ణుప్రియ అందురు. ఇదే విధముగ కార్తీకమందు భూమిపై శయనించుట ముఖ్యమైనది. దీని వలన సాత్త్విక భావము వృద్ధియగును. మరోముఖ్యమైనది బ్రహ్మచర్యపాలన.

మినుములు, పప్పు దినుసులు (పెసరమినపశెనగ) తినరాదు. నువ్వుల నూనెయు పనికిరాదు. కార్తీకమాసమందు విష్ణు సంకీర్తనము ముఖ్యమైనది. సంకీర్త నతో వాక్సుద్ధి గలుగును. కలియుగమందు దీనికి గొప్ప మహత్తుగలదు. "కలౌ హరికీర్తనాత్"! కథా శ్రవణముతో పాపము నశించును. ఈ వ్రతము చేయువారు గీత శ్రీమద్భాగవతము శ్రీరామచరితమానసాది గ్రంథములను పఠించినను, వినినను పాపము నశించి మోక్షమును పొందుదురు.

గోదానము, అన్నదానము, విష్ణువును పూజించుట సత్యము అహింసాది ధర్మములను పాటించవలెను. పరమపావన కార్తీకమాసవ్రత విధానము, కార్తీక మాసము మోక్షమునకు సర్వోత్తమమైనది. విష్ణుభగవానునివలె దుర్లభమైనది. కల్యాణ ప్రదమైనది. కార్తీకమాసముతో సమానమైన మాసములేదు. సత్యయుగముతో సమానమైన యుగము లేదు. వేదముతో సమానమైన శాస్త్రములేదు. గంగతో సమాన మైన తీర్థములేదు.

శ్రీ కాశీవిశ్వనాథుడు ఎచటహరియుండునో అచట హరుడుండునని స్వయ ముగ చెప్పెను. కార్తీకవ్రతము చేయువారు మొదట గంగను, విష్ణువును, శివుని, సూర్యుని స్మరించి జలమందు ప్రవేశించి స్నానము చేయవలెను. గృహస్తులు నల్ల నువ్వులు ఉసిరి చూర్ణమును పూసుకొని స్నానము చేయవలెను. విధవలు, సన్యాసులు తులసి మొదలులో నున్న మట్టిని పూసుకొని స్నానము చేయవలెను. సప్తమి అమా వాస్య నవమి ద్వితీయ దశమి త్రయోదశి తిథులందు నువ్వులను ఉసిరి చూర్ణమును ఉపయోగించరాదు.



కార్తీకమాసమందు పితరులకు తర్పణము గావించిన పితరులకు అక్షయమైన తృప్తి కలుగును. తర్పణానంతరము జలమునుండి వెలుపలకు వచ్చి శుద్ధ వస్త్రమును ధరించి విష్ణుభగవానుని పూజించవలెను. తామస పదార్థములను సేవించరాదు, పరుల అన్నమును తినరాదు, ఎవ్వరికి ద్రోహముచేయరాదు, పరదేశమువెళ్ళుట కూడ ఉచితముకాదు.

కార్తీకవ్రతము చేయువారు బ్రహ్మచర్యపాలన, భూమిపై శయనించుట, ఆకులో భుజించుట చేయవలెను. నరకచతుర్దశినాడు నూనె పూసుకొని స్నానము చేయవలెను. మిగిలిన దినములందు నూనె పూసుకొనరాదు.

కార్తీకవ్రతము చేయువానియమ దూతలుచూచిన పారిపోవుదురు. సింహమునుచూచి యేనుగు దూరముగ నిలచు విధముగ భూతలముపైనున్న తీర్థము లన్నియు కార్తీక జలమందుండును. విష్ణువ్రతధారులు ఉండు స్థానమందు గ్రహభూత పిశాచాదులుండవు.

ఈ వ్రతముచేయువారి పుణ్యఫలమును బ్రహ్మ కూడ చెప్పజాలడు. వీరు సత్పుత్రులను పొంది ధనధాన్యాది సంపదలు గలిగి యుందురు. వీరికి తీర్థయాత్రలు చేసిన మహాఫలము లభించును.

## 61. అఖండ సౌభాగ్యవ్రతము

### (కార్తీక కృష్ణ చతుర్థి) (కరవాచౌథ వ్రతము)

భారతీయ హిందూ వివాహిత స్త్రీలు అఖండ సౌభాగ్యవ్రతమును చేయుదురు. తన పతి దీర్ఘాయువు గలిగియుండుటకు చంద్రునకు అర్ఘ్యము అర్పించి వ్రతము పూర్తిచేసెదరు. ఈ వ్రతమును కార్తీకకృష్ణ చతుర్థినాడు చేయుదురు. ఈ దినము సౌభాగ్యవతులైన స్త్రీలు వస్త్రాభరణభూషితులై చంద్రుని ప్రార్థించెదరు. చంద్రుని పూజించనివారు శివపార్వతులను కార్తికేయుని పూజించవలెను. వివాహితస్త్రీలు గౌరీదేవిని పూజించుట విశేషమైనది.

పాండవుల వనవాస సమయమున అర్జునుడు ఇంద్రనీల పర్వతముపైకి వెళ్ళి తపము చేయుచు ఎంతో కాలము తిరిగిరాక పోవుటచే ద్రౌపది చింతించసాగెను. కృష్ణుడువచ్చి ద్రౌపది దుఃఖనివారణకు ఈ వ్రతము చేయుమని చెప్పెను. దీనిని శివుడు పార్వతికి చెప్పెను.

**కథ :-** ఇంద్రప్రస్థ నగరమందు వేదకర్మయను బ్రాహ్మణుడుండెను. ఈ పండితునకు ఏడుగురు పుత్రులు, వీరావతి యనునొక పుత్రికయు నుండిరి. వీరావతిని సుదర్శనుడను బ్రాహ్మణునకు ఇచ్చి వివాహము చేసెను.

ఏడుగురు పుత్రులకును వివాహము జరిగెను. ఒకమారు ఈవ్రతము చేయు నప్పుడు వీరావతి వదినలందరు విధిగా వ్రతమాచరించుచుండిరి. కానీ వీరావతి దినమంతయు నిర్జల ఉపవాసముండటచే ఆకలికి తాళలేక నీరసముతో పడిపోయెను.

వదినలు ఈ విషయమును ఆమె అన్నలకు చెప్పిరి. వారు పొలమునకు వెళ్ళి మంటనుపెట్టి దానికి వస్త్రమును అడ్డముగ పట్టుకొనిరి. అది చంద్రబింబమువలె గోచరించుచుండెను. మరి చెల్లెలు దగ్గరకువచ్చి "అదిగో చంద్రుడు వచ్చెను. అర్ఘ్యము సమర్పింపుమ"నిరి. అది వినిన వీరావతి అర్ఘ్యమును సమర్పించి భోజనము చేసెను. చంద్రుడు గాని చంద్రుని చూచినందువలన ఆమెకు వ్రతభంగమయ్యెను. ఈమె పతి రోగపీడితుడయ్యెను.

ఒకమారు ఇంద్రాణి ఈ వ్రతము చేయుటకు పృథ్విపైకి వచ్చెను. ఈ విషయము తెలిసిన వీరావతి ఇంద్రాని దగ్గరకు తన పతికి ఆరోగ్యమెట్లు గలుగునో చెప్పు మని ప్రార్థించెను. ఇంద్రాణి నీ పతి ఇట్లగుటకు నీవే కారణము, నీవు సౌభాగ్యవ్రతమునకు భంగము కలిగించితివి. ఇప్పుడు నీవు తిరిగి ఆ వ్రతమునకు భంగము వాటిల్లకుండ సంపూర్ణముగ విధి విధానములతో వ్రతమాచరించిన నీ పతి ఆరోగ్యవంతుడగు నని చెప్పెను.

అనంతరము వీరావతి ఈ వ్రతమును సంపూర్ణము చేసెను. అంతట ఈమె పతి ఆరోగ్యవంతుడయ్యెను.



## 62. గోవత్స ద్వాదశీ వ్రతము

**(కార్తీకపక్షమాసమున కృష్ణ ద్వాదశిని గోవత్స ద్వాదశి యందురు)**

ఈ దినమున నదీ సరోవరములందు స్నానమాడి వ్రత సంకల్పము చేయ వలెను. ఒక్కమారే భుజించవలెను. భోజనమందు ఆవుపాలతో తయారైన పదార్థములనుగాని, నూనెలో ఉడికిన పదార్థములనుగాని తినరాదు. సాయంకాలము ఆవు మేతకువెళ్ళి తిరిగివచ్చి నంతనే ఆవును దూడను గంధ పుష్పాదులతో పూజించ వలెను. ఈవ్రత ప్రభావమున గోవునకు ఎన్ని రోమములుండునో అన్ని సంవత్సరములు వ్రతధారులు గోలోక నివాసులగుదురు.

**కథ:–** సత్యయుగమందు భృగుమహర్షి ఆశ్రమమందు ఎందరో మునులు శంకర భగవానుని దర్శించగోరి తపస్సు చేయుచుండిరి. ఆమునులకు దర్శనమొసగు టకు శంకరుడు ముసలి బ్రాహ్మణునివలె చేతి కఱ్ఱతో వణకుచు వారి ఆశ్రమమునకు వచ్చెను. వీనివెంట ఆవు దూడతో కలసి గోరూపమున పార్వతీదేవియు వచ్చెను.

శంకరుడు భృగువుతో "హే మునీ! నేనిచట స్నానముచేసి జంబూ క్షేత్రమునకు వెళ్ళిరెండు దినములుండి తిరిగి"వచ్చెదను. అంతవరకు ఈ గోవును రక్షించుడని చెప్పి శంకర భగవానుడు వెళ్ళిపోయెను.

మరికొద్ది సేపటిలో శంకరుడు వ్యాఘ్ర రూపమునవచ్చి గోవును దూడను భయకంపితులను చేయసాగెను. వ్యాఘ్రమును చూచి మునులందరు ఆర్తనాదములు చేయుచు దానిని వెళ్ళగొట్టుటకు ప్రయాసపడుచుండిరి. గోవు రంభాయని అరచుచుండెను.



మునులు బ్రహ్మ తమకొసగిన ఘంటను మ్రోగించసాగిరి. ఆ భయంకర ఘంటా నాదమునకు వ్యాఘ్రము పారిపోయెను. ఆ స్థానమున శంకర భగవానుడు ప్రకటమయ్యెను. జగజ్జననియైన పార్వతీదేవి గోరూపమును త్యజించెను. దూడరూప మునన్న కార్తికేయుడు తన గణములతో భోలేనాథునకు (శంకరునకు) వామభాగ మున విరాజితుడయ్యెను. ఋషులందరు వారిని పూజించిరి. ఆదినము కార్తీక కృష్ణపక్ష ద్వాదశి యగుటచే ఈ వ్రతమునకు గోవత్స ద్వాదశి యనునామము గలిగెను. నేటికిని తల్లులు పుత్రుల రక్షణార్థము సంతానము సుఖముగ నుండుటకు ఈ వ్రతము చేయుదురు.

## 63. ధనతేరస (కార్తీక కృష్ణ ప్రక్ష త్రయోదశి)

కార్తీక కృష్ణపక్ష త్రయోదశిని ధనతేరస యందురు. ఈదినము వెండి పాత్రలు కొనిన అతి శుభప్రదము. ఈ వ్రతము యమరాజునకు సంబంధించినది. ఈ దినము సాయంకాలము ముఖ్య ద్వారములచెంత ఒక పాత్రలో అన్నముంచి దానిపై యమధర్మరాజునకు దక్షిణాభిముఖముగ దీపమును పెట్టి పూజించవలెను.

ఒకనాడు యమధర్మరాజు తన "దూతలతో మీరు నా ఆజ్ఞతో ప్రాణులప్రాణ ములు హరించి తెచ్చునప్పుడు మీ కెప్పుడైన దయతో దుఃఖముగలిగెనా? అని అడుగగా, యమదూతలు" మహారాజా! మేము క్రూరకర్మలు చేయువారము. అకాల మరణము పొందిన వారిని తెచ్చునపుడు ఆ విషాద కరుణాక్రందనలు వినుచుండ మా పాషాణ హృదయములు కూడ చలించు చుండును.

ఒకమారు మేము ఒక రాజకుమారుని ప్రాణమును, అతనికి వివాహమైన నాలుగవ దినమున తెచ్చునప్పుడు అచట హాహాకారములు చూచి వినిన మేము మేము చేయుచున్నపనిని మేమే ఛీయను కొంటిమి. ఎంతో దుఃఖించితిమి. అందు వలన స్వామీ! ఇట్టి అకాల మృత్యువులు గలుగకుండ జూడుగ"దనిరి.

యమధర్మరాజు, "కార్తీక కృష్ణ త్రయోదశీ వ్రతమును చేసి దీపదానము చేసిన అకాలమృత్యువులు గలుగవని" చెప్పెను.

## 64. ధన్వన్తరి భగవానుని జన్మోత్సవము

ధన్వన్తరి భగవానుని జన్మోత్సవమును కార్తీక కృష్ణ పక్ష త్రయోదశి యందు జరుపుదురు. సముద్రమథన సమయమందు ధన్వన్తరి భగవానుడు ప్రకటమయ్యెను. దేవ దానవులు క్షీరసాగరమును మన్థనము చేయునప్పుడు ధన్వన్తరిభగవానుడు సమస్త రోగములకు ఔషధములను కలశమందు నింపుకొని ప్రకటమయ్యెను. ఆదినము త్రయోదశి యగుటచే దేశమంతట ధన్వర్తరి భగవానుని జయంతి మహోత్సవమును జరుపుకొందురు. ఆయుర్వేత వైద్యులు ధన్వన్తరి భగవానుని ప్రతిమను ప్రతిష్ఠించి శ్రద్ధాభక్తులతో పూజించెదరు. ప్రసాద వితరణ గావించెదరు.

మరుసటి దినమున సంధ్యాసమయమున జలాశయమందుప్రతిమను విసర్జించెదరు. ఈ విధముగ చేసిన రోగముక్తులగుదురు.

## 65. గోత్రిరాత్ర వ్రతము

### (కార్తీక కృష్ణ త్రయోదశి మొదలు అమావాస్య వరకు)

ఈ వ్రతమును కార్తీక కృష్ణత్రయోదశి నుండి దీపావళి వరకు చేయుదురు. ఈ వ్రతము గోశాల యందుగాని లేక గోవులు వచ్చిపోవు మార్గమందు ఎనిమిది మూరల పొడవు నాలుగుమూర వెడల్పుగల వేదికను నిర్మించి దానిపై సర్వతో భద్రమును దానిపై ఛత్రాకారమున వృక్షమును, మరియు వివిధ ఫలపుష్పాదుల నుంచవలెను. వృక్షము క్రింద మండల మధ్యభాగమున గోవర్ధన భగవానుని, వానికి వామభాగమున రుక్మిణి మిత్రవృంద శైవ్యా జాంబవతిని, దక్షిణభాగమున సత్యభామ లక్ష్మణ సుదేవ నాగ్నజితి, వీరికి అగ్రభాగమున నందబాబ పృష్ఠభాగమున బలభద్రుడు యశోద, శ్రీకృష్ణునకు ఎదురుగ సురభి సునంద సుభద్ర మరియు కామధేను గోవుల సువర్ణమయ మూర్తులను స్థాపించవలెను. వీరందరి నామములతో పూజించవలెను.

అనంతరము గోవును అర్ఘ్య గ్రాసములు సమర్పించవలెను. వివిధ ఫలపుష్పాదులు పర్వాన్న రసాదులనుంచి పూజించవలెను. వెదురుబుట్టలో సప్తధాన్యములు సప్తమిఠాయిలనుంచి సౌభాగ్యవతులైన స్త్రీలకు ఈయవలెను. ఈవిధముగ మూడు దినములు వ్రతముచేసి నాలుగవ దినమున ప్రాతఃస్నానంతరము గాయత్రీ మంత్రముతో 108 పిడికెల నువ్వులను ఆహుతి గావించి వ్రతమును విసర్జించవలెను. దీనివలన పుత్రపౌత్ర సుఖసంపదలు గలుగును. అంతమున గోలోక ప్రాప్తిలభించును.

## 66. చతుర్దశి (కార్తీక కృష్ణ చతుర్దశి)

కార్తీక కృష్ణ పక్షచతుర్దశిని నరక చతుర్దశియందురు. ఈదినము అరుణోదయ మునకుముందే స్నానముచేసిన యమలోకమును దర్శించరు. కార్తీకమాసమందు నూనె పూసుకొనరాదు. నరకచతుర్దశినాడు మాత్రము నూనెపూసుకొని స్నానము చేయవలెను. స్నానాంతరము శుద్ధవస్త్రము ధరించి తిలకము పెట్టుకొని దక్షిణాముఖులై ప్రతి నామమునకు మూడు మూడు తిలాంజలిలు (నువ్వులతోదోసిలి) సమర్పించ వలెను.

ఓం యమాయ నమః, ఓం ధర్మరాజాయ నమః, ఓం మృత్యువే నమః, ఓం అన్తకాయ నమః, ఓం వైవస్వతాయ నమః, ఓం కాలాయ నమః, ఓం సర్వభూత క్షయాయ నమః, ఓం ఔదుంబరాయ నమః, ఓం దన్ధాయ నమః, ఓం నీలాయ నమః ఓం పరమేష్ఠినే నమః, ఓం వృకోదరాయ నమః, ఓం చిత్రాయ నమః, ఓం చిత్రగుప్తాయ నమః ।



అని పూజించి దీపదానము (దీపారాధన) చేయవలెను. మందిరములందును గృహములందును, వంటిగదిలోను, స్నానాలగదిలోను, దేవ వృక్షములక్రింద, సభాభవనమందు, నదీతీరములందు, ప్రహరీ గోడలందు తోటలోను, గోశాలాది ప్రత్యేకస్థానములందు దీపములను వెలిగించవలెను. యమరాజు నుద్దేశించిన త్రయోదశి నుండి అమావాస్య వరకు దీపములు వెలిగించవలెను.

**కథ:-** వామనావతారమందు శ్రీహరిభగవానుడు సమస్త భూమిని తన పాదముతో కొలిచెను. బలి చేసిన దానమునకు భక్తికి మెచ్చిన వామన భగవానుడు బలిని "వరమడుగు"మనెను.

బలి కార్తీక కృష్ణ త్రయోదశి మొదలు మూడు దినములు నారాజ్యమందు ఎవరు యమరాజు నుద్దేశించి దీపము వెలిగించెదరో వారు యమయాతనలు పడ కుండగ నుండవలెను. ఈ మూడు దినములు దీపావళిని జరుపు వారి గృహముల నుండి ఎన్నటికి లక్ష్మీదేవి తొలగిపోరాదు. వారిఇంట స్థిరముగ నుండవలెనని భగ వానుని ప్రార్థించెను.

భగవానుడు "ఏవమస్తు" ఎవరు ఈమూడు దినములు దీపోత్సవమును జరుపు దురో, వారిని విడచి నా లక్ష్మి ఎచ్చటికి వెళ్ళదని వరమొసగెను.



## 67. హనుమజ్జన్మ - మహోత్సవము (కార్తీక కృష్ణ చతుర్దశి)

కార్తీక కృష్ణ చతుర్దశి సోమవారము అర్థరాత్రి సమయమందు అంజనాదేవి గర్భము నుండి హనుమానుడు జన్మించెను. అందువలన హనుమానుని ఉపాసకులు ఈదినమున హనుమానుని షోడశోపచారములతో పూజించెదరు. సుగంధపూర్ణ తైలములో సింధూరము కలిపి భగవానునకు పూసెదరు. పంచదార నెయ్యితో తయారైన ప్రసాదమును నైవేద్యముగ పెట్టవలెను. అరటి, జామ తదితర ఫలములు సమర్పించవలెను. వాల్మీకి రామాయణ మందు సుందరకాండను పఠించవలెను. దీపావళి రాత్రి నేతితో దీపములు వెలిగించవలెను. చాలామంది ఈ దినమున హను మానుని జయంతి జరుపుకొందురు.

కొన్ని శాస్త్రములందు చైత్ర శుక్ల పూర్ణిమ హనుమజయంతి యని వ్రాసియుం డెను. కార్తీక కృష్ణ చతుర్దశి నాడు హనుమజయంతి జరుపుకొనుటకొక కారణ ముండెను. లంకా విజయానంతరము శ్రీరాముడు అయోధ్యకువచ్చెను. జానకీ రాములు వానరులకు వీడ్కోలు పలుకు సమయమున పారితోషికములు ఇచ్చు చుండిరి. అది ఇదే రోజున జరిగెను. సీత తన మెడలోని హారమును హనుమానునకు ఇచ్చెను. ఇది ముత్యములతో కూడియున్న రత్నహారము. కానీ దానియందు రామనామము లేదని హనుమానుడు సంతుష్ట పడలేదు.

అప్పుడుసీత తన లలాటమందున్న సౌభాగ్యద్రవ్యమైన సింధూరమును ఇచ్చుచు ఇట్లనెను. "దీనిని మించినది, దీనికంటె అధికమైన మహత్తు గల వస్తువేది నాగ్గరలేదు.

అందువల్లన నీవు దీనిని సంతోషముగ స్వీకరించి ధరిం చుము. నీవెల్లప్పుడు అజర-అమరడువైయుందువు". అనినంతనే హనుమానుడు దానిని గ్రహించెను.

ఈకారణమున కార్తీక కృష్ణ చతుర్దశిని హనుమజ్జయంతిగ ఉత్సవమును జరుపుదురు. సింధూరమందు తైలమును కలిపి హనుమానునకు పూసెదరు.

## 68. ఐశ్వర్యమునకు అధిష్ఠాత్రి భగవతి లక్ష్మీ సమారాధనపర్వము - దీపావళి మహోత్సవము

**(కార్తీక అమావాస్య)**

దీపావళిరాక పూర్వమే తమ గృహములను అలంకరించెదరు. గోడలకు సున్నమువేయించి, ద్వారములకు రంగులు వేయించెదరు. దీనివలన గృహములకు ఆయువు పెరుగును. ఆకర్షణీయముగను నుండును. వర్షఋతువు నందు స్వచ్ఛము గను నుండును. (పాడుగాకుండును)

దీపావళి దినమున ధనసంపదలకు అధిష్ఠాత్రిదేవియైన మహాలక్ష్మిని పూజించెదరు. ఎవరు దీపావళి దినమున రాత్రి పగలు జాగరణచేసి లక్ష్మిని పూజించె దరో వారి గృహమందు లక్ష్మినివాసముండును. ఈరోజు సోమరులై నిదురలేవక దీపావళిని పాటించకున్న, వారి గృహమునుండి లక్ష్మివెళ్ళిపోవును.

కార్తీక అమావాస్యనాడు అర్ధరాత్రి సమయమున లక్ష్మీమాత సద్గృహస్థుల గృహములందు తిరుగు చుండును. అందువలన తమ గృహములను దీపమాలికలతో అలంకరించుకొనిన లక్ష్మీదేవి ప్రసన్నురాలగును. అట్టివారి గృహములందు స్థిరముగ నుండును.

తమ తమ సాంప్రదాయానుసారముగ గణేశుని లక్ష్మిని పూజించవలెను. ద్రవ్యలక్ష్మిని కూడ పూజించవలెను. ఒక పళ్ళెములో 13గాని 26గాని దీపములు వెలిగించి వాని మధ్యలో నాలుగు ముఖములుగల దీపమునుంచి పూజించి గృహ ములో ముఖ్యస్థానములందు దీపములు ఉంచవలెను. నాలుగు ముఖములుగల దీపము రాత్రంతయు వెలుగునట్లు చూడవలెను.

రుక్మిణి లక్ష్మీదేవిని "మీరు యేయేస్థానములందు ఉందురో చెప్పు"మని అడిగెను.

లక్ష్మి రుక్మిణితో నేను సౌభాగ్యవతులు సచ్చరిత్రులు కర్తవ్య పరాయణులు క్రోధములేనివారు భక్తులు కృతజ్ఞతకలవారలు జితేంద్రియులు సత్యసంపన్నులు సదాచార ధర్మ కర్తవ్యపరులు, గురుజనులను సేవించువారు మనస్సును వశమం దుంచువారు, క్షమాశీలురు, శీలవతులు సౌభాగ్యవతులు గుణవతులు పతిపరాయ ణులు అందరి మేలుకోరువారు సద్గుణ సంపన్నులైన వారి గృహములందు ఎల్లప్పుడు నివాసముండును.



నాస్తికులు వర్ణసంకరులు కృతఘ్నులు దురాచారులు, క్రూరులు, గురుజనులను దూషించువారు, లోపలనొకవిధముగను, పైకినొకవిధముగను నుండు వారిగృహ మందు నేను నివాసముండను. పతికి ప్రతికూలముగ మాట్లాడువారు, పరుల గృహ మందు అనురాగముండువారు, లజ్జలేనివారు పాపకర్మలు చేయువారు అపవిత్రముగ నుండువారు, కలహప్రియులు సదా నిదురపోవువారు ఇట్టి స్త్రీలుండు గృహములను విడచి నేను వెళ్ళిపోవుదును. అని అనెను.

ఒకమారు మునులు సనత్కుమారుని "భగవాన్! దీపావళి లక్ష్మీపూజకు పర్వ దినము. మరి ఇతర దేవీదేవతలు పూజలుకూడ ఎందుకు ప్రతపాదించిరి"? అని అడిగిరి.

సనత్కుమారుడు-"బలిచక్రవర్తి తన ప్రతాపముతో సమస్త దేవతలను బందీలుగ" చేసెను. ఇతనికికారాగారమందు లక్ష్మితో సహా దేవీ దేవతలందరు బందీలైరి.

కార్తీక కృష్ణ పక్ష అమావాస్య నాడు వామనరూపముతో విష్ణుభగవానుడు బలిని అణచెను. అప్పుడు కారాగారమునుండి సమస్తదేవతలు విముక్తులైరి. అందు వలన లక్ష్మితో పాటుగ అందరిని పూజించెదరు. దీపోత్సోవమునే సమారాధన పర్వమందురు.



యాకున్దేన్దు తుషార హార ధవలాయా శుభ్రవస్త్రావృతా
యా వీణావరదండ మండిత కరా యా శ్వేత పద్మాసనా ।
యా బ్రహ్మాచ్యుత శంకర ప్రభృతిభిర్దేవైః సదావన్దితా
సామాం పాతు సరస్వతీ భగవతీ నిఃశేష జాడ్యాపహా ॥

**లక్ష్మీదేవికి హారతి :**

ఓం జయ లక్ష్మీమాతా జయలక్ష్మీమాతా ।
తుమకో నిసిదినసేవత హరవిష్ణు ధాతా ॥ ఓం॥
ఉమా రమా బ్రహ్మాణి తుమ హీ జగమాతా
సూర్య చంద్రమాధ్యావత నారద ఋషి గాతా ॥ఓం॥
దుర్గారూప నిరంజన సుఖ సంపతి దాతా ।
జో కోయితుమకో ధ్యావత ఋధి సిధి దనపాతా ॥ఓం॥
తుమ పాతాల నివాసిని తుమ హీ శుభదాతా ।
కర్మప్రభావ ప్రకాశిని భవనిధికీ త్రాతా ॥ఓం॥
జిస ఘర తుమ రహతీ తహం సబసద్గుణ ఆతా ।
సబ సంభవ హో జాతా మన నహి ఘబరాతా ॥ఓం॥
తుమ బిన యజ్ఞన హోతే వస్త్ర నహో పాతా ।
ఖాన పానకా వైభవ సబ తుమ సే ఆతా ॥ఓం॥

శుభ గుణ మందిర సుందర క్షీరో దధి జాతా ।
రత్న చతుర్దశ తుమ బిన కోఈ నహి పాతా ॥ఓం॥
మహాలక్ష్మీ కీ హారతి జో కోఈ నరగాతా ।
ఉర ఆనంద సమాతా పాప ఉతర జాతా ॥ఓం॥

## 69. అన్నకూట మహోత్సవము

కార్తీకమాస శుక్లపక్ష ప్రతిపదా తిథినాడు అన్నకూట మహోత్సవమును జరుపుదురు. ఆరోజున గోవర్దనుని పూజించి అన్నకూట ఉత్సవమును జరుపుదురు. దీనివలన విష్ణుభగవానుడు ప్రసన్నుడగును.

ఆవు పేడతో గోవర్థనుని నిర్మించి దాని శిఖరముపై వృక్షశాఖాదులనుపెట్టి పుష్పములతో అలంకరించవలెను. అనంతరము గంధపుష్పాదులతో పూజించవలెను.

పేలాలను గిరిరాజు పై వర్షముగ కురిపించవలెను. గిరిరాజు ఎదుట అన్నము రాశిగ పోయవలెను. 64 గిన్నెలను 5పంక్తులందుంచి వానిని తులసీదళ మిశ్రిత గంగాజలముతో నింపవలెను. ఏకాగ్రచిత్తులై గిరిరాజునకు 56రకముల భోగములను అర్పించవలెను. అనంతరము అగ్నియందు హోమము చేసి బ్రాహ్మణులను పూజించి గోవులపై దేవతలపై గంధపుష్పాదులు చల్లువలెను. అంతమున శ్రేష్ఠుడైన బ్రాహ్మణునకు సుగంధిత మృష్టాన్న భోజనము పెట్టవలెను. అనంతరము ప్రసాద వితరణ చేయవలెను.

వ్రజమందు అందరు ఇంద్రుని పూజించెదరు.

కృష్ణుడు వారితో "గోవులు గోవర్ధనము ప్రత్యక్ష దేవతలు. అందువలన వానిని పూజించవలెను. ఇంద్రుని పూజించుట ఎందులకు? అతడెప్పుడైన మీకు కనిపించెనా? ఎప్పుడైనను మీరు సమర్పించు ప్రసాదములను గ్రహించినాడా? లేదు గదా? మరి ఇంద్రుని పూజించుటెందులకు" అని శ్రీకృష్ణుడు చెప్పగ వారు(వ్రజవాసులు) గోవర్ధనుని పూజించిరి.

శ్రీకృష్ణ భగవానుడు గోవర్ధనరూపము ధరించి "నేను గిరిరాజు గోవర్ధనుడను" అనుచు అచటనున్న అన్నరాశిని సమస్త పదార్థములను భుజించెను.

ఇంద్రునకీ విషయము తెలిసి ఉగ్రుడై ప్రళయకాలమందొచ్చు మూసల (రోకలి) ధారలతోచి వర్షము కురిపించసాగెను. ఇది చూచిన శ్రీకృష్ణుడు గోవర్ధన పర్వతమును తన చిటికెనవ్రేలిపై ధరించెను. దానిక్రింద వ్రజవాసులు గోవులు దూడలు సమస్తము చేరుకొనెను. వర్షము ఈ విధముగ ఏడురోజులు కురిసెను. ఐనను దాని ప్రభావము వ్రజవాసులపైబడలేదు.

అప్పుడు ఇంద్రుడు శ్రీకృష్ణుడు పరబ్రహ్మ పరమాత్ముడని గ్రహించి సిగ్గుతో శ్రీకృష్ణుని వద్దకువచ్చి క్షమాపణ కోరెను. ఈ సమయమున ఐరావతము ఆకాశగంగా



జలముతోను, కామధేనువు తన క్షీరముతోను శ్రీకృష్ణభగవానుని అభిషేకించెను. ఇందువలన గోవిందుడయ్యెను. గోవర్థనుని పూజించిన శ్రీకృష్ణుని పూజించినట్లే యగును.

## 70. గోవర్థన పూజా రహస్యము

శ్రీకృష్ణుడు ఇంద్రుని గర్వమణచుటకు గోవర్థన పూజను వ్రజవాసులతో చేయించెను. గోవర్ధనగిరిని ఎత్తినప్పుడు పర్వతము క్రిందికి నీటి ప్రవాహము వచ్చుటగాంచిన కృష్ణుడు సుదర్శనచక్రమును శేషుని స్మరించి ఆ ప్రవాహ నివారణకు ఆజ్ఞ ఇచ్చెను. సుదర్శనచక్రము పర్వతమునకు పైనుండి అగస్త్యముని సముద్రమును త్రాగినట్లుగ క్రిందికి పడుచున్న జలధారలను త్రాగుచుండెను. పర్వతమునకు క్రింద చుట్టును శేషుడుగోళాకారముగ వ్యాపించియుండి,అటు వచ్చుయున్న ప్రవాహమును సముద్రమును చెలియలికట్ట దాటిరాకుండ ఆపునట్లు ఆపుచుండెను. గోవర్థన ధారి శ్రీహరి ఏకసప్తాహము సుస్థిర భావముతో నిలబడి యుండెను. సమస్త గోపకులు చకోరములవలె శ్రీకృష్ణుని వైపు చూచుచు కూర్చుండిరి.

అనంతరము ఇంద్రుడు రోషముతో ఐరావతముపై వ్రజమునకువచ్చి నంద వ్రజమును నశింపజేయునుద్దేశముతో వజ్రాయుధమును తీసెను. కాని మాధవుడు ఇంద్రుని భుజములను స్తంభింపజేసెను. ఇంద్రుడు భయకంపితుడై సాంవర్తక గణ మేఘములతోను దేవతలతోను కలసి పారిపోయెను.

ఒకానొక సమయమున పులస్త్యముని తీర్థయాత్రచేయుచు అచటికి వచ్చెను. గోవర్థన గిరిని చూచి ముగ్ధుడై ద్రోణుని చెంతకేగి, "నేను కాశీ నివాసినిని.నేను నిన్నొకటి యాచించుటకు వచ్చితిని. మీరు మీ పుత్రుడు గోవర్థనుని నాకు ఇందు, నేను కాశీలో స్థాపించి అచట తపము చేసుకొందు"ననెను.

పుత్రప్రేమతో ద్రోణుడు అంగీకరించకుండెను. అప్పుడు గోవర్థనుడు మునితో, "నేను రెండు యోజనముల ఎత్తు మరి ఐదు యోజనములు వెడల్పు గలిగియుంటిని. మీరు నన్నెట్లు తీసుకొని వెళ్ళుదురు"? అనెను. "ఆ ముని నేను నిన్ను నాచేతి పై ఎత్తుకొని తీసుకొని వెళ్ళుదు"నెను.

గోవర్థనుడు :- మహామునీ! ఒకషరతు. మీరు మార్గమధ్యమున ఎక్కడను నన్నుదించరాదు. దించిన మరినేను పైకి లేవలేవనెను.

ముని షరతును అంగీకరించెను. అనంతరము గోవర్థనుని ఎత్తుకొని కాశీకి వెళ్ళుచుండెను. మార్గమందు వ్రజభూమివచ్చి నంతనే గోవర్థనునకు పూర్వస్మృతి గలిగెను. శ్రీకృష్ణుడు రాధతో కలసి ఇచట అవతరించెను. అనేక మధురమైన బాల లీలలు ఇచట చేయును. నేను ఇచట తప్ప వేరొకచోట యుండలేను అని అనుకొని తన భారమును పెంచెను. ముని అలసిపోయెను. లఘుశంకయు గలుగుచుండెను. ముని గోవర్థనుని క్రిందకు దించి మరల ఎత్తుకొందునని అడిగెను. గోవర్థనుడు

అంగీకరించలేదు. ముని క్రోధాగ్నుడై "నువ్వు ప్రతిదినము నువ్వుల గింజయంత క్షీణించుచుందు"వని శపించెను.

ఒక బ్రాహ్మణుడు తన ఋణము వసూలు చేసుకొనుటకు మధురకు వచ్చెను. తిరిగి వెళ్ళు సమయమున గోవర్ధనగిరి నుండి ఒక రాయిని తీసుకొనెను. మార్గమున ఒక రాక్షసుడు వీనిపై తలపడగ, ఆ రాయి వానిపై వేసెను. ఆ రాయి తగిలినంతనే రాక్షసునకు దివ్యరూపము గలిగి గోలోకమునకు వెళ్ళెను. పుణ్యతీర్థ తపో ఫలముల కంటె కోటిరెట్లు అధికముగ గోవర్ధనుని దర్శించి నంతనే గలుగును. గోవర్ధనగిరి నుండి రాయిని తీసుకొని వెళ్ళి దానిని పూజించువారు ఎంతరాయిని తీసుకొనె దరో, అంతసువర్ణమును ఆ గిరిపై వదలి తెచ్చుకొని పూజించుకొనవచ్చును.

## 71. యమ ద్వితీయ పర్వము (విదియ) (భైయాదూజ)

కార్తీక శుక్ల పక్ష ద్వితీయ తిథిని యమ ద్వితీయమందురు. భైయాదూజ మనియు అందురు. ఈ దినమున యమునా స్నానము, యముని పూజించుటయు, సోదరి ఇంటికి వెళ్ళి సోదరుడు భోజనము చేయుటయు చేయుదురు. ఆ దినమున సోదరి స్నానానంతరము అక్షతాదులతో అష్టదళ కమలము నిర్మించి దానిపై గణేశాదులను స్థాపించి యముని యమునను చిత్రగుప్తుని యమదూతలను పూజించవలెను.

తరువాత సోదరుని ఆసనముపై కూర్చుండబెట్టి గంధాదులనుపూసి భోజనము పెట్టి వస్త్రాదులను పెట్టవలెను. శక్తిగలవారు ఆభరణములను కూడ పెట్టెదరు. ఈవిధముగ చేసిన సోదరునకు ఆయువృద్ధి, సోదరికి సౌభాగ్య ప్రాప్తి గలుగును. భారతీయ సంస్కృతిలో సోదరుని దయామూర్తిగా తలచెదరు. అందువలన ఆమె దగ్గర శుభాశీస్సులను తీసుకుని ఆమె చేతిలో పెట్టిన అన్నమును భుజించెదరు. ఈ విధముగ చేసిన ఆయుర్వృద్ధి, ఆరోగ్యము గలుగును. శుద్ధ ప్రేమకు ప్రతీకమైన ఈ ఉత్సవమును ప్రేమతో జరుపుకొందురు.

**కథ :-** యముడు యమున సూర్యుని సంతానము. ఈ ఇరువురకు ఒకరిపై నొకరికి అమితమైన ప్రేమగలదు. యమధర్మరాజు యమలోక శాసనవ్యవస్త యందుండి, ఒకమారు యమున గృహమునకు వెళ్ళలేదు. యమునయే యమ ధర్మరాజు చెంతకు వెళ్ళెను. అప్పుడు యముడు "సోదరీ! నీవు వచ్చి నందుకు నాకు చాలసంతోషముగా నున్నది. నీవు యేదేని వరము కోరుకొను"మనెను. యమున, "సోదరా! నేటిదినమున నాయందు (యమునలో) స్నానమాడువారు యమలోకమునకు వెళ్ళకుండుగ నుండునట్లు వరమిమ్మనెను. యమధర్మరాజు తథాస్తు పలికి,సోదరీ! అట్లే యగు గాక యనెను".

అందువలన ఈ తిథి నాడు యమునాస్నానము విశేష మైనది. యమున తన సోదరుడు యమునకు భోజనము పెట్టిన ఈ దినమున యమలోకమందు



గొప్ప ఉత్సవము చేయుదురు. అందువలన ఈ తిథికి, యమ ద్వితీయ నామము గలిగెను. అందువలన ఈ దినమున సోదరులు తమ సోదరి ఇంటికి వెళ్ళి ఆమె చేతితో పెట్టు అన్నమును తినవలెను. అనంతరము సోదరిని సువర్ణ వస్త్రాది ద్రవ్యము లతో సంతుష్ట పరచవలెను. సొంత అక్కగాని చెల్లెలుగాని లేనివారు తండ్రిసోదరుని పుత్రిక ఇంటికిగాని, మేనమామ పుత్రిక ఇంటికిగాని, పినతల్లి కూతురు ఇంటికిగాని వెళ్ళి భుజించవలెను. యమ ద్వితీయ నాడు సోదరి చేతితో అన్నము తినువారికి ధనము యశస్సు ఆయుషు,ధర్మార్థకామ మోక్షములు లభించును.

## 72. సూర్యషష్ఠీ మహోత్సవము (కార్తీక శుక్ల షష్ఠీ)

సూర్యసప్తమి, రథసప్తమి అచలాసప్తమీలవలె సూర్యషష్ఠీ మహోత్సవము కూడ జరుపుదురు.

షష్ఠీ దేవీపూజ ఎప్పటినుండి ప్రచార మైనదో, ఇది తెలుపు నొక కథ గలదు. ప్రథమ మనువైన స్వాయంభువ పుత్రుడు ప్రియవ్రతునకు సంతానము లేకుండెను. మహారాజు ఒకనాడు కశ్యపమహర్షికి తన దుఃఖమును తెలిపి "పుత్రప్రాప్తికి యేదైన ఉపాయము చెప్పు"మనెను. మహర్షి రాజును "పుత్రేష్టియజ్ఞమును చేయుమని" చెప్పెను. యజ్ఞానంతరము మహారాణి మాలినికి ఒకపుత్రుడు జన్మించెను. కాని పుత్రుడు మృతుడై యుండెను. మహారాణి మృతశిశువును ప్రసవించెనను వార్త అంతటా వ్యాపించెను. నగరమంతయు శోకముతోనిండి పోయెను. మహారాజు మృతశిశువును తనహృదయమునకు చేర్చుకొని దుఃఖించసాగెను. పరిజనులు చూచుచు నిలబడి పోయిరి. రాజుదగ్గర నుండి ఆ శిశువును ఎవ్వరు వేరు చేయలేకుండిరి.

ఆ సమయమున అందరు చూచుచుండగా ఆకాశమునుండి జ్యోతిర్మయ విమానము భూమిపైకి వచ్చుచుండెను.రాసు స్తుతించు చుండగా ఆ విమానమునుండి ఒకదేవి దిగివచ్చి రాజా! నేను బ్రహ్మదేవుని మానసపుత్రకనైన షష్ఠీ దేవిని. నేను విశ్వమందున్న సమస్త బాలకులను రక్షించుదానను. పుత్రులు లేనివారికి పుత్రులను ప్రసాదించుదానను "పుత్రదాఽహమ్ అపుత్రాయ" అనుచు ఆ దేవి మృతశిశువు శరీరమును తాకెను. అంతటా శిశువు జీవితుడై కదిలెను. మహారాజు ఆనందమున కంతులేకుండెను. అనే విధముల షష్ఠీదేవిని స్తుతించెను.

దేవి ప్రసన్నురాలై, "రాజా! పృథ్విపై అందరు నన్ను పూజించునట్లుగ చేయు"మని పలికి అంతర్ధానమయ్యెను. రాజు దేవి ఆజ్ఞానుసారము తన రాజ్యమందు ప్రతిమాసము శుక్లపక్ష షష్ఠీతిథినాడు షష్ఠీ దేవి మహోత్సవము జరుగునట్లు ఆదేశిం చెను. అప్పటినుండి లోకములో బాలకులకు జన్మ నామకరణ అన్నప్రాశన మొదలగు శుభకార్యములను షష్ఠీతిథినాడు జరుపుచుండిరి. నైవేద్యముగ పరమాన్నమును సమర్పించవలెను. నేటికిని శిశువులు జన్మించిన ఆరవ దినమున షష్ఠీతిథినాడు ఈమెను కాత్యాయనిగా పూజించెదరు.

శుక్లపక్ష షష్ఠీతిథినాడు సూర్య షష్ఠీ వ్రతము కూడ చేయుదురు. నైమిశారణ్యమున శౌనకాది మునులు అడుగగా శ్రీసూతులవారు లోకకల్యాణార్థము సూర్యషష్ఠీ వ్రతమాహాత్మ్యమును విధి విధానమును, కథను ఉపదేశించెను.

ఒక రాజు కుష్ఠురోగగ్రస్తుడై, రాజ్యవిహీనుడై బ్రాహ్మణులు చెప్పగా ఈ వ్రతమును చేసెను. అంతట రోగముక్తుడై పునఃరాజ్యమేలుచుండెను.

సూర్యభగవానుడు ప్రత్యక్ష దైవము. సమస్తకోరికలు తీర్చువాడు. సమస్త వైభవముల నొసగువాడు సూర్యభగవానుడే. కానీ సంతానమునొసగునది షష్ఠీదేవియే. అందువలన సూర్యుని షష్ఠీ దేవిని ఇరువురిని పూజించవలెను.

## 73. గోపాష్టమీ మహోత్సవము (కార్తీక శుక్ల అష్టమి)

గోవును గురించి చెప్పనక్కరలేదు. గోవులను కాచినందులకే శ్రీకృష్ణభగవానునకు "గోవిందు"డను నామము గలిగెను. కార్తీకశుక్ల ప్రతిపదా పాడ్యమి తిథినుండి సప్తమివరకు గోవులను గోపాలురను గోపికలను రక్షించుటకు శ్రీకృష్ణుడు గోవర్ధన గిరిని ధరించెను. ఎనిమిదవరోజున ఇంద్రుడు కనులు తెరచి అహంకార రహితుడై వచ్చి శ్రీ కృష్ణభగవానుని శరణువేడెను. కామధేనువు భగవానుని అభిషేకించెను. అదే దినమున భగవానునకు 'గోవింద'నామము గలిగెను.

ఆనాటినుండి కార్తీకశుక్ల అష్టమినాడు గోపాష్టమీ ఉత్సవమును చేయుచున్నారు. ఈరోజున గోవులకు స్నానము చేయించి గంధపుష్పాదులతో వానిని పూజించవలెను. గోపాలురనుకూడ వస్త్రాలంకార భూషితులనుగావించి వారిని కూడ పూజించవలెను. గోవులకు మేత వానికి ప్రదక్షిణ చేయవలెను. కొంతదూరము వానివెంట వెళ్ళవలెను. ఈ విధముగ చేసిన అభీష్టసిద్ధిగలుగును. గోపాష్టమి సాయంకాలమున గోవులు మేతకు వెళ్ళి తిరిగి వచ్చినపుడు వానిని మరల షోడశోపచారములతో పూజించి భోజనము పెట్టి గోధూళిని శిరస్సున ధరించవలెను. దీనివలన సౌభాగ్యము వృద్ధియగును. అన్ని ప్రాంతములందు వారును ఈ వ్రతమును చేయుదురు. ముఖ్యముగ గోశాలలో గొప్ప ఉత్సవమును చేయుదురు.

ఆరోజు చేయుపనులు–

గోవులకు స్నాముచేయించి అలంకరించవలెను. గోశాలను చక్కగ బాగుచేయవలెను. గోవులను గోపాలురను పూజించవలెను. మంచి భోజనముపెట్టి సంతుష్టులను గావించవలెను. ఆ దినము వ్యవసాయ పనులు వ్యాపారములను మానుకొని గోశాలకువెళ్ళి ఉత్సవ కార్యక్రమములందు పాల్గొనవలెను. శక్తికి తగినట్లుగ గోశాలలకు దానము చేయవలెను. నగరములందు గ్రామములందు సభలు యేర్పాటుచేసి గోవులను గురించి మాట్లాడవలెను. మాట్లాడవలసిన విషయములు.



దేశమందు గోహత్యను నివారించుటెట్లు? పాలోత్పత్తిని పెంచుటెట్లు? గోమయమును, గోమూత్రమును ఉపయోగించు టెట్లు? గోపాలురతో ఆవశ్యకత ఎట్టిది? వారి అభిప్రాయములను గ్రహించి ఈ విధముగ ప్రతిజ్ఞ చేయించవలెను. గోవులను పోషించనివారికి, కసాయివారికి గోవు లను అమ్మరాదు, ఆవు చర్మముతో గాని ఎముకలతోగాని వ్యాపారము చేయరాదు. కల్తీ కలిపిన ఆవునెయ్యిని అమ్మరాదని, దేశమంతట ఎన్ని గోవులున్నవి, ఎన్ని దూడ లున్నవి, ఎన్ని ఎద్దులున్నవో లెక్కను చూడవలెను. మంచి గోవులకు పురస్కారము లీయవలెను. గోవులు ఆరోగ్యముగ నుండునట్లు చూడవలెను. గోవంశ ఉన్నతిని చేపట్టవలెను. ఈ ఉత్సవముకు ముసల్మానులను తదితరులందరిని పిలువవలెను. ఆ రోజంతయును గోవుల విషయమునే చర్చించుకొనవలెను.

## 74. అక్షయ నవమి (కార్తీక శుక్లనవమి)

కార్తీకమాస శుక్లపక్ష నవమిని అక్షయ నవమి యందురు. ఈ దినము చేయు స్నానపూజ తర్పణ అన్నాది దానములు అక్షయ ఫలమునొసగును.



**వ్రతవిధానము :–** ప్రాతఃకాలస్నానానంతరము కుడిచేతితో జలమును అక్షతలను పుష్పములను తీసుకొని వ్రతసంకల్పము చేయవలెను.

**అద్యేత్యాది అముకగోత్రో ముక శర్మాహం మమాఖిల పాపక్షయ పూర్వక ధర్మార్థకామమోక్ష సిద్ధిద్వారా శ్రీ విష్ణు ప్రీత్యర్థం ధాత్రీమూలే విష్ణుపూజనం ధాత్రీ పూజనం చకరిష్యే ।** అని సంకల్పముచేసి ధాత్రీ వృక్షము (ఉసిరిచెట్టు) క్రింద పూర్వాభి (తూర్పు) ముఖముతో కూర్చుండి ఓంధ్యాత్ర్యై నమః అను మంత్రముతో ఆవాహనాది షోడశోపచార పూజలుచేసి నిన్ను లిఖితమంత్రముతో ఉసిరి వృక్షము మొదలులో పాలనుపోసి పితరులకు తర్పణము గావించవలెను.

**పితాపితామహాశ్చాన్యే అపుత్రా యే చ గోత్రిణః।**
**తే పిబన్తు మయాదత్తం ధాత్రీ మూలేఽ క్షయం పయః॥**
**ఆబ్రహ్మస్తంబ పర్యన్తం దేవర్షి పితృమానవాః।**
**తే పిబన్తు మయాదత్తం ధాత్రీ మూలేఽ క్షయం పయః॥**

అనంతరము ఉసిరి వృక్షమునకు ఈ మంత్రముతో సూత్రమును (దారమును) కట్టవలెను.

**దామోదర నివాసాయై ధాత్ర్యై దేవ్యై నమో నమః।**
**సూత్రే ణానేన బన్ధామి ధాత్రి దేవి నమోఽస్తుతే ॥**

అనుచు నేతితో దీపమునుపెట్టి కర్పూరహారతి నీయవలెను. అనంతరము వృక్షమునకు ఈ మంత్రముతో ప్రదక్షిణ గావించవలెను.

**యానికాని చ పాపాని జన్మాన్తర కృతాని చ ।**
**తాని సర్వాణి నశ్యన్తు ప్రదక్షిణ పదే పదే ॥**

ఆ తరువాత ఆ వృక్షము క్రింద బ్రాహ్మణునకు భోజనముపెట్టి అంతమున తాము కూడ ఉసిరి చెట్టు దగ్గరకూర్చుండి భోజనము చేయవలెను. పండిన కూష్మాండ (గుమ్మడికాయ) మును తీసుకొని దానిలోపల రత్నములను సువర్ణమును వెండిని లేక రూపాయలనుగాని ఉంచి ఈవిధముగా సంకల్పము చేయవలెను.

**మమాఖిల పాపక్షయ పూర్వక సుఖ సౌభాగ్యదీనాముత్త**
**రోత్తరాభి వృద్ధయే కూష్మాండ దానమహం కరిష్యే ॥**

అనుచు బ్రహ్మణునకు దక్షిణతో కూష్మాండమును దానమిచ్చి ఈవిధముగ ప్రార్థించవలెను.

**కూష్మాండం బహుబీజా ఢ్యం బ్రహ్మణానిర్మితం పురా ।**
**దాస్యామి విష్ణవేతుభ్యం పితౄణాం తారణాయ చ ॥**

పితరులకు చలి నివారణకు యథాశక్తిగా కంబళిని గాని వస్త్రమునుగాని సత్పాత్రుడైన బ్రాహ్మణునకు దానమీయవలెను.

దీనిని అక్షయనవమి ధాత్రీనవమి కూష్మాండనవమి అనియు అందురు. గృహమందు ఉసిరిచెట్టులేనిచో, యేదేని తోటకువెళ్ళి ఉసిరిచెట్టు సమీపమున పూజాది దానములు చేయు విధానము కలదు. గృహమందు ఉసిరికొమ్మను పెట్టు కొనియు ఈ విధముగ చేయవచ్చును.

## 75. పృథ్వి ఎవరి ప్రభావమున నిలచియున్నది?

మనస్సును వశమందుంచుకొనువారు, దోషములకు హేతువైన వానిని త్యజించువారు, ధర్మార్థకామములకు హాని గలిగించువారు విద్యా వినయ సంపన్నులు సదాచారులు, పాపులకు పాపము తలపెట్టనివారు, కటువచనములు మాట్లాడు వారితోను ప్రియముగ మాట్లాడువారు ద్రవించు అంతఃకరణ గలవారు ఎన్నటికిని కామక్రోధలో బాధలగు వశీభూతులు కానివారు సర్వదా స్థితులైయుండువారు ఇట్టివారి ప్రభావముతో పృథ్వి నిలబడియున్నది.

## 76. దేవోత్థాపనీ ఏకాదశి (కార్తీక శుక్ల ఏకాదశి)

విష్ణుభగవానుడు క్షీరశయనుడగుటకు ఒక కథ గలదు. భాద్రపద మాసశుక్లపక్ష ఏకాదశినాడు శంఖాసురుని విష్ణువు వధించెను. దానితో అలసిపోయిన విష్ణుభగవానుడు క్షీరసాగరమునకు వెళ్ళి నిదురపోయెను. దానిలో వరుసగా నాలుగు మాసములు నిదురించెను. తిరిగి కార్తీకశుక్ల ఏకాదశినాడు నిదురనుండి మేల్కొనెను. ఇందువలన ఈ ఏకాదశిని దేవోత్థాపని అనియు, ప్రభోధిని ఏకాదశి అనియు



అందురు. విశేషముగ ఈ దినమున ఉపవాసముందురు. ఉపవాసముండలేనివారు ఒక్కపూట ఫలహారము చేయవచ్చును. ఏకాదశినాడు భగవన్నామమును జపించుచు కీర్తించవలెను. ఈదినము రాత్రి జాగరణచేయవలెను. జాగరణ సమయమున కీర్తన వాద్యాది నృత్యములను, పురాణ పఠనమును చేయవలెను. ధూపదీప నైవేద్య పుష్ప గంధచందన, ఫల, అర్ఘ్యాదులతో భగవానుని పూజించవలెను. ఘంట శంఖ మృదంగాది వాయిద్యములతో మంగళ ధ్వనులతో భగవానుని నిదురలేపవలెను.

**ఉత్తిష్ఠోత్తిష్ఠ గోవింద త్యజ నిద్రాం జగత్పతే ।**
**త్వయి సుప్తే జగన్నాథ జగత్ సుప్తం భవేదిదమ్ ॥**
**ఉత్తిష్ఠోత్తిష్ఠ వారాహదంష్ట్రోద్ ధృత వసున్ధరే ।**
**హిరణ్యాక్ష ప్రాణ ఘాతిన్ త్రైలోక్యే మంగలం కురు ॥**

అనంతరము భగవానునకు హారతినిచ్చి పుష్పాంజలి సమర్పించి ఈ విధముగ ప్రార్థించవలెను.

**ఇయంతు ద్వాదశీ దేవ ప్రబోధాయ వినిర్మితా ।**
**త్వయైవ సర్వలోకానాం హితార్థం శేషశాయినా ॥**
**ఇదం వ్రతం మయా దేవకృతం ప్రీత్రే తవ ప్రభో ।**
**న్యూనం సంపూర్ణతాం యాతు త్వత్ప్ర సాదాం జనార్దన ॥**

అని ప్రార్థించవలెను.

అనంతరము ప్రహ్లాద నారద పరశురామ పుండరీక వ్యాస అంబరీష శుక శౌనక భీష్మాది భక్తులను స్మరించి చరణామృతమును ప్రసాదమును వితరణ గావించవలెను.

## 77. తులసీ వివాహము (కార్తీక శుక్ల ఏకాదశి)

కార్తీకశుక్ల ఏకాదశీ దినమున తులసీ వివాహము చేయుదురు. తులసి వైష్ణవులకు పరమారాధ్యురాలు. కొందరు విష్ణుభగవానునకు తులసికి గొప్పగ వివాహము జరుపుదురు. తులసికి నాలుగువైపుల చెరకు గడలతో మండపమును నిర్మించెదరు. దానికి సౌభాగ్యచిహ్నమైన అద్దకము చీరను చుట్టెదరు. తులసికి గాజులు తొడిగి అలంకరించెదరు. గణపతాది దేవతలను పూజించి తులసికి షోడశోపచార పూజగావించెదరు. పెండ్లి కానుకగా కొబ్బరికాయను దక్షిణతో అచట నుంచెదరు. భగవానుని మూర్తిని చేతిలోపెట్టుకొని తులసికి ఏడు ప్రదక్షిణలుచేసి హారతినిచ్చి వివాహోత్సమును పూర్తిగావించవలెను. మంగళగీతములు ఆలపించి తులసిని పూజించెదరు.

## 78. వైకుంఠ చతుర్దశి (కార్తీక శుక్ల చతుర్దశి)

కార్తీకమాస కృష్ణ పక్ష చతుర్దశిని "నరకచతుర్దశి"యనియు, శుక్ల పక్ష చతుర్దశి యనియు, "వైకుంఠ చతుర్దశి" అనియు అందురు. నరక చతుర్దశినాడు నరకాధిపతి యమధర్మరాజును, వైకుంఠ చతుర్దశినాడు వైకుంఠాధిపతి విష్ణు భగవానుని పూజించెదరు.

**వ్రతవిధానము :–** ప్రాతః స్నానానంతరము దినమంతయు వ్రతముచేసి రాత్రి విష్ణుభగవానుని కమలపుష్పములతో పూజించవలెను. అనంతరము శివభగవానుని యథావిధిగ పూజించవలెను. రాత్రి గడచిన తరువాత మరుసటి దినమున శివుని పునఃపూజించి బ్రాహ్మణునకు భోజనముపెట్టవలెను. అనంతరము తాము భుజించవలెను. వైకుంఠ చతుర్దశి శైవులను, వైష్ణవులను పరస్పరముగా కలుపునట్టిది. ఇది విష్ణుభగవానుని శివభగవానుని ఏకత్త్వమునకు ప్రతీకము.

**కథ :–** ఒకానొక సమయమున విష్ణుభగవానుడు శివభగవానుని పూజించుటకు కాశీకి వెళ్ళెను. అచట మణికర్ణికా ఘాట్‌నందు స్నానముచేసి ఒక వెయ్యి స్వర్ణకమలములతో విశ్వనాధుని పూజించవలెనని సంకల్పించెను. అభిషేకానంతరము పూజింపసాగెను. విశ్వనాథుడు వీని భక్తిని పరీక్షించవలెనని స్వర్ణ కమలముందొక దానిని అదృశ్యము కావించెను. శ్రీహరి వెయ్యికమలములందొకటి అదృశ్యమగుటగాంచి నా నేత్రములు కూడా కమలములతో సమానమైనవే, ఇందు వలననే నన్ను కమలనయనుడని పుండరీకాక్షుడని అందురు. అందువలన కమలముగ నా నేత్రమును సమర్పించెదను. అని అనుకొని తన నేత్రమును తీసి అర్పించుటకు సిద్ధపడెను. విష్ణుభగవానుని అగాధమైన భక్తికి ప్రసన్నుడైన మహేశ్వరుడు ప్రకటమై ఇట్లనెను.

"హే విష్ణు! నీతో సమానమైన భక్తుడు నాకు మరొకడులేడు. నేడు కార్తీకశుక్ల చతుర్దశి, ఇప్పుడిది వైకుంఠ చతుర్దశి యైనది. ఈదినమున మొదట నిన్ను పూజించి, ఆ తరువాత నన్ను పూజించవలెను. ఈ విధముగ చేసిన వారు వైకుంఠప్రాప్తిని పొందెదరు". అని పలికి శివభగవానుడు విష్ణుభగవానునకు కోట్ల సూర్యకాంతిగల సుదర్శన చక్రమును ఇచ్చెను. "దీనితో సమానమైన అస్త్రము త్రిలోకములందు మరొకటి లేదు". అని శివభగవానుడు చెప్పెను.

## 79. భీష్మ పంచక వ్రతము
### (కార్తీక శుక్ల ఏకాదశి నుండి పూర్ణిమ వరకు)

ఇది భీష్మునికి వాసుదేవునివలన ప్రాప్తించెను. అందువలన ఈ వ్రతము భీష్మ పంచక నామముతో ప్రసిద్ధి గాంచెను. (భీష్మునకు వాసుదేవుడు చెప్పినది)

**వ్రతవిధానము :–** కామక్రోధాదులు త్యజించి బ్రహ్మచర్యముతో ఐదుదినములు ఈవ్రతము చేయవలెను. మౌనభావముతో నుండవలెను. యథాశక్తితో



బంగారముతోగాని వెండితోగాని లక్ష్మీనారాయణుల మూర్తిని తయారుచేయించి దానిని ప్రతిష్ఠగావించి షోడశోపచారపూజలుగావించవలెను.

మొదటిదినమున భగవానుని హృదయమును కమల పుష్పములతోను, రెండవ దినమున కటిప్రదేశమును బిల్వపత్రముల తోను, మూడవ దినమున మోకాళ్ళను కేతకీ పుష్పములతోను, నాలుగవ దినమున చరణములను చమేలీ (మల్లె) పుష్పములతోను, ఐదవదినమున సంపూర్ణాంగములనుతులసి (లేతచిగురులతో) తోను పూజించవలెను. నిత్యము "ఓం నమో భగవతేవాసుదేవాయ" అనుమంత్రము 108 మారులుగాని అంతకుమించిగాని జపించవలెను. "స్వాహా"యనుచు నెయ్యి నువ్వులు బియ్యము అగ్నిలో ఆహుతి గావించుచు యజ్ఞము చేయవలెను. ఐదు దినములు నిరాహారముతోగాని ఫలహారముతోగాని, ఏకభుక్తముతోగాని మితాహారముతోగాని యుండి ఈవ్రతమును చేయవలెను. వ్రతాంతమున పారణ సమయమందు బ్రాహ్మణ దంపతులకు భోజనముపెట్టి ఆ తరువాత తాము భుజించవలెను. ఈ వ్రతమందు కార్తీకమాస మాహాత్మ్యమును పఠించవలెను.



## 80. కార్తీక పౌర్ణమి (కార్తీక పూర్ణిమ)

ఇది బహు పవిత్రమైనది. ఈ తిథిని బ్రహ్మ విష్ణు శివ ఆదిత్యాదులందరు మహాపునీతమైన పర్వదినమని కొనియాడిరి. ఈ తిథినాడు చేయుస్నాన దానహోమ యజ్ఞాదులు అనంతమైన ఫలమొసగును. ఈ దినమున గంగాస్నానము, సాయం కాలమున దీపదానము విశేషముగ చేయుదురు. ఈ పూర్ణిమ దినము సాయం కాలమున భగవానుడు మత్స్యా వతారమెత్తెను. ఈ కారణమున ఈ రోజు చేయుదాన జపాదులు పది యజ్ఞములు చేసిన ఫలమొసగును. ఈ దినమున కృత్తికా నక్షత్రమున్న ఇది మహాకార్తీకమగును. భరణీ నక్షత్రమున్న విశేషమైన ఫలము లభించును. రోహిణీ నక్షత్రమున్న దీని ఫలము అధికమగును.

కార్తీకమాసమంతయు స్నానముచేసి నియమముతో పూర్ణిమ వ్రతము చేయవలెను. కార్తీక పౌర్ణమినాడు శ్రీ సత్యనారాయణ వ్రతకథను వినవలెను. సాయంకాలము దైవమందిరములందును రావి వృక్షము చెంతను తులసీ వృక్షము చెంతను దీపములు వెలిగించవలెను. కాశీలో ఈ తిథిని దేవదీపావళీ రూపమున జరుపుకొందురు. చాంద్రాయణ వ్రత సమాప్తియు ఈ దినముననే చేయుదురు. కార్తీక పూర్ణిమ వ్రతము చేసి జాగరణ చేసిన సకల మనోరథ సిద్ధులు గలుగును.

సిక్కులు ఈ దినమున గురునానక్ దేవుని జయంతిని జరుపుకొందురు.

## 81. శాంతి వ్రతము

ఈ వ్రతము కార్తీక శుద్ధపంచమినాడు ప్రారంభించి పులుపులేని ఆహారమును ఒక సంవత్సరముపాటు ఒక్కపూటనే భోజనము చేయవలెను. ఈ వ్రతముచేసిన

గృహస్థులకు, శాంతి లభించును. శేషశయనుని (శేషునిపైనున్న హరిని) రాత్రిపూట పూజించవలెను.

కటిని, తక్షకాయ నమః అని జఠఓం అనంతాయ నమః, ఓం వాసుకయే నమః ఓం తక్షకాయ నమః, ఓం కర్కోటకాయ నమః, ఓం పద్మాయ నమః ఓం మహాపద్మాయ నమః, ఓం శంఖపాలాయ నమః, ఓం కుటిలాయ నమః, అను ఈ మంత్రములతో విష్ణుభగవానుని శయ్యాస్వరూపమైన శేషనాగుని రెండు చరణములను, కటిభాగమును ఉదరమును, వక్షస్థలమును, కంఠమును, రెండు భుజములను, ముఖమును, శిరస్సును వేరువేరుగ పూజించవలెను. నువ్వులు కలిపిన పాలను పోయవలెను. సంవత్సరాంతమున బ్రాహ్మణులకు భోజనము పెట్టవలెను.

తరువాత బంగారు సర్పమును చేయించి దానిని బ్రాహ్మణునకు దానము చేయవలెను.

ఈ విధముగ చేసినవారికి నిశ్చయముగ శాంతి కలుగును.నాగులనుంచి భయము కలుగదు. (వరాహపురాణము)



## 82. దీపదాన వ్రతము

కార్తీక మాసములో రాత్రి సమయములో శివలింగము ఎదుట దీపములను వెలిగించవలెను. అవి ఎంత సమయము వరకు వెలుగునో అన్నివేల యుగములు వరకు స్వర్గలోకమున ప్రతిష్ఠితులగుదురు. దీపదాన ఫలముతో జ్ఞానులగుదురు. ధూపదీప కర్పూరహారతులతో సదాశివుని పూజించవలెను. రుద్రాక్షలు ధరించి శివుని పూజించువారి పుణ్యము అక్షయమగును. ఏకముఖరుద్రాక్ష, పంచముఖ రుద్రాక్ష ధరించుటకు యోగ్యమైనవి. విభూతిని లలాటముపై త్రిపుండ్ర ధారణచేసిన రుద్రలోకమునకేగుదురు. గోమయం ఆవుపేడ నేలమీద పడకుండ చేతితో పట్టుకొని దానిని కాల్చి విభూతిని చేయవలెను. ఇది సర్వ పాపములను హరించును. కార్తీక సోమవారము శివుని కెంతో ఇష్టమైనది. ఇట్లే కార్తీక పౌర్ణమికూడ. కార్తీక సోమవార వ్రతం, పౌర్ణమివ్రతమును చేయుదురు.వ్రతానంతరము బ్రాహ్మణునకు దక్షిణతాంబూలము నివ్వవలెను. (స్కాందపురాణము)

## 83. కేదారేశ్వర గౌరీవ్రతము

శౌనకాది మహర్షులు సూతులవారిని "మానవులకు సర్వసౌభాగ్యముల నొసగు వ్రతము చెప్పు"మని అడిగిరి.

సూతమహర్షి, "పార్వతీదేవి సదాశివుని శరీరార్థమును పొందిన కేదారేశ్వర వ్రతము గలదు దానిని చెప్పెద"వినుడు.

బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రాదులందరు ఆచరింపదగినదీ వ్రతము. ఈ వ్రతము ఇరువది ఒక్క (21) మారులాచరించిన శివసాయుజ్యమును బొందుదురు.



భూలోకమున దేవదారు నారికేళ ఆమ్ర, పనస, పున్నాగ, చంపకాది వృక్షములచేతను వివిధ రకములైన లతలతోను శోభించుచున్న ఒక వనముగలదు. అచటకైలాస శిఖరముపై ప్రమథగణములతో పార్వతీ పరమేశ్వరులు కూర్చొనియుండిరి. దేవ గాయకులు గానము చేయుచుండిరి.

ఆ సమయమున భృంగిరిటి యను భక్తుడు స్వామి సన్నిధిలో నాట్యము చేయగ, శంకరుడు పరవసించి అతనిని అనుగ్రహించెను. భృంగిరిటి పరవసించి పార్వతిని వదలి ఈశ్వరునికి మాత్రమే ప్రదక్షిణ నమస్కారములు గావించెను. పార్వతి పరమేశ్వరునితో "ఈతడిట్లాచరించుటకుగల కారణమే"మని అడిగెను.

పరమేశ్వరుడు "పార్వతీ! యోగులకు నీతోపనిలేదు, అని చెప్పగా పార్వతి కలతజెంది కైలాసమును వీడి, గౌతమాశ్రమమునకు వెళ్ళెను. గౌతమమహర్షి, భగవతీ! నీవిచటికి వచ్చిన కారణమే"మని అడిగెను.

పార్వతి గౌతమునకు తన విషాదగాథను తెలిపి "మహామునీ! ఏ వ్రతముచేసిన శంకరుని దేహార్థము నాకు లభించును (అర్థనారీశ్వరి) చెప్పు"మని అడిగెను.

గౌతముడు "దేవి! కేదారేశ్వరవ్రతము చేసిన నీ కోరిక నెరవేరును. దీనిని భాద్రపద శుక్లాష్టమినాడు చేయవలెను. సప్తమినాడు ఉపవాసము చేయవలెను. మరునాడు బ్రాహ్మణులకు భోజనముపెట్టవలెను. ఈ విధముగ ప్రతిదినము కేదారేశ్వరుని పూజించుచు అమావాస్య వరకు చేయవలెను. స్వామికి ఎదురుగ ధానారాశి నుంచి, దానిపై పూర్ణకుంభము నుంచి, ఇరువది ఒక్క (21) ముడులు చేసిన సూత్రముం(తోరమును)చి కలశమును పట్టువస్త్రముతో కప్పి, శక్తికొలది నవరత్నములను సువర్ణమును ఉంచి, గంధపుష్పాతలతో పూజించి సూత్రమును చేతికి ధరించవలెను.

ఇరువదిఒక్క మంది బ్రాహ్మణులను పిలచి, వారితో కేదారేశ్వరుని ప్రతిష్ఠింపజేసి, చందన అగరు, కస్తూరి గంధ, కుంకుమాదులతో పూజించి, ఇరువదిఒక్క పదార్థములను నైవేద్యముగ సమర్పించి, బ్రాహ్మణులకు దక్షిణతాంబూలములు నీయవలెను. ఈవిధ ముగ చేసిన ఈశ్వరుడు నీవుకోరిన వరమిచ్చునని చెప్పెను.

పార్వతీదేవి ఈ వ్రతమాచరించగ, శంకరుడు సంతుష్టుడై దేవగణములతో అచటకేతెంచి, తనశరీరములో అర్థభాగమును పార్వతికి ఇచ్చెను. శంకరుని దేహార్థమును పొందిన పార్వతి లోకానుగ్రహముకోరి, "పరమేశ్వరా! ఈ వ్రతము చేయువారికి సకలాభీష్టములు సిద్ధించునట్లు వరమీయు"దని అడుగగా, అట్లే యగునని పలికెను.

ఒక వైశ్యునకు పుణ్యవతి, భాగ్యవతియను ఇరువురు కుమార్తెలు గలరు. వీరు తండ్రి వద్దకువచ్చి తండ్రీ! మేము కేదారవ్రతమును చేయదలచితిమి. అనుజ్ఞ ఇండ నిరి.

"ఆ వ్రతమునకు సామాగ్రిని సమకూర్చుటకు నా దగ్గర ధనములేదు, గాన ఆ సంకల్పమును మానకొం"దని చెప్పెను.

మీ ఆజ్ఞయే మాకు ధన మని చెప్పి, తండ్రి ఆనతితోవారు ఒక వటవృక్షము మూలమున కూర్చుండి, తోరమును కట్టుకొని పూజించుటకు సిద్ధముకాగ వారి భక్తికి మెచ్చిన పరమేశ్వరుడు వ్రతమునకు కావలసిన సామాగ్రిని సమకూర్చెను. అంతటవారు ఆనందముతో వ్రతమాచరించగ భగవానుడు వారికి ఆయురారోగ్య ఐశ్వర్యములను దివ్యరూపములను ప్రసాదించి అంతర్ధాన మయ్యెను.

ఈ వ్రత మాహాత్మ్యము వలన ఉజ్జయినీ పట్టణము ఏలుచున్న రాజు పుణ్యవతి యను కన్యను, చోళభూపాలుడు భాగ్యవతియను కన్యను వివాహమాడిరి. ఆ వైశ్యుడు సర్వసంపదలను పొంది సుఖముగ నుండెను.

వైశ్యుని రెండవ కుమార్తెయైన భాగ్యవతి ఐశ్వర్య గర్వముతో కొంతకాలమునకు వ్రతమాచరించుట మానుకొనెను. దానిచేత భాగ్యహీనురాలై భర్త వెళ్ళగొట్టగ పుత్రునితో కలసి అడవిలో సంచరించుచు ఒక బోయవాని ఇంటికి చేరెను. తనపుత్రునితో "మా అక్క పుణ్యవతిని ఉజ్జయినీ రాజు వివాహమాడెను.నీవచకివెళ్ళి కొంతధనమును తెమ్మనిచెప్పెను". ఆబాలుడు, తనపెద్దమ్మదగ్గరకు వెళ్ళి, తమ కష్టములను చెప్పగ ఆమె వీనికి ధనమును బంగారమును ఇచ్చి పంపెను. ఆధనమును తీసుకొని వచ్చుచుండ, మార్గమున భగవానుడు అదృశ్యరూపముతో ఆ ధనమును హరించెను. అంతటాబాలుడు మరల పెద్దమ్మ చెంతకేగి విషయము చెప్పగ, ఆమె మరి కొంతధనమునిచ్చి పంపెను. ఆ ధనము కూడ హరింపబడెను. అంతట పరమేశ్వరుడు అదృశ్యరూపముతో "ఓ బాలుడా! వ్రత భ్రష్టులగు మీకు ధనము గ్రహింప నలవికాదని చెప్పెను".

ఆ మాటలు వినిన బాలుడు తిరిగి తన పెద్దమ్మ దగ్గరకు వెళ్ళి జరిగిన విషయమంతయు చెప్పెను. విషయము గ్రహించిన పుణ్యవతి బాలుని చేత వ్రత మాచరింపజేసి, తోరమునుకట్టి తన చెల్లెలు వ్రతమాచరించునటుల చెప్ప వలయునని, మరికొంతధనమును ఆ బాలునికిచ్చి పంపెను. మార్గమున వచ్చు చుండ తాను పోగొట్టుకొనిన ధనమంతయు దొరికెను.

ఆ ధనమును తల్లికి ఇచ్చి వ్రతము చేయమని పెద్దమ్మచెప్పెనని చెప్పెను. అప్పుడామె వ్రతమును చేయగ, తన భర్తవచ్చి వీరిని తీసుకొని వెళ్ళెను. అది మొదలు ఈమె మరువక ప్రతి సంవత్సరము వ్రతము చేయుచు సుఖముగ నుండెను.

దీనిని చదువువారు వినువారు సమస్త సంపదలనుభవించి శివసాయుజ్యమును పొందుదురు. ఈ వ్రతము దీపావళీ అమావాస్య రోజున (కార్తీకమాసములో) చేయువిధానము కలదు. కార్తీక సోమవారము కూడ ఈ వ్రతము చేయుదురు.

(స్కాందపురాణము)



## మార్గశిరమాస వ్రతములు

### 84. కాలభైరవాష్టమి – (మార్గశీర్ష కృష్ణ అష్టమి)

శివభగవానునకు రెండు స్వరూపములు గలవు. భక్తులకు అభయ మొసగు విశ్వేశ్వర స్వరూపము. దుష్టులను దండించు కాలభైరవ స్వరూపము. విశ్వేశ్వర స్వరూపము అతి సౌమ్యముగను శాంతముగను నుండును. భైరవ స్వరూపము అతి రౌద్రము భయానకము ప్రచండ వికరాలము అయినది.

శివపురాణ శతరుద్రసంహితానుసారము సదాశివుడు మార్గశిరమాస కృష్ణపక్ష అష్టమీనాడు భైరవ రూపమున అవతరించెను. అందువలన సాక్షాత్ శివస్వరూపము గనే భావించవలెను.

**వ్రతవిధి :–** భైరవుడు మధ్యాహ్న సమయమున జన్మించెను. ఆ దినమున ప్రాతఃస్నానముచేసి వ్రత సంకల్పము చేయవలెను. భైరవుని మందిరములకు వెళ్ళి వానిని పూజించవలెను. "ఓం భైరవాయ నమః" అను నామ మంత్రముతో షోడశోపచార పూజలు చేయవలెను. భైరవుని వాహనమైన కుక్కను కూడ పూజించవలెను. దీనికి మృష్టాన్నమును తినిపించవలెను. ఈ దినము ఉపవాసముండి జాగరణచేసిన సమస్త పాపవిముక్తులగుదురు.

భైరవుడు కాశీలో నగర రక్షకుడు. కాలభైరవుని కాశీలో విశేషముగ పూజించెదరు. కాశీలో కాలభైరవునకు అనేక మందిరములు గలవు. ఇవి కాలభైరవ, బటకభైరవ, ఆనందభైరవాది నామములతో గలవు. భైరవాష్టమి మంగళవారము, ఆదివారము వచ్చిన గొప్ప మాహాత్మ్యము గలదగును.

### 85. వివాహ పంచమి (మార్గశీర్ష శుక్ల పంచమి)

మర్యాదా పురుషోత్తముడైన శ్రీరాముని వివాహము మార్గశిరమాస శుక్లపక్ష పంచమినాడు జనకపురమందు జరిగెను. సీతాస్వయంవరములో ధనుర్భంగానంత రము విదేహరాజు జనకుడు అయోధ్యకు దూతలను పంపగ, దశరథ మహారాజు పెండ్లి కానుకలతో పెండ్లి పెద్దలతో తన పరివార సమూహములతో జనకపురమునకు తరలి వచ్చెను.

అనంతరము సీతాకళ్యాణ వివాహవిధి పంచమినాడు జరిగెను. ఇందువలన అయోధ్యలోను, జనకపురిలోను వివాహ పంచమి మహోత్సవమును మందిరమందు గొప్పగ చేయుదురు. తమ పరంపరానుసారము వివాహమునకు పూర్వము, ఆ తరువాత సమస్త విధులను పెండ్లి కుమారుని చేయుట పెండ్లి కుమార్తెను చేయుట) నిర్వహించిరి.

రామభక్తులు ఈ మహోత్సవమును ఆనందముగ జరుపుకొందురు.

## 86. శ్రీదత్తాత్రేయ-జయంతి (మార్గశీర్ష పూర్ణిమ)

దత్తాత్రేయుడు విష్ణుభగవానుని అవతారము. ఇతడు మార్గశీర్ష పౌర్ణమి ప్రదోషకాలమందు అవతరించెను. అందువలన ఈ దినమున దత్త జయంతిని గొప్పగ జరుపుదురు. శ్రీమద్భాగవతానుసారము అత్రిమహర్షి పుత్రుని కొరకు తపముచేయగ "దత్తోమయాహ మితియద్ భగవాన్ దత్తః" నేనే నీకు పుత్రుడనగుదు నని విష్ణుభగవానుడు చెప్పి, అత్రిమహర్షికి పుత్రుడుగా అవతరించి "దత్త" అనబడెను. అత్రి పుత్రుడగుటచే "ఆత్రేయు"డనిరి. దత్త-ఆత్రేయ సంయోగముతో ఇతడు "దత్తాత్రేయ" నామముతో ప్రసిద్ధుడయ్యెను.

ఒకానొక సమయమున శ్రీలక్ష్మీదేవి శ్రీసతీదేవి శ్రీసరస్వతీదేవి తాము పతివ్రతలమని గర్వపడుచుండిరి. భగవానుడు తన భక్తుల గర్వమును సహించలేడు. అందులకొక అద్భుతమైన లీలను చేయదలచి, దేవర్షి నారదుని మనస్సుతో ప్రేరణ కల్పించెను.

నారదుడు సంచారముచేయుచు దేవలోకమునకు వెళ్ళి ముగ్గురు అమ్మలతో ఇట్లనెను. "అత్రి పత్ని అనసూయ మించిన పతివ్రత లే"దనెను.

అప్పుడా ముగ్గురు బ్రహ్మవిష్ణు మహేశ్వరులచెంతకేగి నారదుని మాటలు చెప్పి "అనసూయ పాతివ్రత్యమును పరీక్షించ"మనిరి. దేవతలెంత వారించినను ఆ ముగ్గురు వినలేదు. అప్పుడు బ్రహ్మ విష్ణు మహేశ్వరులు సాధువేషములు ధరించి అత్రిముని ఆశ్రమమునకు వెళ్ళిరి. అత్రిమహర్షి ఆసయమందు ఆశ్రమమున లేడు.

అతిథులొచ్చుట చూచిన అనసూయాదేవి వారికి ప్రణామ మాచరించి అర్ఘ్యఫల మూలాదులను అర్పించెను. కానీ వారు గ్రహించక. "మీరు వస్త్రములు లేకుండ మా సమక్షమున నిలచునంతవరకు మేము ఆతిధ్యమును స్వీకరించ"మనిరి.

ఈ మాటలను వినిన అనసూయ అవాక్కురాలయ్యెను. కానీ ఆతిథ్య ధర్మమునకు లోపము జరుగరాదనితలచి, ఆమె నారాయణుని ధ్యానించి, తన పతిదేవుని స్మరించి ఇది భగవానుని లీలగా గ్రహించి ఆమె ఇట్లనెను.

"నా పాతివ్రత్య ధర్మము సత్యమైనచో, ఈ ముగ్గురు సాధువులు ఆరుమాసముల శిశువులుగా నగుదురుగాక" అని నంతనే ముగ్గురు ఆరు మాసముల శిశువులై రోదించసాగిరి.

అప్పుడు అనసూయామాత వారిని తన ఒడిలోనికి తీసుకొని స్తనపానమిచ్చి ఊయలలందు వేసెను. దేవలోకమునకు బ్రహ్మ విష్ణు మహేశ్వరులు తిరిగి రానందున లక్ష్మీ పార్వతీ సరస్వతి ముగ్గురు దుఃఖించుచుండగా నారదుడువచ్చి జరిగిన విషయమంతయు వారికి చెప్పెను.

అంతట వారు ముగ్గురు అనసూయ దగ్గరకువచ్చి క్షమింపుమని వేడుకొనిరి. అనసూయ ఆత్రిదేవులకు పూర్వరూపములు ప్రసాదించెను. త్రిదేవులు అనసూయను వరమడుగు మనిరి.



అనసూయ "మీముగ్గురు నాకు పుత్రులుగా జన్మించవలె"నని కోరుకొనగ "తథాస్తు"పలికి సతులతో కూడి ఎవరిలోకములకువారు వెళ్ళిపోయిరి.

కాలాన్తరమున త్రిదేవులు అనసూయ గర్భమున ఉద్భవించిరి. బ్రహ్మదేవుని అంశతో చంద్రుడు,శంకరుని అంశతో దూర్వాసుడు, విష్ణు అంశతో దత్తాత్రేయుడు జన్మించిరి.

ఈ విధముగ అత్రి అనసూయలకు పుత్రుడుగ విష్ణుభగవానుడు దత్తాత్రేయునిగా జన్మించెను. ఇతని ఆవిర్భావ తిథిని దత్తాత్రేయ జయంతి అందురు. దత్తాత్రేయుడు దయామూర్తి. భక్తవత్సలుడు,భక్తులు స్మరించినంతనే వారి చెంతకు వెళ్ళును. అందువలన ఇతనిని స్మృతిగామియనియు, స్మృతి మాత్రానుగన్తా అనియు అందురు. ఇతడు శ్రీవిద్యలకు పరమ ఆచార్యుడు. ఇతడు (24) ఇరువదినలుగురు గురువుల చెంత శిక్షనభ్యసించినవాడు.

దత్తాత్రేయుని నామముపై దత్తసంప్రదాయము దక్షిణభారతమందు విశేషముగా ప్రసిద్ధి చెందెను. గిరనార క్షేత్రము శ్రీదత్తాత్రేయుని సిద్ధిపీఠము. వీని గురు చరణపాదుకలు వారణాసి యందును ఆబూపర్వతాది స్థానములందును గలవు. దక్షిణభారతమున అనేక మందిరములు గలవు. దత్తజయంతి రోజున విశేషముగ ఆరాధనలు పూజలు జరుగును. ఈ దినమున వ్రతముచేసి మందిరమునకు వెళ్ళి భగవానుని దర్శించవలెను.

## 87. గీతాజయంతి (మార్గశీర్షశుక్ల ఏకాదశి)

యేగ్రంథమునకు జయంతి జరుగలేదు. కేవలము శ్రీమద్భగవద్గీత గ్రంథమునకు మాత్రమే జరుగుచున్నది. యేలననగ అన్యగ్రంథములన్నియు మనుష్యులచే వ్రాయబడినవి. గీత స్వయముగ శ్రీభగవానుని శ్రీముఖము నుండి ఉద్భవించినది.

**యా స్వయం పద్మనాభస్య ముఖపద్మా ద్వినిఃసృతా॥**

ధర్మక్షేత్రమైన కురుక్షేత్రమందు శ్రీభగవానుని విభూతి స్వరూపమైన మార్గశీర్ష మాసమున భగవానునకు ప్రియమైన శుక్ల పక్ష ఏకాదశి తిథినాడు గీత జన్మించెను. ఈ తిథి మోక్షదా ఏకాదశీ నామముతో ఖ్యాతిగాంచెను.

గీత సార్వభౌమ గ్రంథము. ఇది దేశకాల ధర్మ సంప్రదాయ జాతివిశేషముల కొరకుకాదు. సంపూర్ణ మానవజాతికొరకు, దీనిని స్వయముగా శ్రీభగవానుడు అర్జునుని నిమిత్తమాత్రునిగా చేసుకొని చెప్పినది. అందువలన ఈ గ్రంథమున ఎక్కడను "శ్రీకృష్ణఉవాచ"శబ్దమురాలేదు, కేవలము "శ్రీభగవానువాచ" అని మాత్రమే ప్రయోగించబడినది.

ఆవుపాలను దూడత్రాగిన తరువాత అందరు యేవిధముగ పానము చేయుచున్నారో, అట్లే గీతాగ్రంథముకూడ అందరికి జీవనస్వరూపమైనది. అన్ని

ఉపనిషదుల సారము,గీతామాత గోస్వరూపమని, పాలు పితుగువాడు గోపాలుడైన శ్రీకృష్ణుడు అర్జునకు దూడగ(త్రాగిన తరువాత వచ్చు అమృతము వంటి పాలే గీతా మృతము, ఇది వేదముల ఉపనిషదుల సారము. ఇహలోక పరలోకములకు మంగళ కరమైన మార్గమును చూపునది, కర్మజ్ఞానభక్తి మార్గములద్వారా మనుష్యులకు పరమ శ్రేయస్కరమైన సాధన మును ఉపదేశించునది, జ్ఞానమును భక్తిని కర్మయను నియమ తప అహింస సత్యము ధర్మములను ఉపదేశించునది.

ధర్మమును అవలభించి అధర్మమును త్యజించి యుద్ధముచేయుమని ఉపదేశించినది ఈ అద్భుత గ్రంథము, దీనిలో పదునెనిమిది (18) అధ్యాయములు గలవు. మనుష్యుల కర్తవ్యమును బోధించుటే గీతా లక్ష్యము. ఇది మహాభారతమున భీష్మపర్వమందు వచ్చును. ఇది ఎవరి కొరకోకాదు, శ్రీకృష్ణుడు దీనిని మనుష్యులకొరకే ఉపదేశించెను. కర్మను చేయుము, కర్తవ్యను చేయుట కర్త్వయము, ఈకర్మను నిష్కామ భావముతో చేయవలెను. ఇది మానవుడెట్లు జీవించవలెనో నేర్పునది. ధర్మదీపమైనది.

**గీతాజయంతిని జరుపుకొనుచు చేయవలసిన కార్యక్రమములు:**

**గీతాగ్రంథమును పూజించుట:-** గీతా వక్తయైన శ్రీకృష్ణుని, శ్రోతయైన అర్జునుని, మహాభారమందు గీతను వ్రాసిన వ్యాసభగవానుని పూజించవలెను.

దీనిని వ్యక్తిగలముగనైనను సామూహికముగనైనను పారాయణము చేయ వలెను. గీతాతత్త్వమును ప్రచారము చేయుటకు సభలను ప్రవచనములను వ్యాఖ్యాన గోష్టులను ఏర్పాటు చేయవలెను. గీతయందు పరీక్షలుపెట్టి ఉత్తీర్ణులైనవారికి పురస్కారములీయవలెను. శోభాయాత్ర చేయవలెను.

## 88. శుభవ్రతము

ఈ శుభవ్రతమువలన విష్ణుభగవానుని దర్శనము సులభముగ గలుగును. ఇందెట్టి సందేహము లేదు. మార్గశిర మాసమున మొదటి రోజున దీనిని ప్రారంభించ వలెను. దశిమినాడు ఒక్కపూట మాత్రమే భోజనము చేయవలెను. ఆ దినము స్నానానంతరము మధ్యాహ్న సమయమున విష్ణుభగవానుని పూజించవలెను. ఏకాదశి నాడు ఉపవాసముండి, ద్వాదశినాడు విప్రునకు యవలు దానము చేయవలెను. దానము హోమము అర్చనాదులు చేయునప్పుడు సర్వదా కృష్ణాయ నమః అని హరిని స్మరించవలెను.

ఈ విధముగ నాలుగు నెలలు చేయవలెను. ఈ నాలుగు నెలలు బ్రాహ్మణులకు పేలపిండిని పాత్రలలోపోసి, పాత్రలతో పాటుగ దానమీయవలెను. (చైత్రమాసమును, శ్రావణ మాసమునందును, మరి మూడు మాసములందును వరిధాన్యమును దానమీయవలెను. కార్తీకమాసము తొలిరోజు నుండి పూజలుచేసి దశమి ఏకాదశము లందు యధావిధిగనే చేయవలెను. (కార్తీకమాస నామమును ఉచ్ఛరించుచు ఏకాదశి దినమున భక్తితో శ్రీ హరిని పూజించవలెను. ద్వాదశి దినమున వ్రతసమాప్తి గావించ వలెను.



ఏకాదశి దినమున పర్వతము పాతాళ పృథ్వీ చిహ్నములతో బంగారు ప్రతి మను చేయించి దీనిని శ్రీహరి ఎదుట నుంచి పూజించవలెను. దీనిపై తెల్లని వస్త్ర మును కప్పవలెను. అచట అన్నిరకముల ధాన్యములను ఉంచవలెను. జాగరణ చేయవలెను. మరుసటి దినమున 24గురు బ్రాహ్మణులను ఆహ్వానించి ఒక్కొక్కరికి దక్షిణగ ఒకొక్క గోవును వృషభమును దానము చేయవలెను. వస్త్రము ఉంగరము (శక్తికి తగినట్లుగ) మురుగులు కుండలములు కూడ దానము చేయవలెను. ( ఈ దానము రాజులు చేయుదురు.) ఈ విధముగ బంగారముతో చేయలేనివారు వెండితో నైనను చేయ వచ్చును. ఇవి కృష్ణ-శుక్ల ద్వాదశులలో చేయవలెను.

బ్రాహ్మణులకు భోజనముపెట్టి (శక్తిగలవారు) పాదరక్షలు గొడుగు పాదుకలు ఇవ్వవలెను. కృష్ణుడు దావామోదరుడు విశ్వరూపుడు యైన శ్రీహరి సర్వదా నాపై సంతుష్టుడగుకాక యని పలుకవలెను.

అన్నదానాదుల వలన కలుగు ఫలము చెప్పుటకు శక్యముకానిది.

ఆది యుగములో ఒక రాజుండేవాడు. అతడు బ్రహ్మవాది దృఢవ్రతుడు. ఇతడు పుత్రుడు కావలెనని బ్రహ్మను కోరెను. బ్రహ్మ అతనికి వ్రతము చేయుమని చెప్పెను. రాజు ఈవ్రతము చేసినంతనే భగవానుడు ప్రత్యక్షమై యేమి కావలెనో కోరుకొనుమనెను. రాజు "దేవా! వేదమంత్ర విశారదుడు చిరాయుష్మంతుడు గుణశాలి బ్రహ్మభూతుడు అకల్మషుడు అయినట్టి కుమారుని ప్రసాదించు మనెను. మరో వరము నాకు కూడా మునిపదమునే శుభస్థానము ప్రసాదించుము అచటికి వెళ్ళిన వారికి శోకము ఉండ"దని కోరుకొనెను.

భగవానుడు అట్లే యగుగాక యని అదృశ్యమయ్యెను.

రాజుకి వత్సశ్రీ అను కుమారుడు కలిగెను. ఇతడు వేదవేదాంగ సంపన్నుడై యజ్ఞములు చేసెను. రాజు సర్వము పరిత్యజించి తపస్సుకు వెళ్ళెను. నిరాహారుడై వారిని స్తుతించసాగెను. క్షరుడవు, అక్షరుడవు క్షీరసాగరశయనుడవు, పృథ్వీ ధరుడవు దేహధారులకు పరమ పదమైనవాడివి అతీంద్రియుడవు, విశ్వభోక్తవు నిరాకారుడవు యైన జనార్దన భగవానుని స్తుతించుచున్నాను.

ఆదిదేవుడవు, పరమార్థ స్వరూపుడవు, పురాణ పురుషోత్తముడవు శంఖ చక్రగదా పద్మధారివైన శ్రీహరీ, రక్షించుము. అనేక రూపుడవు. కూర్మరూపము మృగరూపము ధరించి ఉద్ధరించినవాడవు, నృసింహుడవు, వామనుడవు, దశకంఠ వంశనాశకుడవైన వాసుదేవా నమో నమః

బద్ధకల్కి ఖగేశ శంభూ, దేవశత్రు వినాశకా నీకు నమస్సులు. నారాయణా! పద్మనాభా! నమస్సులు నమస్సులు.పురుషోత్తమా! నీకు వందనం. సర్వజ్ఞులలో ప్రధానుడవైనవాడా! నీకు అభివందనం. కరాళాస్యా నృసింహమూర్తీ నీకు కైమోడ్పు. విశాలాద్రిసమానా ,కూర్మా నీకు వెన్నెల సముద్ర ప్రతిమానా మత్స్యా నీకు చేమోడ్పు అనంతా వరాహమూర్తీ నమస్సుమాంజలి.

దేవా! సృష్టికొరకు నీ ఈ చేష్టలు నీ రూపధారణలు గ్రహించక నిన్ను ధ్యానించినను వారికి నీవు కానరావు. నీవు తొలియజ్ఞమూర్తివి. యజ్ఞాంగమైన హవిస్సుడవు, పశువవు, ఋత్విక్కువు ఆజ్యానివి. దేవతలచే మునులచే గంధర్వాదు లందరిచే పూజింపబడువాడవు. సమస్తము నీలోవున్న విశ్వరూపుడవు. నిన్ను శరణు వేడుచున్నాను.నన్ను ఉద్ధరించుమని రాజు పెద్దమామిడిచెట్టు క్రింద కూర్చుండి ప్రార్థించెను.

సంతుష్టుడైన భగవానుడు పొట్టివానిగ వచ్చెను. మామిడి చెట్టు కూడ పొట్టిదై పోయెను. ఇది చూచిన రాజు ఇంత పెద్ద చెట్టు పొట్టిదిగ మారుటేమని విచారించ సాగెను. అంతలో రాజున కొక ఆలోచన వచ్చెను. ఈ పొట్టివాడు వచ్చినంతనే చెట్టు ఈ విధముగ మారిపోయెను. అందువలన ఇతడు తప్పక పురుషోత్తమ భగవా నుడే అయివుండవలె ననుకొని ఆ బ్రాహ్మణునికి నమస్కారముచేసి "భగవానుడా! హరీ! నీవు పురుషోత్తము డవు. నన్ను అనుగ్రహించుటకే వచ్చినావు. నీ స్వరూపదర్శన మొసగుమని" రాజు ప్రార్థించెను. అంతట శంఖ చక్రగదాధరుడైన భగవానుడు ఎదుట నిలచెను. "రాజా! నీకేమి కావలెనో కోరుకొను"మనెను.

"రాజు హర్షోల్లాసముతో భగవానుడా! నాకు మోక్షమును ప్రసాదించుమని అడిగెను".

అంతట భగవానుడు "మరొకవరము ఇచ్చు చున్నాను, నేను వచ్చినంతనే, ఈ మామిడిచెట్టు కుబ్జ రూపము దాల్చెను. కనుక ఈ తీర్థమునకు 'కుబ్జకామ్ర' మను"నామము కలుగునుఇచట మరణించినవారి (పశుపక్ష్యాదులకుకూడ) కొరకు ఐదువందల విమానములొచ్చును. వారికి యోగుల ముక్తి లభించును. అని భగవానుడు పలికి తన శంఖాగ్రముతో రాజుని స్పృశించెను.

వెనువెంటనే రాజు పరమపద నిర్యాణమును పొందెను. దీనిని చదివిన వారు, వినినవారు మోక్ష మును పొందెదరు. ఈ వ్రతము చేయువారు ఇహలోక సంపదల ననుభవించి, అంతమున విష్ణుభగవానుని యందులీనమగుదురు.

(వరాహపురాణము)

## 89. కామ్య వ్రతము

ఇది కోరికలు తీరు వ్రతము, ఈ వ్రతముచేసిన మనస్సులోని కోరికలన్నియు తీరును. షష్ఠినాడు ఉపవాసముండి ఈ వ్రతమును ఒక సంవత్సరము చేయవలెను. కేవలము ఫలములను మాత్రమే ఆరోజు తినవలెను.

ఓం షడ్వక్త్రాయ నమః, ఓం కార్తికేయాయ నమః, ఓం సేనాన్యై నమః, ఓం కృత్తికాసుతాయ నమః, ఓం కుమారాయ నమః, ఓం స్కందాయ నమః, అని ఈ విధముగ కుమార నామములతో విష్ణువును పూజించవలెను. వ్రతము సమాప్తమైన తరువాత బ్రాహ్మణులకు భోజనము పెట్టవలెను.





బంగారు షణ్ముక ప్రతిమను బ్రాహ్మణునకు దానమీయవలెను. వస్త్రమును కూడ ఇవ్వవలెను. ఈ విధముగ చేసినవారికి ఈ జన్మలోనే కోరికలన్ని తీరును.

(వరాహపురాణము)

## 90. పుణ్యక వ్రతము

నారదుడు విష్ణుభగవానుని "భగవాన్! గణేశుని ఉత్పత్తి ఎట్లు జరిగెను? యే దేవాంశతో ఉత్పన్నమయ్యెను? బ్రహ్మ, విష్ణు, మహేశ్వరు లుండగ అగ్రపూజవానికెట్లు వచ్చెను? సవిస్తరముగ వర్ణించి చెప్పు"మని అడిగెను.

అప్పుడు నారాయణుడు ఇట్లనెను. "నారదా! నేను ఆ పరమ రహస్యమును వర్ణించి చెప్పుచున్నాను వినుము. దైత్యులచే పీడింపబడుచున్న దేవతలను తేజోరాశి నుండి ఉత్పన్నమైన దేవి, దైత్య సముదాయమును సంహరించిన తరువాత ఆమె దక్షకన్యగ ప్రకటమయ్యెను. ఆమెయే సతీదేవి. తన పతిని నిందించిన కారణమున యోగాగ్నితో తన శరీరమును పరిత్యజించి శైలరాజపుత్రికగా జన్మించెను. శైలరాజు ఆ పార్వతిని శంకరునకిచ్చి వివాహము గావించెను. మహేశ్వరుడు పార్వతితో నిర్జనవనమందు విహరింపసాగెను. అప్పుడు దేవతలు శంకరుని విహారము విరమింపుమని కోరగా, శంకరుడు విరమించెను. ఆ సమయమున మహేశ్వరుని శుక్రము భూమిపైబడి కార్తికేయుడు ఉత్పన్నమయ్యెను. అప్పుడు పార్వతీదేవి శంకరుని ఒక శ్రేష్ఠ పుత్రుని కొరకై ప్రార్థించెను.

మహేశుడు పార్వతితో "పార్వతీ! నేను ఒక ఉపాయము చెప్పుచుంటిని. వినుము. ఇది సర్వాభీష్టసిద్ధికి బీజము, పరమ మంగళ దాయకమైనది. నీవు శ్రీనము చేయవలెను. ఇది పుణ్యక వ్రతము. మహాకఠోర బీజము, కల్పతరువువలె అభీష్ట సిద్ధి గలిగించును. ఉత్కృష్ట, సుఖదాయకము, పుణ్యప్రదము, సారరూపము, పుత్రప్రదము, సమస్త సంపదలు ఇచ్చును. నదులతో గంగ, దేవతలలో శ్రీహరి, వైష్ణవులలో నేను (శివుడు), దేవీగణములలో నీవు, వర్ణములలో బ్రాహ్మణి వర్ణము, తీర్థములలో పుష్కరము, పుష్పములలో పారిజాతము, పత్రములలో తులసీదళము, తిథులలో ఏకాదశి, వారములలో ఆదివారము, మాసములలో మార్గశీర్షము, ఋతువు లలో వసంతము, వత్సరములలో సంవత్సరము, యుగములలో కృతయుగము, పూజనీయులలో విద్యను బోధించు గురువు, గురుజనులలో తల్లి, ఆత్మజనులలో పత్ని, నమ్మదగు వానిలో మనస్సు, ధనములో రత్నము, ప్రియజనులలో పతి, బంధుజనులలో పుత్రుడు, వృక్షములలో కల్పతరువు, ఫలములలో మామిడి, వర్షములలో భారతవర్షము, వనములలో బృందావనము, స్త్రీలలో శతరూప, పురము లలో కాశి, తేజస్సులలో సూర్యుడు, సుఖదాతలలో చంద్రుడు, రూపవంతులలో కామదేవుడు, శాస్త్రములలో వేదము, సిద్ధులలో కపిలముని, వానరులలో హను మానుడు, క్షేత్రములలో బ్రాహ్మణముఖము, యశస్సులలో విద్యా మనోహరమగు

కవిత, వ్యాపకవస్తువులలో ఆకాశము, శరీరాంగములలో నేత్రము, విభవములలో హరికథ, సుఖములలో హరిస్మరణ, స్పర్శలలో పుత్రస్పర్శ, పుణ్యములలో సత్య భాషణము, తపస్యలో శ్రీహరిసేవ, తపస్వులలో బ్రహ్మ, భక్ష్యవస్తువులలో అమృతం, అన్నములలో ధాన్యము, పవిత్రము చేయువానిలో జలము, శుద్ధిచేయువానిలో అగ్ని, తేజస్సు వస్తువులలో సువర్ణము, తియ్యని పదార్థములలో ప్రియభాషణము, పక్షులలో గరుడుడు, ఏనుగులలో ఐరావతము, యోగులలో కుమారుడు (సనత్కుమార ఆది), దేవర్షులలో చిత్రరథుడు, బుద్ధిమంతులలో బృహస్పతి, శ్రేష్ఠకవులలో శుక్రాచార్యుడు, కావ్యములలో పురాణములు, నదులలో సముద్రము, క్షమాశీలులలో భూమి, లాభము లలో ముక్తి, సంపత్తులలో హరిభక్తి, పవిత్రులలో వైష్ణవులు, వర్ణములలో ఓంకారము, మంత్రములలో విష్ణు మంత్రము, బీజములలో ప్రకృతి, విద్వాంసులలో వాణి, ఛందస్సులలో గాయత్రీచ్ఛందము, యక్షులలో కుబేరుడు, సర్పములలో వాసుకి, పర్వతములలో హిమవానుడు, గోవులలో సురభి, వేదములలో సామ వేదము, తృణములలో కుశ, సుఖప్రదములలో లక్ష్మీ, శీఘ్రగాములలో మనస్సు, అక్షరములలో ఆకారము, హితైషులలో తండ్రి, యంత్రములలో శాలగ్రామశిల,చతుష్పాత్తులలో సింహము, జీవధారులలో మనుష్యులు, ఇంద్రియములలో మనస్సు, బలవానులలో శక్తి, అదితిపుత్రులలో ఇంద్రుడు, దైత్యులలో బలి, సాధువులలో ప్రహ్లాదుడు, అస్త్రము లలో బ్రహ్మాస్త్రము, చక్రములలో సుదర్శ నచక్రము, మనుష్యులలో శ్రీరామచంద్రుడు, శ్రీకృష్ణుడు, సర్వాధారుడు, సమస్త జీవులచే సేవింపబడువాడు, సర్వబీజ స్వరూపుడు, సర్వాభీష్టప్రదాత ఎటో అదే విధముగా ఈ పుణ్యకవ్రతము సర్వవ్రతములలో శ్రేష్ఠ మైనది. ఇందువలన నీవు దీనిని అనుష్ఠానము చేయుము. ఈ వ్రతపాలనతో నీకు సారరూప పుత్రుడు ప్రాప్తమగును. గిరిజా! "నీవు ఈ పరమదుర్లభ విష్ణు మంత్రమును గ్రహించి, వ్రతకాలమందు ఈ మంత్రముచే జపింపుము" అని చెప్పెను.

శంకరుడు పార్వతిని, గంగాతీరమునకు గొనిపోయి, అచట పార్వతికి విష్ణు మంత్రమును ఉపదేశించెను. పుణ్యకవ్రత విధానము వినిన పార్వతి మనస్సు ప్రసన్న మయ్యెను. శంకరుని "నాథా! ఈ వ్రత విధానము నాకు సవిస్తరముగ చెప్పవలసిన" దని కోరెను.

మహేశ్వరుడు దేవీ! ఈ వ్రత విధానమును నియమమును చెప్పుచుంటిని వినుము. మాఘమాస శుక్ల త్రయోదశీ దినమున ఈ వ్రతము ప్రారంభించుటకు శుభముగనున్నది. పురోహితునిచే కలశస్థాపన చేయించి వ్రతానుష్ఠానమును ప్రారంభించవలెను. పుత్రప్రాప్తి కొరకు కూష్మాండ, నారికేళ, జంబీర, శ్రీ ఫలములను, శ్రీహరికి అర్పింపవలెను. సంపద వృద్ధినొందుటకు మంజీరాది ఉత్తమ వాద్యములను, శ్రీహరికి వినిపింపవలెను. శ్రీహరికి భక్తి పూర్వకముగ చక్కెర పొంగలి సమర్పింప వలెను. సుగంధి పుష్పములతో ఒక లక్ష హారములను శ్రీహరికి అర్పింపవలెను. తులసీ దళములను సమర్పింపవలెను. జన్మ జన్మాంతరములందును, ధనధాన్యములు,



సమృద్ధిగా కావలెనని కోరుకొని వ్రతము చేయువారు ప్రతిదినము ఒక వెయ్యి మంది బ్రాహ్మణులకు భోజనము పెట్టవలెను. దేవీ! ప్రతిదినము పూజా సమయ మందు నూరు దోసిళుల పుష్పములు సమర్పింపవలెను. భక్తి పెంపొందుటకు నూరు మారులు ప్రణామము చేయవలెను. వ్రత కాలమందు ఆరు మాసముల వరకు హవిష్యాన్నము (పాయసము), ఐదు మాసముల వరకు ఫలహారము, ఒక పక్షము హవిర్భోజనము (నెయ్యి), ఒక పక్షము కేవలము జలమును తీసికొని వుండవలెను. అగ్నిదేవుని కొరకు నూరు అఖండ రత్న దీపములను దానమీయవలెను. రాత్రియందు కుశాసనము పరచుకొని నిత్య జాగరణ చేయుట ఉత్తమము. ఈ విధముగ వ్రతము పూర్తిచేసిన తరువాత వ్రతోద్యాపన చేయవలెను. ఒక వెయ్యి మూడువందల అరువది మంది బ్రాహ్మణులకు భోజనము పెట్టవలెను. ఒకవెయ్యి మూడువందల అరువది స్వర్ణముద్రికలు దక్షిణగా ఈయవలెను. దీని తర్వాతవ్రత సమాప్తి దినమున ఇంకొక దక్షిణకూడ చెప్పెదరు. మహేశ్వరీ! ఈ వ్రతము చేసిన సమస్త వాంఛలు తీరును. సాధ్వీ! ఈ వ్రతము అనుష్టింపుము" అని చెప్పెను.

పార్వతి "ఈ వ్రతమును ఎవరు వెల్లడిచేసిరో చెప్పుము" అనెను. "బ్రహ్మ పుత్రప్రాప్తికి ఈ పుణ్యక వ్రతమును చేయు"మని విధి విధాన మంతయు చెప్పెను. శతరూప ఈ వ్రతం అనుష్ఠించెను. ఆమెకు ప్రియవ్రతుడు ఉత్తానపాదుడు అను ఇరువురు పుత్రులు జన్మించిరి. దేవహూతి ఈ వ్రతము చేసి కపిలుడను పుత్రుని పొందెను. ఇతడు నారాయణ అంశతో ప్రకటమయ్యెను. అరుంధతి ఈ వ్రత మాచరించి శక్తిని పుత్రరూపమున పొందెను. శక్తి పత్నిచే ఈ వ్రతము చేయింపగా, పరాశరుడను పుత్రుడు గలిగెను. అదితి ఈ వ్రతమాచరింపగా వామనుడను పుత్రుడుదయించెను. శచీదేవి ఈ వ్రతము చేయగా, జయంతుడను పుత్రుడు గలిగెను. ఈ వ్రతము చేసిన ఉత్తానపాద పత్నికి ధృవుడును, కుబేరునకు నలకూబరుడను గలిగిరి. ఈ వ్రతమాచరించిన అత్రిపత్నికి చంద్రుడు, పుత్రరూపమున గలిగెను. అంగిరసుని పత్ని ఈ వ్రతము చేయగా బృహస్పతి గలిగెను. భృగుపత్ని ఈ వ్రతమాచరింపగా శుక్రుడు గలిగెను. ఇతడే దైత్యగురువు శుక్రాచార్యుడు గాన గిరిజానందినీ! ఈ పుణ్యకవ్రతము నీవు కూడ చేయుము"అని చెప్పెను.

పార్వతీదేవి వ్రతానుష్ఠానము గావించెను. శ్రీనారాయణుడు చెప్పెను. నారదుడు తిరిగి "పార్వతీదేవి ఈ వ్రతమెట్లు ఆచరించెను, గణేశుడు ఎట్లు ఉత్పన్నమయ్యెనో నాకు చెప్పవలసినది. అనెను.

నారాయణుడు ఇట్లు చెప్పెను. "నారదా! శివుడు పార్వతికి వ్రతవిధానము చెప్పి తపమాచరించుటకు వెళ్ళెను. శివుడు విష్ణు మంత్రములో లీనమైయుండును. పార్వతీదేవి శుభముహూర్తమున వ్రతము ప్రారంభించెను. ఆ సమయమందు బ్రహ్మ, విష్ణువులు సతీసమేతులై అచటికి వచ్చిరి. మహేశ్వరుడు కూడ వచ్చెను. సనత్కుమార, సనక, సనందన, సనాతన, కపిల, ఆసురి, క్రతు, హంస, వోడు, పంచశిఖ, ఆరుణి

యతి, సుమతి, వసిష్ఠ, పులహా, పులస్త్య, అత్రి, భృగు, అంగిరో, అగస్త్య, ప్రచేటో, దుర్వాస, చ్యవన, మరీచి, కశ్యప, కణ్వ, జరత్కారు, గౌతమ, బృహస్పతి, ఉతథ్య సంవర్త సౌభరి, జాబాలి, జమదగ్ని, జైగీషవ్య, దేవల, గోకాముఖ, చక్రరథ, పారిభద్ర, పరాశర, విశ్వామిత్ర, వామదేవ, ఋష్యశృంగ, విభాండక, మార్కండేయ, మృకండ, పుష్కర, లోమశ, కౌత్స, దక్ష, జాలాగ్ని, అఘమర్షణ, కాత్యాయన, కణాద, పాణిని, శెకటాయ, శంఖు, అపిశలి, శౌకల్య, శంఖాదులు, వీరుకాక ఇంకను చాలమంది మునులు, శిష్యసహితులై అచటికి వచ్చిరి. ధర్మపుత్ర నరనారాయణులను అచటికి వచ్చిరి. పార్వతి చేయువ్రతమందు దిక్పాలక, దేవ, యక్ష, గంధర్వ, కిన్నర, గణసహిత సమస్త పర్వతములు అచటనుండెను. శైలరాజు హిమవానుడు, పత్నీ, పుత్ర, బంధు, మిత్ర సహితుడై, మణి మాణిక్యరత్నములు కానుకలు తీసికొని వచ్చెను. అందు ఒక లక్ష గజరత్నములు, మూడు లక్షల అశ్వరత్నములు, పదిలక్షల గోరత్నములు, ఒక కోటి స్వర్ణముద్రికలు, నాలుగులక్షల ముక్తాహారములు, ఒకవేయి కౌస్తుభమణులు, తీపిపదార్థములు ఒకలక్ష ఉండెను. పార్వతి చేయు వ్రతమందు బ్రాహ్మణ, మనుజ, సిద్ధ, నాగ, విద్యాధర సముదాయ సన్యాసి భిక్షుక వందిగణములు నుండెను. ఆ సమయమున కైలాసపర్వత రాజమార్గము చందనముతో నింపిరి. పద్మరాగమణులతో నిర్మించిన శివమందిరమునకు మామిడాకులు కట్టిరి. కదలీ స్తంభములను పెట్టిరి. సమస్త కైలాసవాసులు పరమానందనిమగ్నులయిరి. తరువాత శంకరుడు సమస్తమైన అతిథులను ఉన్నత సింహాసనములపై కూర్చుండబెట్టి సత్కారములు గావించెను. వ్రతమందు ఇంద్రుడు, కుబేరుడు, సూర్యుడు, వరుణుడు, వడ్డించుపనిలో మునిగియుండిరి. ఆ సమయమున పెరుగు,పాలు, నూనె, తేనె, మున్నగు నదులు ప్రవహించుచుండెను. గోధుమ, బియ్యము, తదితర ధాన్యరాశులు కొండలవలె నిండియుండెను. కైలాసపర్వతముపై బంగారము, వెండి మణులు పర్వతములవలె నిండియుండెను. లక్ష్మీదేవి భోజనము తయారు చేసెను. ఇందులో పాయసము పూరీలు, బియ్యముతో పలురకములైన పదార్థములు చేసెను. దేవర్షి గణములతో నారాయణుడు భుజించెను. ఆ సమయమున లక్షమంది బ్రాహ్మణులకు భోజనమును వడ్డించిరి. కర్పూరాది సువాసిత తాంబూలములు ఇచ్చిరి. క్షీరసాగర శయనుడు విష్ణు భగవానుడు రత్న సింహాసనముపై ఆసీనుడై యుండెను. పార్థవ గణములు శ్వేత చామరములతో విసురుచుండిరి. దేవగణములు స్తుతించుచుండిరి. గంధర్వులు గీతములు నాలాపించుచుండిరి. ఆసమయమున బ్రహ్మప్రేరణతో శంకరుడు నారాయణుని "ప్రభూ! పుత్రశోకపీడితురాలయిన పార్వతి మనస్సు, దుఃఖముతో నిండియుండెను. అందువలన పుత్రుని కొరకై పుణ్యక వ్రతము చేయవలెనని సంకల్పించెను. ఈ వ్రత ఫలితముగా సతి సౌభాగ్యము, ఉత్తమ పుత్రుని యాచించుచున్నది. తత్వజ్ఞ, ఈ విషయములో మీ ఆజ్ఞయేమిటో చెప్పుము". ఇప్పుడు మిగిలిన కర్తవ్యమును కూడ చెప్పుము. అని అడిగెను.



శ్రీనారాయణుడు "పార్వతీశ్వరా! మీ పత్ని సతీదేవి సంతాన ప్రాప్తికై ఈ పుణ్యకవ్రతము చేయవలెనను కొనెను. ఈవ్రతము అనుష్ఠానము చేసిన పార్వతికి సహస్ర రాజసూయ యజ్ఞములు చేసిన ఫలితము ప్రాప్తించును. త్రిలోచనా! ఈ వ్రతమునకు సహస్ర రాజసూయ యజ్ఞ సమానధనము, వ్యయమగును. కాన ఇది అందరికి సాధ్యముకాదు. ఈ పుణ్యకవ్రత ప్రభావమున గోలోకనాథుడు శ్రీకృష్ణుడు పార్వతీ పుత్రుడుగ ఉత్పన్న మగును.ఇతడు త్రిలోకములందు గణేశనామముతో విఖ్యాతుడగును. జగద్విఘ్నములను నశింప జేయును. ఈ కారణమున ఇతని నామము "విఘ్నవిఘ్నుడు" అనబడును. పుణ్యకవ్రతమందు నానావిధ ద్రవ్యము భుజించినందున ఉదరము పెద్దదయ్యెను. అందుచే "లంబోదరుడు"అని పిలిచెదరు. శశ్వరుని దృష్టి పడి శిరస్సు తెగిపోయిన తరువాత తిరిగి ఏనుగు శిరస్సు పెట్టినందున వీనిని "గజాననుడు"అని చెప్పెదరు. పరశురాముని పరుశువుతో ఇతని దంతము ఒకటి విరిగిపోవును. అప్పుడు ఇతనికి "ఏకదంతుడు" అనిపేరు గలుగును. ఇతడు సమస్త దేవగణములకు, మనకు, జగత్తునకు పూజనీయుడగును. నావర దానముతో వీనికి అందరికంటె ముందు పూజ జరుగును. వీనిని పూజింపక, అన్యులను పూజించిన విపరీతములు జరుగును. వీని ఆవిర్భావము ఈశ్వరుని ఇచ్ఛపై ఆధారపడి యున్నదని చెప్పెను.



శంకరుడు, సమస్తదేవతలు ప్రసన్నులయిరి. తదుపరి వ్రత సమాప్తి దినమున పురోహితుడు పార్వతితో "సువ్రతురాలా, ఈ వ్రతమందు నీవు నాకు నీ పతిని దక్షిణగా నీయవలెను ఇమ్ము అనెను. పార్వతి విలపించి మూర్ఛపోయెను. అప్పుడు బ్రహ్మ,విష్ణువులు నవ్వుచు శంకరుని పార్వతి సమీపమునకు పంపిరి. శంకరుడు పార్వతితో "కళ్యాణీ లెమ్ము. నిస్సందేహముగా నీకు శుభము జరుగును. స్పృహ తెచ్చుకొని నా మాటలు వినుము దేవీ! దక్షిణ సమస్త కర్మల సారభూతము. ధర్మిష్ఠురాలు, ఈ ధర్మకర్మ యశస్సును, ఫలమును ప్రసాదించును. దక్షిణారహితమైన కర్మ నిష్ఫలమగును". అని చెప్పెను.

తరువాత విష్ణుభగవానుడు "ధర్మదేవతా, ధర్మకర్మ విషయమందు నీవు ధర్మమును రక్షింపుము. ధర్మమును పూర్తిగా పాలించిన అందరు రక్షింపబడెదరు". అని చెప్పెను.

బ్రహ్మ, పార్వతితో "ధర్మదేవతా! ఏకారణము చేతనైన ధర్మరక్ష జరుగక ధర్మ నష్టము జరిగినచో వారి కర్తవ్య వినాశము జరుగు"ననెను.

ధర్మదేవత "సాధ్వీ! పతిని దక్షిణారూపమున ఇచ్చి, నన్ను రక్షింపుము. మహాసాధ్వీ! నేను సురక్షితముగ నున్న అంతట శుభము జరుగును" అని చెప్పెను.

దేవతలు "మహాసాధ్వీ! నీవు ధర్మమును రక్షించి వ్రతమును పూర్తిచేయుము. సతీదేవీ! నీ వ్రతము పూర్తి అయిన మేము నీ మనోరథమును తీర్చెదము"అనిరి.

తరువాత మునులు "పతివ్రతా! "హవనము పూర్తిచేసి బ్రాహ్మణులకు దక్షిణాప్రదానము చేయుము". మేమందరము సన్నిహితులమై యుండగా, అమంగలమెట్లు జరుగును? అని చెప్పిరి.

సనత్కుమారుడు, "శివా! నీవు మాకు శివుని దక్షిణగా ఇమ్ము, లేనిచో ఈ వ్రత ఫలితమును తపః ఫలము వదలి పెట్టుము" అనెను". పార్వతి "దేవతలారా! నా పతిని దక్షిణగా ఇచ్చిన, నాకేమి లాభము? ప్రాణత్యాగము చేసిన తదుపరి శరీరముతో నేమి ప్రయోజనము? దృష్టిశక్తి నశించిన నేత్రములతో నేమి లాభము?పతివ్రతలకు పతి నూరుగురు పుత్రుల సమానము ఈదశయందు, పతిని ఇచ్చిన నేను పుత్రునితో నేమి సిద్ధిపొందుదును" అనెను. ఇటుల వారు వాద వివాద ములు పడుచుండ, ఆకాశమార్గమునుండి విమానమున వైకుంఠవాసి నారాయణుడు దిగి "సురగణమునులారా! శంభుడు చిరకాలమునుండి నన్ను ధ్యానించుచు తపస్సు చేయుచుండెను. పార్వతి ఈ వ్రతము లోకమునకు నేర్పుటకై చేసెను. తన కొరకు కాదు, త్రిలోకములందు వ్రతములకు, తపస్సులకు ఫలితమునిచ్చునది ఆమెయే. ఈమె మాయతోనే సమస్త ప్రాణులు మోహితులగుదురు. భూమిలేనిచో గృహ నిర్మాణము జరుగదు. అట్లే నేను కూడ శక్తిలేనిచో సృష్టి రచన చేయలేను. వైకుంఠ ములో నేను లక్ష్మీపతినై నాలుగు భుజములు ధరించి యుందును. వైకుంఠమునకు పైన ఏబది కోట్ల యోజనముల దూరమునన్న గోలోకము నా నివాసస్థానము. అచట నేను గోపీనాథ రూపముతో నుందును. ఆ ద్విభుజ ధారి గోపీనాథుని ఈ వ్రతమునే ఆరాధించెను. అతడేవ్రత ఫలితమును నిచ్చును. ఏరూపముతో ధ్యానించిన అదే రూపమున ఫలితము నిచ్చును. బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు నా అంశయే. దేవీ! నీవు శివుని దక్షిణ ఇచ్చి నీ వ్రతము పూర్తి చేయుము. తిరిగి సముచిత మూల్యము నిచ్చి, నీ పతిని తిరిగి పొందుము. గోవు విష్ణుని దేహ స్వరూపము, అదే విధముగ శివుడు విష్ణుశరీరము, అందువలన నీవు బ్రాహ్మణులకు గోమూల్యము నిచ్చి, నీ స్వామిని తిరిగి పొందుము" అని చెప్పి అంతర్థానమయ్యెను.

ఆ మాటలు విన్న పార్వతీదేవి, సనత్కుమారునకు శివుని దక్షిణారూపమున ఇచ్చెను. స్వస్తి పలుకుచు, సనత్కుమారుడు దక్షిణ గ్రహించెను. చేతులు జోడించి పార్వతి "విప్రవరా! గోమూల్యము నా పతికి సరిసమానము. ఇట్లు వేదములు చెప్పుచున్నవి. అందువలన నేను మీకు ఒక లక్షగోవులను ఇచ్చుచుంటిని, నా స్వామిని తిరిగి ఇమ్ము. పతిని పొందిన తదుపరి నేను బ్రాహ్మణులకు అనేక విధములైన దక్షిణలు ఇచ్చెదరు. ఇప్పుడు నేను ఆత్మహీనను. ఆత్మరహిత శరీరము. ఏ పనిని చేయలేదు" అని చెప్పెను.

"సనత్కుమారుడు "దేవీ! నేను బ్రాహ్మణుడను. నాకు ఒక లక్షగోవులతో ఏమిపని, నేను ఈ దిగంబరుని ముందుంచుకొని త్రిలోకములు తిరిగె"దనెను.



పార్వతి శరీర త్యాగము చేయవలెనని సంకల్పించు సరికి పార్వతీ సహిత సమస్త దేవతలకు ఆకాశమందు పరమోత్కృష్టమైన తేజః పుంజము కాన్పించెను. విష్ణువు, బ్రహ్మ, మహేశ్వరుడు, ధర్ముడు, సర్వస్వతి, లక్ష్మి, సావిత్రి, మునులు, దేవ తలు, హిమాలయుడు వరుసగా ప్రార్థించిరి. పార్వతీదేవి శ్రీకృష్ణుని అనేక విధముల స్తుతించుచు " నీవలెనుండు పుత్రుని ఇమ్మని కోరుచుంటిని. ఈ వ్రతమందు, నా స్వామిని దక్షిణా రూపమున ఇచ్చితిని. కృపాసింధూ! నాపై దయచూపుము" అని వేడుకొనెను.

శ్రీ కృష్ణుడు పార్వతికి తన స్వరూపమును చూపెను. ఆ తేజోరాశి మధ్య అందరిని మోహింపజేయు శ్రీకృష్ణుని స్వరూపము పార్వతి దర్శించెను. పార్వతికి అభీష్టసిద్ధి వరము నొసగి అంతర్ధానమయ్యెను. అప్పుడు దేవతలు సనత్కుమారుని చెంతనున్న ఉమారహిత దిగంబర శివుని పార్వతికి తిరిగి ఇచ్చిరి. అందరికిని దానములు ఇచ్చి, అందరికిని భోజనములు పెట్టిన తదుపరి పార్వతీ పరమేశ్వరులు భుజించిరి.

తదుపరి ఏకాంత సమయమున శివపార్వతులు విహరించుచుండ ఒక బ్రాహ్మణుడు ద్వారము చెంతకేగి "మహాదేవా! ఏడురోజుల వ్రతదీక్ష సమాప్తి గావించి ఆకలితో నుంటిని. నాకు భోజనము పెట్టి నన్ను రక్షింపుడు" అని వేడుచుండెను. పార్వతీ పరమేశ్వరులు, ఆ బ్రాహ్మణుని "మీ నామమేమి? ఎచట నుండి వచ్చితిరి, అతిథి శరీరమందు దేవతలు నివసించెదరు" అని అడిగిరి.

బ్రాహ్మణుడు "మీరు వేదజ్ఞాన సంపన్నులు. అమ్మా! నాకు చాల ఆకలిగ నున్నది" అనెను.

పార్వతి! "విప్రవరా! ఏమి భుజించెద"రని అడిగెను.

బ్రాహ్మణుడు "అమ్మా! మీరు పుణ్యకవ్రతము చేసిరని వింటిని. అనేక మధుర పదార్థములతో కూడిన వ్రతభోజనము చేయవలెనని వచ్చితిని. నేను మీ పుత్రుడను, నీ స్వామి సర్వసంపదల నిచ్చువాడు త్రిలోక సృష్టికర్త మరి నీవు సమస్త ఐశ్వర్యములనిచ్చు మహాలక్ష్మీ స్వరూపిణివి. అందువలన మీరు నాకు రమణీయ రత్నసింహాసనము, అమూల్య రత్నాభూషణములు, అగ్నిశుద్ధ సుందర వస్త్రములు, అత్యంత దుర్లభ శ్రీహరి మంత్రము, శ్రీహరిపై భక్తి మృత్యుంజయ నామజ్ఞానము దానశక్తి, సర్వసిద్ధులను నొసగుము. సతీమాతా! నీవు సర్వప్రధానశక్తివి అందువలన నీ కసాధ్యమైనది లేదు. మీ తపస్సు, పూజలు లోకమునకు నేర్పుట కొరకే, ప్రతి కల్పమందు శ్రీ కృష్ణుడు గణేశరూపముతో మీ పుత్రుడుగా మీ ఒడిలోనికి వచ్చును". అని చెప్పుచు అంతర్థాన మయ్యెను.

ఆ పరమేశ్వరుడు అంతర్హితుడై బాలుని రూపము ధరించి, మహాలులోపల పార్వతిశయ్యపై శయనించి యుండెను. ఇట్లు శ్రీహరి అంతర్థానమయిన తరువాత, పార్వతీ,పరమేశ్వరులు, బ్రాహ్మణుని కొరకు నాలుగు వైపుల వెదుకుచుండిరి. పార్వతి

"విప్రవరా! ఆకలితో నున్న మీరు ఎచటికి వెళ్ళితిరి" అని పలువిధముల విలపించు చున్నది.

పార్వతితో ఆకాశవాణి "జగన్మాతా! శాంతింపుము. ప్రతికల్ప మందు ఏ సనాతన జ్యోతీరూపుని గోలోకాధిపతి శ్రీకృష్ణుని ధ్యానించిరో, అతడే పుత్రరూపమున మీ మందిరమందు శయ్యపై నున్నాడు. మీ సుందర పుత్రుని చూడుము, ఎందుకు విలపించెదవు? ఆకలితో వచ్చినది బ్రాహ్మణుడు కాదు వారి వేషమున వచ్చినది జనార్ధనుడు" అని చెప్పెను.

పార్వతి తన మహలుకు వెళ్ళెను. ఆ బాలుడు స్తన్యపానమునకై "ఉమా"అను శబ్దముతో ఏడ్చుచుండెను. ఆ బాలుని గాంచిన పార్వతి, విస్మయముతో శంకరుని చెంతకేగి"ప్రాణపతీ! మీరు ప్రతి కల్పమందు ఎవనిని ధ్యానించితిరో ఆ తపస్యా ఫలదాతను చూడుడు, (పుత్) పున్నామ నరకమునుండి రక్షించు పుత్రుని ముఖము అవలోకింపుము అనెను".

పార్వతి వచనములు వినిన శివుని మనస్సు హర్ష మగ్నమయ్యెను. వెనువెంటనే సతివెంట మహలునకు వెళ్ళెను. శయ్యపై పుత్రుని చూచెను. అతడుసువర్ణమువలె ప్రకాశించుచుండెను. "నా హృదయములో మనోహర రూపముతో కనిపించుచున్న బాలుడు ఇతడే"అని, సతీదేవి పుత్రుని ఎత్తుకొని హృదయమునకు చేర్చి ముద్దాడుచు, "పుత్రా! దరిద్రునకు ధనము లభించిన ఎంత ఆనందపడునో అదే విధముగ నున్నది నా మనస్సు పుత్రుని గన్నతల్లి, చిరకాలము బయటకు వెళ్ళిన తన పుత్రుడు తిరిగి వచ్చినప్పుడు ఎంత సంతృప్తి చెందునో, నేనును ఇప్పుడు అంత సంతృప్తి జెందు చుంటిని. అంధునకు నేత్రదృష్టి ప్రార్థించిన ఎంత ప్రసన్నుడగునో, నిన్ను పొందిన నా మనస్సును అట్లే ఉన్నది. ఆకలితో నున్న మనుష్యునకు అన్నము చూచిన ఎట్లుండునో నిన్ను చూచిన నాకు అంత తృప్తిగ నున్నది".

అని పలువిధముల కొనియాడుచు స్తన్యమిచ్చెను.

శంకరుడు, ప్రసన్న మనస్సుతో బాలకుని ఒడిలోనికి తీసికొనెను. తదుపరి పార్వతీ పరమేశ్వరులు, బ్రహ్మ విష్ణువులు బ్రాహ్మణులకు పలురకముల దానముల నిచ్చిరి. తరువాత విష్ణువు బాలుని "బాలకా! నీవు దీర్ఘాయుష్కుడవై, జ్ఞానములో శివునివలే, పరాక్రమములో నావలె సిద్ధులను గలిగి యుండెదవు" అని ఆశీర్వదించెను.

బ్రహ్మదేవుడు 'వత్సా! నీవు శీఘ్రముగ సర్వపూజ్యుడవగుదువు, తొలిపూజ నీకు జరుగును" అని ఆశీర్వదించెను.

ధర్మదేవత "పార్వతీ నందనా! నావలె ధార్మికుడవై, దయాలుడవై హరిభక్తి గలిగి యుండెద"వని ఆశీర్వదించెను.



శంకరుడు, "పుత్రా! నావలె దాతవై హరిభక్తి ,బుద్ధి, విద్యా, పుణ్య, శాంతములు గలిగి జితేంద్రియుడవగుదు"వని ఆశీర్వదించెను.

లక్ష్మీదేవి "తనయా! నావలె నుండు మనోహర రూపముగల పతివ్రత నీకు పత్నిగా లభించును"అని ఆశీర్వదించెను.

సావిత్రి "నేను వేదమాతను, నీవు నా మంత్ర జపతత్పరుడవై వేదజ్ఞాని వగుదువు" అని ఆశీర్వదించెను.

సరస్వతి "పుత్రా! నావలె నీకు కవిత్వశక్తి, ధారణిశక్తి, స్మరణశక్తి, వివేచన శక్తులు ప్రాప్తించును" అని ఆశీర్వదించెను.

హిమనాధుడు "పుత్రా! నీ బుద్ధి సదా శ్రీకృష్ణుని యందు లగ్నమై యుండును" అని ఆశీర్వదించెను.

మేన "వత్సా! నీవు గాంభీర్యములో సముద్రునివలెను, అందములో కామదేవుని వలెను, ధనవంతులలో శ్రీపతి వలెను, ధర్మములో ధర్మదేవతవలెను నుండెదవని" ఆశీర్వదించెను.

వసుంధర "వత్సా! నావలె క్షమాశీలివై సర్వరత్న సంపన్నుడవై విఘ్నవినాశకు డవై శుభము లిచ్చు వాడవగుదు"వని ఆశీర్వదించెను.

పార్వతి "తనయా! నీవు తండ్రివలె మహాయోగివై, సిద్ధిప్రదాతవై, శుభకారకు డవై, మృత్యుంజయుడవై, ఐశ్వర్యశీలివై, అతి నిపుణుడవగుదు"వని ఆశీర్వదించెను.

తరువాత సమస్త దేవతలు, ఋషులు, మునులు, బ్రాహ్మణులు తదితరులంద రును ఆశీర్వదించిరి. గణేశోపాఖ్యాన శ్రవణము వలన మనుష్యులకు ఏ పుణ్యము లభించునో అట్టి ఫలము ఈ అధ్యాయ శ్రవణము వలన లభించును. ఈ మంగళా ధ్యాయము ఎవని గృహమందుండునో, వారికి గణేశుడు సమస్తమై కోరికలు తీర్చును.

సమస్త దేవతలు గణేశుని ఆశీర్వదించి ఆసీనులై యుండగా శనైశ్చరుడు గణేశుని చూచుటకు అచటికి వచ్చెను. మొదట బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులకు, దేవగణ మునిగణములకు ప్రణామములు చేసి బాలకుని చూచుటకు వెళ్ళెను. లోపలికి వెళ్ళిన శనైశ్చరుడు, బాలకుని ఒడియందు ఉంచుకొని, రత్న సింహాసనముపై నున్న పార్వతీదేవికి తలవంచి ప్రణామము చేసెను.

తలవంచియున్న శనైశ్చరుని పార్వతీదేవి "గ్రహేశ్వరా! నీవు బాలకునివైపు చూడక శిరస్సువంచి యుండుటకు కారణమేమి? అని అడిగెను.

శనైశ్చరుడు "సాధ్వీ! నా మనస్సు సదా శ్రీకృష్ణధ్యానమందు నిమగ్నమై యుండును. నా తండ్రి, చిత్రరథుని, పుత్రికతో నా వివాహము జరిపించెను. ఒక దినము ఋతుస్నానాంతరము నన్ను సమీపించెను. ఆ సమయమున నేను భగ వంతుని ధ్యానించుచుంటిని. ఆమె తన ఋతు కాలము నిష్ఫలమైనదని, నన్ను నీ దృష్టి ఎవరిపై బడినవారు నశించెదరని శపించెను. ఈ కారణమున నేను జీవహింసా

భయముతో, నా ముఖమును క్రిందకే ఉంచెదను" అని చెప్పెను. పార్వతి తదితరులు నవ్వసాగిరి.

పార్వతి శ్రీహరిని స్మరించెను. సమస్త జగత్తు ఈశ్వరుని ఇచ్ఛకు వశీభూతమై యున్నది అనుకొని దైవవశీభూత అగు పార్వతీదేవి శనైశ్చరునితో "నీవు నా బాలకుని వైపు చూడుము, కర్మఫల భాగమును ఎవ్వరును తొలగించలేరు" అనెను.

శనైశ్చరుడు మనస్సునందు "ఆహా! యేమి చేయుదును, నేను పార్వతీనందనుని చూచిన నిశ్చయముగా వానికి అరిష్టము జరుగును"అని వాపోవుచు, తన ఎడమ కంటికొనతో శిశు ముఖమును గాంచెను. శనిదృష్టి పడినవెంటనే శిశువు శిరస్సు తెగిపోయెను. మొండెము పార్వతి ఒడియందు పడెను. శిరస్సు గోలోకములో శ్రీకృష్ణుని యందు ప్రవిష్టమయ్యెను.

ఇది చూచిన పార్వతి విలపించసాగెను. సమస్త దేవతలు ఆశ్చర్యచకితులైరి. అప్పుడు శ్రీహరి గరుడ వాహనముపై ఉత్తరదిశగా పుష్పభద్రానదీ తీరమునకు వెళ్ళెను. ఆ నదీతీరమందు ఒక గజేంద్రుడు నిద్రించుచుండెను. వాని శిరస్సు ఉత్తర దిశగా నుండెను. శ్రీహరి సుదర్శన చక్రముతో వాని శిరస్సు ఖండించి, గరుడనిపై పెట్టుకొని పార్వతీ నివాస స్థానమునకు వచ్చి గణేశుని మొండెమునకు ఆ గజమస్తకమును కలిపి జీవింపజేసెను.

పార్వతీదేవి శనైశ్చరుని "అంగహీనుడవయ్యెద"వని శపించెను.

తరువాత విష్ణువు గణేశుని పూజించి "సురశ్రేష్ఠా! నేను అందరికంటె ముందు నిన్ను పూజించితిని. అందుచేత నీవు సర్వపూజ్యుడవు యాగీంద్రుడవగుదువు" అని చెప్పి తన మెడలోని వనమాలను తీసి అతని మెడలో వేసెను.

తరువాత సమస్త సిద్ధులనొసగి, తనతో సమానుని చేసెను. విఘ్నేశ్వరుడు, గణేశుడు, హేరంబుడు, గజాననుడు, లంబోదరుడు, ఏకదంతము, శూర్పకర్ణుడు, వినాయకుడు ఈ ఎనిమిది నామములతో నామకరణము గావించెను. తరువాత సమస్త దేవతలు, మునులు, ఆశీర్వదించి పూజించిరి.

(బ్రహ్మవైవర్త పురాణము)

## పుష్యమాస వ్రతములు

## 91. పుష్యమాస మాహాత్మ్యము-వివిధ వ్రతవిధానములు

పుష్యమందు ధనుర్మాసము వచ్చును. ఇది భగవత్పూజకు విశేషమైనది. పుష్యమాస కృష్ణపక్ష అష్టమినాడు శ్రాద్ధముచేసి బ్రాహ్మణునకు భోజనముపెట్టిన ఉత్తమ ఫలము లభించును. పుష్య కృష్ణ ఏకాదశినాడు ఉపవాసముండి భగవానుని పూజించవలెను. దీనిని సఫల ఏకాదశియందురు. ఈ వ్రతముచేసిన సమస్త కార్యములు సఫలమగును. పుష్యమాస కృష్ణద్వాదశినాడు సురూపా ద్వాదశీ వ్రతము



చేయుదురు. దీనియందు పుష్యనక్షత్ర యోగమున్న విశేష ఫలదాయిని యగును. సౌందర్యమునకు సుఖమునకు సంతానమునకు సౌభాగ్యప్రాప్తికి దీనిని అనుష్ఠానమబు చేయుదురు.

విష్ణుధర్మోత్తర పురాణమందు పుష్యశుక్ల ద్వితీయ తిథినాడు ఆరోగ్యముకొరకు ఆరోగ్య వ్రతముచేయుదురని యుండెను. ఈ దినమున గోవుల కొమ్ములను కడిగిన జలముతో స్నానముచేసి తెల్లని వస్త్రము ధరించి సూర్యుడు అస్తమించిన తరువాత చంద్రుని పూజించవలెను. బెల్లముతో పరమాన్నమును చేసి బ్రాహ్మణునికి పెట్టి, సంతుష్ట పరచవలెను.

మజ్జిగను మాత్రమే త్రాగి, నేలపై పరుండవలెను. ఈవిధముగ శుక్లపక్ష ద్వితీయ తిథినాడు ఒకసంవత్సరమంతయు చంద్రుని పూజించి, మార్గశిర మాసమున చెరకు రసముపోసిన కుండను సువర్ణాది వస్త్రములను బ్రాహ్మణునకు దానమీయవలెను. భోజనముతో సంతుష్టుని గావించవలెను. ఈ విధముగచేసిన రోగనివృత్తులై ఆరోగ్యవంతులగుదురు.



పుష్యశుక్ల సప్తమిని మార్తండ సప్తమియందురు. ఈ దినమున సూర్యుని పూజించి, గోదానముచేసిన ఉత్తమ ఫలప్రాప్తి గలుగును. పుష్యశుక్ల ఏకాదశి పుత్రదానమముతో ప్రసిద్ధిగాంచినది. ఈ దినము ఉపవాసముండిన సులక్షణములు గల పుత్రుడు కలుగును. భద్రావతీ నగరరాజు వసుకేతుడు ఈ వ్రతముచేసి సర్వగుణ సంపన్నుడైన పుత్రుని పొందెను. పుష్యశుక్ల త్రయోదశినాడు భగవానుని పూజించి ఘృతదానము (నెయ్యి) చేసిన విశేష ఫలముగలుగును. మాఘమాస స్నానము పుష్యమాస పూర్ణిమనుండి ప్రారంభమగును.

ఈదినము ప్రాతఃకాలస్నానానంతరము మధుసూదన భగవానునినకు స్నానముచేయించి, సుందరమైన వస్త్రములను కట్టవలెను. కిరీటము కుండలములు హారములు వేయవలెను. తిలకముపెట్టి పుష్పమాలలు వేయవలెను. ధూపదీప నైవేద్యములుపెట్టి పూజించి హారతి నీయవలెను. బ్రాహ్మణునకు భోజనముపెట్టి దక్షిణతాంబూల మీయవలెను. ఈ వ్రతముచేసిన దివ్యలోకము ప్రాప్తించును.

పుష్యమాసము ఆదివారము ఈవ్రతమును చేసిన సూర్యుని పూజంచి అర్ఘ్య మీయవలెను. ఉప్పులేక ఒక్కపూట భుజించవలెను.

## మాఘమాసవ్రతములు

## 92. మాఘమాస వ్రతపర్వోత్సములు-వివిధ మాఘమాస మాహాత్మ్యము

**(దీనిని చాంద్రమాస మనియు అందురు)**

**భీష్ముడు అంపశయ్యపై నున్నప్పుడు ధర్మరాజుతో అనిని మాటలు, సూర్యభగవానుడు దక్షిణాయనము నుండి, ఉత్తరాయణమునకు వచ్చెను. ఈ బాణశయ్యపై శయనించినేటికి 58 దినములైనది. నాకిది నూరు సంవత్సరములవలె నుండెను. చాంద్రమాసానుసారము మాఘమాసము వచ్చెను. శుక్లపక్షము జరుగుచున్నది. ఇది ఒక భాగము గడిచెను. ఇంక మూడు భాగములుండెను.**

మాఘానక్షత్రముతోకలిసి పూర్ణి యున్నందున ఈ మాసమునకు మాఘమను నామము కలిగెను. ఈ మాసమున శీతల జలమందు స్నానముచేసిన పాపవిముక్తులై స్వర్గమునకు వెళ్ళుదురు. మాఘమాహాత్మ్యమును తులసీదాసు రామచరిత మానస మందు వ్రాసెను.

పద్మపురాణ ఉత్తరఖండమునందు మాఘమాస మాహాత్మ్యమును వర్ణించిరి. ఈ మాసమందు స్నానము చేసినంతనే స్వర్గము లభించును. మాఘపూర్ణిమనాడు బ్రహ్మవైవర్తపురాణమును దానముచేసిన బ్రహ్మలోకము ప్రాప్తించును. (మత్స్య పురాణము). ఈ మాసమందుస్నాన దాన ఉపవాసములుచేసి మాధవుని పూజించిన అత్యంత ఫలదాయకమైనది.

మాఘమాస అమావాస్యయందు మాఘస్నానము ప్రయాగలోచేసిన మూడు కోట్ల పదివేల అన్యతీర్థములు ఈ తీర్థమందు సమాగమమగును. మాఘస్నానము ప్రయాగలో చేసిన పాపముక్తులై స్వర్గమునకు వెళ్ళుదురు. నువ్వులను దానము చేయవలెను,(మహాభారతము)

ఈ మాసమందు ఒకేపూట భుజించినవారు ధనవంతుల ఇంటిలో జన్మించె దరు. మాఘమాస ద్వాదశీతిథినాడు రాత్రి పగలు ఉపవాసముండిన మాధవుని (మహాభారతము) పూజించిన రాజసూయ యజ్ఞఫలముదక్కును.

మాఘ మాసమున సూర్యుడు మకం ాశియందున్నప్పుడు అవశ్యము స్నానము చేయవలెను. మాఘ మాసమున జలము గంగా జలముతో సమాన మగును. ప్రయాగ కాశీ నైమిషారణ్యము కురుక్షేత్రము, హరిద్వారము, మహాపుణ్య ప్రదమైనవి. ఇచట నదీస్నానములు విశేష మైనవి.

ప్రయాగ గురించి పద్మపురాణమందొక కథ గలదు.

ప్రాచీనకాలమున నర్మదానదీతీరమున సువ్రవతుడను నొక బ్రాహ్మణు డుండెను. ఇతడు వేదవేదాంగ పారంగతుడు. ఇతడు తర్కశాస్త్ర జ్యోతిష గజవిద్య, అశ్వవిద్య, మంత్రశాస్త్ర సాంఖ్యాశాస్త్ర, యోగశాస్త్రాది అరువదినాలుగు (64) కళలను అభ్యసించెను. ఇతనికి అనేక దేశభాషలు లిపితో సహా తెలిసినవాడు, ఇంతటి వాడైయుండియు తన జ్ఞానమును ధర్మకార్యములకు వినియోగించలేదు. జీవి తాంతము ధనముకూడ బెట్టుటే సరిపోయెను. చాండాలుని దగ్గరకూడ దానము గ్రహించుటకు సంకోచించలేదు.

ఈ విధముగ ఇతడు ఒక లక్ష స్వర్ణముద్రలను ఆర్జించెను. ధనోపార్జనతోనే వృద్ధుడయ్యెను. ఇంద్రియములు శిథిలమయ్యెను.

అప్పటికి జ్ఞానోదయమయ్యెను. నేనెట్టి సత్కర్మయు చేయలేదు. నాకేవిధముగ సద్గతి కలుగునని పశ్చాత్తాపాగ్నితో దహించుచుండెను. ఇట్టి సమయమున దొంగలు పడిధనమంతయు దోచుకొని పోయిరి. ధనము శాశ్వితకాదనియు శాశ్వితమైనది



పరలోకగమనమనియు బోధపడెను. వ్యాకులచిత్తుడై ఆలోచించుచుండ అర్థశ్లోకము స్ఫురించెను.

మాఘే నిమగ్నాః సలిలే సుశీతే విముక్త పాపా స్త్రిది వం ప్రయాన్తి॥

సువ్రతునకు తాను ఉద్ధరింపబడుటకు మూలమంత్రము లభించెను. మాఘమాస స్నానసంకల్పము చేసుకొనెను. వెళ్ళి నర్మదా నదిలో స్నానము చేసెను. ఈ విధముగ తొమ్మిది దినములు నర్మదా నదీజలమందు స్నానముచేసెను. పదియవ దినము స్నానానంతరము అశక్తుడయ్యెను. చలికి వణకుచు ప్రాణమును త్యజించెను. ఇతడు జీవితములో ఎట్టి సత్కర్మయు చేయలేదు. పాపముతో ధనముకూడ బెట్టెను. ఐనను మాఘమాసస్నానముతో పశ్చాత్తాపముతో నిర్మలుడై ప్రాణమును త్యజించెను. ఇతని కొరకు దివ్యమైన విమానము వచ్చెను. ఇతడు దాని పైకూర్చుండి స్వర్గలోకము నకు వెళ్ళెను.

ఈవిధముగ మాఘస్నామునకు అపూర్వమైన మహిమగలదు. అశక్తులై మాసమంతయు చేయలేనివారు మూడుదినములైనను, అదియు చేయలేనివారు ఒక్కదినమైనను మాఘస్నాన వ్రతమును పాటించవలెను. ఈ స్నానమాచరించిన వారు స్వర్గమున కేగుదురు.



## 93. షట్ తిలా ఏకాదశి (మాఘకృష్ణ ఏకాదశి)

మాఘ మాస కృష్ణ పక్ష ఏకాదశిని షట్‌తిల ఏకాదశి యందురు. ఈదినమున నువ్వులను ఆఱు విధములుగ ఉపయోగించెదరు. అందువలన దీనికి పేరు వచ్చెను. నువ్వులు వేసుకొని ఆ జలముతో స్నానముచేయుట, నువ్వులనూనెను శరీరమునకు పూసుకొనుట, నువ్వులతో యజ్ఞముచేయుట, నువ్వులు కలిసిన జలమునుత్రాగుట, నువ్వులు కలిసిన భోజనము, నువ్వులదానము ఈ ఆరు చేయువారికి సమస్త పాపములు నశించును. ఈ దినమున నల్లని నువ్వులను, నల్లని గోవునుకూడ దానమిచ్చెదరు.

ఈ దినమునస్నాము చేసి శ్రీకృష్ణనామ మంత్రము జపించి, ఉపవాసముండ వలెను. నువ్వులతో యజ్ఞముచేసి భగవానుని పూజించి జాగరణ చేయవలెను. నైవేద్య మందు నువ్వులను కలుపవలెను. బ్రాహ్మణునకు కూడ దీనిని పెట్టవలెను. ఈ విధముగ వ్రతముచేసిన సమస్త కోరికలు తీరును.

ఒక బ్రాహ్మణ స్త్రీ ఈ వ్రతముచేసి ఉపవాసముండి, పతిసేవాఫలముతో వైకుంఠ మును పొందెను. ఈమె శివుని మట్టితో చేసుకొని, మట్టితో మందిరమును కూడ చేసుకొనెను. అందువలన వైకుంఠమందు ఈమెకు సుందరమైన మట్టి ఇల్లు లభిం చెను. ఈమె యేదియు దానముచేయని కారణమున వైకుంఠమందు అన్నము ప్రాప్తించలేదు. అప్పుడీమె భగవానుని ఆజ్ఞతో షట్‌తిలావ్రతము చేసెను. దీని ప్రభావ మున ఈమెకు సమస్తము ప్రాప్తించెను.

## 94. మౌన అమవాస్య (మాఘ అమావాస్య)

మాఘ మాస కృష్ణ పక్ష అమావాస్యను మౌనీ అమావాస్య యందురు. ఈ తిథినాడు మౌనముగ నుండి మునుల వలె వ్యవహరించవలెను. ఈ దినము సోమవారముతో కలసి వచ్చిన అధిక మహిమగలదగును. ఈదినమున (అమావాస్య) నిత్యకర్మనివృత్తులై నువ్వులను, నువ్వుల లడ్డూలను, నువ్వులనూనెను, ఉసిరికాయలను వస్త్రాదులను దానము చేయవలెను.

ఈ దినము సాధువులను మహాత్ములను బ్రాహ్మణులను సేవించవలెను. కంబళి వస్త్రాదులను దానము చేయవలెను. నల్లనువ్వులను బెల్లముతో కలిపి లడ్డూలనుచేసి వానిని ఎర్రని వస్త్రములో చుట్టి బ్రాహ్మణునకు దానమీయవలెను. బ్రాహ్మణునకు భోజనముపెట్టి దక్షిణనీయవలెను.

ఈ దినమున శ్రాద్ధాదులను కూడచేయువిధానము కలదు. మౌనీ అమావాస్య నాడు ఆదివార వ్యతీపాతయోగ శ్రవణానక్షత్ర అర్ధోదయ యోగములున్న ఆసమయ మందు సమస్త స్థలములందున్న జలము గంగాజలమగును. బ్రాహ్మణులు బ్రహ్మ సంన్నిభశుద్ధాత్ములగుదురు. ఈ యోగమందు యేకొద్ది దానము చేసినను దాని ఫలము మేరసమానమగును.



## 95. సరస్వతిపూజా మహోత్సవము-వసంత పంచమి

### (మాఘ శుక్ల పంచమి)

భారతీయ సంస్కృతిలో వ్రత పర్వములకు ఉత్సవములకు గొప్ప ప్రతిష్ఠ గలదు. మాఘశుక్ల పంచమినాడు వచ్చు సారస్వతోత్సవము అనుపమానమైనది.

భగవతి సరస్వతి విద్య బుద్ధి జ్ఞానములకు అధిష్ఠాత్రిదేవి, శాస్త్రజ్ఞాన ప్రదాయిని, భగవతి శారదకు మూలస్థానము శశాంకసదనము అమృతమయ ప్రకాశ పుంజము. తన ఉపాసకులకు నిరంతరము ఏబది (50) అక్షర రూపములలో జ్ఞానామృత ధారలను ప్రవహింపజేయును.

ఈమె శుద్ధ జ్ఞానమయురాలు ఆనందమయురాలు, ఈమె దివ్యతేజస్సు అపరిమేయమైనది. శబ్దబ్రహ్మరూపమున స్తుతింపబడునది. సృష్టికాలమందు ఈశ్వరుని ఇచ్ఛతో ఆద్యాశక్తి (ఆదిశక్తి) ఐదుభాగములుగ విభక్తి చెందెను. ఈమె రాధ పద్మ సావిత్రి దుర్గ సరస్వతి రూపములతో శ్రీకృష్ణభగవానుని అంగములనుండి ప్రకటమయ్యెను.

శ్రీకృష్ణుని కంఠమునుండి సరస్వతిగ ఉత్పన్నురాలయ్యెను.

"శ్రీదుర్గాసప్తశతి" యందును, శ్రీమద్దేవీభాగవతమందును ఆద్యాశక్తి మూడు భాగములుగ విభక్తమయ్యెను. ఈమె మహాకాళి మహాలక్ష్మి మహాసరస్వతీ నామములతో ఖ్యాతిగాంచెను.



భగవతి సరస్వతి సత్త్వగుణ సంపన్నురాలు. ఈమెకు అనేక నామములు గలవు. వాక్ వాణి గీః గిరా భాషా శారదా వాచా ధీశ్వరి వాగీశ్వరి బ్రాహ్మీ గౌ సోమలత వాగ్దేవి వాగ్దేవతాది నామములు ప్రసిద్ధిమైనవి. వాగ్దేవి సౌమ్యగుణదాత్రి, వసు-రుద్రాదిత్యాది దేవతలను రక్షించునది, లోకహితమునకు వాదించునది, సృష్టి నిర్మాణ కార్యము నిర్వహించునది, జగదీశ్వరి, వాగ్దేవి సమస్త సుఖములను లభింపజేయును.

ఈమె అనుగ్రహము వలననే జ్ఞానము, విజ్ఞానములు గలుగుచున్నవి. మేధావులగుచున్నారు. మహర్షి, బ్రహ్మర్షిలగుచున్నారు. ఈమె సర్వత్ర వ్యాపించి యుండును. వాగ్దేవి బ్రహ్మ స్వరూపురాలు కామధేను స్వరూపురాలు, సమస్త దేవతలకు ప్రతినిధియైనది.

అమిత తేజస్విని అనంత గుణశాలినియైన సరస్వతీదేవిని పూజించుటకు ఆరాధించుటకు మాఘ మాస శుక్ల పక్ష పంచమీతిథి నిర్ధారణ చేయబడినది. వసంత పంచమి ఈమె ఆవిర్భావ దినము, అందువలన వాగీశ్వరీ జయంతి, శ్రీపంచమి, నామములతో ఈ తిథి ప్రసిద్ధిగాంచెను. ఈ దినమున విశేషముగ పూజించి వ్రతోత్సవమును చేయుదురు. ఈ దినమున బాలకులకు అక్షరాభ్యాసము చేయుదురు. ఈ తిథి నాడు విద్యారంభముచేసి సరస్వతిని పూజించెదరు.

**మాఘస్య శుక్లపంచమ్యాం విద్యారంభ దినేఽపిచ ।**
**పూర్వే ఽహ్ని సంయమం కృత్వా తన్నాహ్ని సంయతఃశుచిః॥**

(బ్రహ్మపురాణము)

సర్వస్వతీ రహస్యోపనిషత్, ప్రపంచసార, శారదాతిలకాది గ్రంతములలో సరస్వతీ దివ్య స్వరూపమును, ఉపాసనావిధిని వర్ణించిరి. సరస్వతిని ఉపాసించువారు మాఘమాస శుక్లపక్ష పంచమి తిథి ప్రాతఃకాలమున సరస్వతిని పూజించవలెను. పంచమి ప్రాతఃకాలమందు లేచి నిత్యకర్మ నివృత్తులై కలశమును స్థాపించి వాగ్దేవతను ఆవాహనముచేసి విధిపూర్వకముగ సరస్వతిని పూజించవలెను. స్వయముగ చేయలేని వారు కుల పురోహితులతో ఈ కార్యమును నిర్వహించుకొనవలెను.

గణేశాదులను పూజించి కలశమును స్థాపించి సరస్వతిని ఆవాహనము చేయవలెను. వైదిక, పౌరాణిక మంత్రములనుచ్ఛరించుచు ఉపచార వస్తువులను భగవతికి సమర్పించవలెను.

సరస్వతీ అష్టాక్షర మంత్రమైన మూలమంత్రముతో "శ్రీం హ్రీం సరస్వత్యై స్వాహా" అను ఈ అష్టాక్షర మంత్రముతో ప్రతి వస్తువును సరస్వతికి సమర్పించవలెను. అనంతరము దేవికి హారతి నిచ్చి స్తుతించవలెను.

**యాకున్దేన్దు తుషార హారధవలా యా శుభ్రవస్త్రావృతా**
**యావీణా వరదండ మండితకరా యా శ్వేత పద్మాసనా ।**
**యా బ్రహ్మాచ్యుత శంకర ప్రభృతి భిర్దేవైః సదా వన్దితా**
**సామాం పాతు సరస్వతీ భగవతీ నిఃశేషజాడ్యాపహా ॥**

**శుక్లాం బ్రహ్మ విచార సార పరమామాద్యాం జగద్వ్యాపినీం**
**వీణా పుస్తక కధారిణీ మభయదాం జాడ్యాన్ధ కారాపహామ్ ।**
**హస్తే స్ఫాటిక మాలికాం విదధతీం పద్మాసనే సంస్థితాం**
**వన్దే తాం పరమేశ్వరీ భగవతీ బుద్ధి ప్రదాం శారదామ్ ॥**

అని స్తుతించిన తరువాత భగవతికి నివేదన చేసిన గంధపుష్ప మృష్టాన్నాది ప్రసాదమును గ్రహించవలెను. పుస్తకమందును లేఖని యందును సరస్వతీదేవి యుండును. ఇది ఆమెకు నివాస స్థానములు. సర్వస్వతి సత్త్వగుణముతో ఉత్పన్న మైనది గాన ఈమెను పూజించునవి శ్వేత వర్ణములై యుండవలెను. పుష్పములు, పాలు, పెరుగు, వెన్న, తెల్లనువ్వులతో లడ్డూలు, శ్వేతచందనము, శ్వేతవస్త్రము, శ్వేత అలంకార ఆభరణములు (వెండివి) నారికేళఫలము మొదలగున (శ్వేతవర్ణము గలవి)వి సమర్పించవలెను.

శ్రీమన్నారాయణ భగవానుడు వాల్మీకికి సరస్వతీ మంత్రము నుపదేశించెను. దానిని జపించుటవలన వానికి కవిత్వశక్తి గలిగెను. భగవానుడు ఉపదేశించిన అష్టాక్షరమంత్రము–

"శ్రీం హ్లీం సరస్వత్యై స్వాహా" అను ఈ మంత్రమును నాలుగు లక్షలు జపించిన మంత్రసిద్ధి కలుగును. వాల్మీకి వ్యాస వసిష్ఠ విశ్వామిత్ర శౌనకాదులందరు ఈ సాధనతో కృతార్థులైరి. సరస్వతీ ఉపాసనతో కాళిదాసు ఖ్యాతి గాంచెను. గంగ పాపహారిణి, సరస్వతి అవివేక హారిణి, ధనములలో విద్యాధనమే అమృతపానము వంటిది. (నశించునది)

వేదపురాణ రామాయణ గీతాది గ్రంథములు దేవీ వాంగ్మయ మూర్తులు. వీనిని పవిత్రమైన స్థానములందుంచవలెను. అపవిత్ర స్థానములందుంచరాదు. అపవిత్రావస్థయందు తాకరాదు, అనాదరముతో విసరి కొట్టరాదు. ప్రాతః కాలమందే లేచి సరస్వతిని ధ్యానించవలెను. విద్యార్థులు అవస్యము సరస్వతిని పూజించవలెను. సరస్వతీ మహిమ అపారమైనది. సరస్వతి ద్వాదశనామాలు త్రిసంధ్యలందు పఠించిన సరస్వతివారి జిహ్వాగ్రముపై విరాజమానమైయుండును.

**ప్రథమం భారతీనామ ద్వితీయం చ సరస్వతీ ।**
**తృతీయం శారదాదేవీ చతుర్థం హంసవాహినీ ॥**
**పంచమం జగతీ ఖ్యాతా షష్ఠం వాగీశ్వరీ తథా ।**
**సప్తమం కుముదీ ప్రోక్తా అష్టమం బ్రహ్మచారిణీ ॥**
**నవమం బుద్ధి ధాత్రీ చ దశమం వరదాయినీ ।**
**ఏకాదశం చన్ద్ర కాన్తి ర్ద్వాదశం భువనేశ్వరీ ॥**
**ద్వాదశైతాని నామానిత్రి సంధ్యం యః పఠేన్నరః।**
**జిహ్వాగ్నే వసతే నిత్యం బ్రహ్మరూపా సరస్వతీ ॥**



## 96. అచలా సప్తమీ వ్రతము

### (మాఘశుక్ల సప్తమి (రథసప్తమి)

అచలా సప్తమి పురాణములందు రథసప్తమి, భాను అర్క మహతీ పుత్రసప్తమి మొదలగు నామములతో ఖ్యాతి గాంచినది. భవిష్యపురాణమందు అచలా సప్తమీ వ్రత మాహాత్మ్యమును విధానమును సంక్షేపముగ వాసిరి.

ఒకమారు ధర్మరాజు శ్రీకృష్ణునితో "భగవాన్! మీరు సమస్త ఫలమును ప్రసాదించువారు. మాఘస్నాన విధానమును చెప్పిరి. కాని ప్రాతఃకాలస్నానముచేయ లేనివారు యేమిచేయవలెను? స్త్రీలు అతి సుకుమారులు. వారు ఈ మాఘ స్నానకష్టమును (చలిని) సహించుటెట్లు? అందువలన యేదేని ఉపాయము చెప్పుడు. వారికి సౌభాగ్య సంతాన పుణ్యములెట్లుగలుగునో చెప్పు"మనెను.

శ్రీకృష్ణుడు, "మహారాజా! చెప్పుచున్నాను వినుము. ఇది"చేసిన సమస్త ఫలములు ప్రాప్తించును.

**కథ:–** మగధ దేశమందు ఇందుమతి యను ఒక రూపవతియైన వేశ్యయుం డెను. ఒకానాడామెలో పరివర్తన గలిగెను. ఈ సంసారసాగరమునుండి నేనెట్లు తరించవలెను. నేనెట్టి సత్కర్మలు చేయలేదు. స్త్రీ పుత్ర గృహక్షేత్ర ధనాది చింతనతో మనుష్యుల ఆయువు గడచి పోవుచున్నది.

అని పలువిధముల ఆలోచించుచు ఆ వేశ్య వశిష్ఠ మహర్షి ఆశ్రమమునకు వెళ్ళెను. నమస్కారముచేసి చేతులు జోడించి ఇట్లడిగెను.

"భగవాన్! నేను ఎట్టి దాన జప తప వ్రత ఉపవాసాది సత్కర్మలు చేయలేదు. శివ విష్ణు వాదిదేవతలను ఆరాధించ లేదు. మరి నేనెట్లు తరించగలను. మిమ్ము శరణు వేడుచున్నాను. నన్ను ఉద్ధరించు"డని వేడుకొనెను. "వశిష్ఠుడు వరాననే! నీవు మాఘమాస శుక్ల పక్ష సప్తమి"నాడు స్నానము చేయుము. దీనివలన రూప సౌభాగ్య సద్గతి ఆది సమస్త ఫలములు ప్రాప్తించును. షష్ఠి రోజు ఒక్కపూట భోజనము చేసి, సప్తమి ప్రాతఃకాలమున నదీతీరమునకుగాని జలాశయమునకుగాని వెళ్లి స్నానముచేసి దీపదానము చేయుము. దీనివలన నీకు శుభము గలుగు"నని చెప్పెను.

వశిష్ఠుడు చెప్పిన మాటలను వినిన ఇందుమతి తన గృహమునకు తిరిగి వచ్చి, స్నానధ్యాన దానము లాచరించెను. సప్తమీస్నాన ప్రభావమున సంసార సుఖములనుభవించి, దేహత్యాగానంతరము. ఇంద్రుని అప్సరసలలో ప్రధాననాయికా పదవిపై అధిష్ఠితురాలయ్యెను.

ధర్మరాజా! షష్ఠీదినమున ఏకభుక్తముతో సూర్యనారాయణుని పూజించవలెను. మరి సప్తమి ప్రాతఃకాలమున స్నానముచేసి సువర్ణ, వెండి, తామ్ర పాత్రలలో నువ్వుల నూనెనుపోసి దీపారాధన చేయవలెను. ఆ దీపమును శిరస్సుపై పెట్టుకొని సూర్యుని ఈ విధముగ ధ్యానించవలెను.

నమస్తే రుద్రరూపాయ రసానాంపతయే నమః ।
వరుణాయ నమస్తే ఽస్తు హరివాస నమోఽస్తుతే॥
యావజ్జన్మ కృతం పాపం మయా జన్మసు సప్తసు ।
తన్మేరోగం చ శోకం చ మాకరీ హన్తు సప్తమీ॥
జననీ సర్వభూతానాం సప్తమీ సప్త సప్తికే ।
సర్వవ్యాధిహరే దేవి నమస్తే రవి మండలే ॥

అనంతరము దీపమును జలమందు విడువవలెను. మరల స్నానముచేసి దేవత లకు పితరులకు తర్పణము గావించవలెను. చందనముతో అష్టదళ కమలము నిర్మించి, ఆ కమలమందు శివపార్వతులను స్థాపించి ప్రణవ మంత్రముతో పూజించి అష్టదళములందు భాను రవి వివస్వాన్ భాస్కర సవిత అర్క సహస్రకిరణ, సర్వాత్ముని పూజించవలెను. ఈ నామములకు ఆదిలో ఓంకార చతుర్థీ విభక్తిని, అంతమున నమః పదమునుచేర్చి "ఓం భానవే నమః ఓం రవయే నమః అనుచు ఈవిధముగ పుష్ప ధూపదీప నైవేద్య వస్త్రాది ఉపచారములతో సూర్యభగవానుని పూజించవలెను. "స్వస్థానం గమ్యతామ్" అనుచు విసర్జించవలెను.



అనంతరము (తామ్ర పాత్రలోగాని, మట్టిపాత్రలోగాని బెల్లము నెయ్యి నువ్వుల చూర్ణమును, మరియు సువర్ణతాలపత్ర కర్ణాభరణమును చేయించి పాత్రలో ఉంచవలెను. దీనిపై ఎఱ్ఱ వస్త్రమును కప్పి పుష్ప దీపాదులతో పూజించి ఆ పాత్రను దౌర్భాగ్యము దుఃఖము నశించవలెనను ఉద్దేశ్యముతో బ్రాహ్మణునకు దానమీయవలెను.

గురువునకు వస్త్రమును నువ్వులను గోవును దక్షిణతో సహా సమర్పించవలెను. తరువాత శక్త్యానుసారము ఇతర బ్రాహ్మణులకు భోజనముపెట్టి వ్రతము సమాప్తము చేయవలెను. దీనిని చెప్పువారు, వినువారు ఉపదేశముచేయువారు ఉత్తమ లోకమునకు అవశ్యము వెళ్ళుదురు. అని భగవానుడు చెప్పెను.

## 97. భీష్మాష్టమి (మాఘ శుక్ల అష్టమి)

మాఘమాస శుక్ల పక్ష అష్టమి భీష్మాష్టమి నామముతో ప్రసిద్ధి చెందినది. ఈ తిథినాడు బాలబ్రహ్మచారి భీష్మ పితామహుడు సూర్యుడు ఉత్తరాయణము వచ్చినంతనే తన ప్రాణమును విడచెను. ప్రతిహిందువు భీష్మ పితామహునకు దర్భలు నువ్వులు జలమును తీసుకొని తర్పణము గావించవలెను.

**కథ:–** భీష్మపితామహుడు హస్తినాపుర రాజైన శన్తనుని పుత్రుడు. దేవనది భాగీరథీశ్రీగంగ భీష్మునితల్లి, బాల్యమున ఇతనిపేరు దేవవ్రతుడు. ఇతడు దేవగురువైబృహస్పతి దగ్గర శాస్త్రములను, పరశురామునివద్ద అస్త్రశస్త్రములను శిక్షణ పొందెను. వీనితో సమానమగు వారు లేరు. శాస్త్రములు శస్త్రములు కూడలేవు. గొప్పవీరుడు, సదాచారుడు, ధార్మికుడు, అన్ని విదముల యోగ్యుడని తలచిన శన్తనుడు వీనిని యువరాజుగ ప్రకటించెను.



ఒకమారు శన్తన మహారాజు విహారమునకు వెళ్ళెను. అచట మత్స్య గంధి యను నొక నిషాదకన్యను చూచెను. ఈమె పరాశర ఋషి వరదానముతో అపూర్వ లావణ్యవతి అయ్యెను. ఈమె శరీరమునుండి కమల సుగంధము ఒక యోజన దూరమువరకు వ్యాపించుచుండెను. శంతన మహారాజు ఆమె రూపలావణ్యములకు ముగ్ధుడయ్యెను. ఇతడు ఆమె తండ్రియైన నిషాదరాజును ఆకన్యనిమ్మని యాచించెను. నిషాద రాజు ఒక షరతు పెట్టెను. ఈ కన్యకు పుట్టిన పుత్రుడే రాజ్యమునకు అధికారి కావలె (రాజు) నని.

శన్తనునకది అనుచితమనిపించెను. ఉదాసీనుడై అస్వస్థుడయ్యెను. దేవవ్రతుడు తండ్రి అట్లుండుటకు కారణము తెలుసుకొని, నిషాదరాజు దగ్గరకు వెళ్ళి, "అతని పుత్రికను తన తండ్రికి ఇమ్మని" కోరెను. నిషాదరాజు తన షరతును దేవవ్రతునకు కూడ చెప్పెను. దేవపుత్రుడు దానికి అంగీకరించెను. "నీవు కోరినట్లే జరుగు"నని చెప్పెను. అందుకు నిషాదరాజు "నీవు ఈరోజు రాజ్యసింహాసనముపై కూర్చుండక పోవచ్చును. రేపు నీ పుత్రుడు నా పౌత్రుని రాజ్యసింహాసనమున కూర్చొన నివ్వనిచో" అని అనుచుండగనే–

దేవవ్రతుడు దేవతల సాక్షిగ నేను వివాహమే చేసుకొనననని భీషణ (భయంకర) ప్రతిజ్ఞను చేసెను. ఈ భీషణ ప్రతిజ్ఞ కారణముగ వీనికి భీష్మ నామము కలిగెను.

తన తండ్రి సుఖమునకు ఇంతటి వ్రతమును జీవితాంతము పాటించిన భీష్ముని చరిత్ర అందరికి అనుకరణీయమైనది. పుత్రహీనుడై మరణించినను, అఖండ బ్రహ్మచర్యవ్రత కారణమున, సమస్త హిందూసమాజము పుత్రునివలె వీనికి తర్పణము కావించుచున్నారు.

## 98. మాఘ పూర్ణిమ

మాఘమాస స్నానమునకు గొప్ప మహిమ గలదు. ఈ మాసమందు ప్రతితిథి పుణ్యప్రదమైనవే. అందు మాఘ పౌర్ణిమ విశేషమైనది. గంగాస్నానముచేసి, గంగకు ఆరతినిచ్చి పూజించెదరు. సాధు సన్యాసులకు బ్రాహ్మణులకు భిక్షువులకు భోజనము పెట్టి, దానము లొసగెదరు.

ఈ దినమున ప్రాతఃస్నానముచేసి విష్ణుభగవానుని పూజించవలెను. అనంతరము పితరులకు శ్రాద్ధము పెట్టవలెను. నువ్వులను కంబళిని బెల్లము నెయ్యి పాదరక్షలు ఫలములు అన్నము సువర్ణము రజతాదులను దానముచేసి, సత్కథలతోను, సత్సంగములతోను, కీర్తనాదులతోను దినమంతయు గడుపవలెను. మరసటిరోజు పారణను చేయవలెను. (ఉపవాసముండి మరసటి రోజు చేయు భోజనము పారణయందురు)

మాఘ శుక్ల పూర్ణిమ శని మేష రాశి యందును, గురుచంద్రులు సింహరాశి యందును సూర్యుడు శ్రవణానక్షత్రమందునుయున్న అది మహామాఘ పౌర్ణమి యగును.

## 99. ఏకాదశీ వ్రతముచేసిన పుణ్యాత్ములు - వైకుంఠ ఏకాదశీ నామము గలుగుట

మొట్టమొదట దేవతలు దైత్య వినాశము కొరకు, తాము పోగొట్టుకున్న రాజ్య ప్రాప్తి కొరకు ఈ ఏకాదశీ వ్రతానుష్ఠానము చేసిరి. తరువాత వైశన్తనరాజు యమలోకమందున్న తండ్రి నుద్ధరించుటకు ఈ వ్రతమును చేసెను. భద్రావతీ నగరమందు పుత్రహీనుడైన కేతుమానరాజు ఈవ్రతము చేసి పుత్రుని పొందెను. శ్రీరామచంద్రుడు సముద్రముపై సేతు బంధనము చేసి రావణుని వధించుటకు ఏకాదశీ వ్రతమును చేసెను. ఈ ఏకాదశీ వ్రతముచేసి మాంధాత, సగరుడు, కకుత్స్థుడు, ముచుకుందుడు పుణ్యలోకములకు వెళ్ళిరి. శంకర భగవానుడీ వ్రతముచేసి బ్రహ్మకపాలము నుండి ముక్తిని పొందెను. రుక్మాంగద రాజు ఈ వ్రతముచేసి భూమండలమున రాజ్యభోగములననుభవించి పురవాసులతోకూడి వైకుంఠలోకమునకు వెళ్ళెను. అంబరీషుడు ఈ వ్రతముచేసి బ్రహ్మశాపమును నివారణచేసికొనెను. హరిశ్చంద్రుడు ఈ వ్రతముచేసి రాజ్యభోగములనుభవించి పురవాసులతో గూడి వైకుంఠధామమునకు వెళ్ళెను. ఈ విధముగ ఈ వ్రతము వైకుంఠ ఏకాదశి నామమును పొందెను. (శ్రీగర్గసంహిత)



## ఫాల్గుణమాస వ్రతములు

## 100. మహాశివరాత్రి-మహోత్సవము

### (ఫాల్గుణ కృష్ణ చతుర్దశి)

శివభగవానునకు అతిప్రియమైన రాత్రిని శివరాత్రి యందురు. శివార్చనము జాగరణము ఈవ్రతమందు విశేషమైనవి. రాత్రంతయు జాగరణ చేయుటయు, శివాభిషేకము చేయుదురు.

శ్రీ పార్వతీదేవి అడుగగ శివభగవానుడు ఫాల్గుణ కృష్ణ పక్ష చతుర్దశి శివరాత్రిని గురించి చెప్పెను. ఆ దినము ఉపవాసముండినవారు నన్ను ప్రసన్నుని గావించెదరు. ఫాల్గుణ కృష్ణపక్ష చతుర్దశిరాత్రి ఆదిదేవ శివభగవానుడు కోట్ల సూర్యుల ప్రకాశము లోలింగ రూపమున ప్రకట మయ్యెను. జ్యోతిషశాస్త్రానుసారము ఫాల్గుణ చతుర్ధశి తిధియందు చద్రుడు సూర్యునకు సమీపముగ నుండును. ఆ సమయమున జీవన రూపుడై చంద్రుడు శివరూపుడైన సూర్యుని వెంటయుండును. అందువలన చతుర్దశి నాడు శివపూజచేసిన జీవులకు అభీష్టములు నెరవేరును. ఇది శివరాత్రి రహస్యము. మహాశివరాత్రియే మహాశివరాత్రి. శివుడు ఐశ్వరప్రదాత.

శివుని పంచామృతముతో స్నానము చేయించి చందన పుష్ప అక్షత వస్త్రాదులతో అలంకరించి హారతి నీయవలెను. రాత్రంతయు జాగరణచేసి పంచాక్షర మంత్రమును జపించవలెను. రుద్రాభిషేకము, రుద్రాష్టాధ్యాయములు చేయు విధానము కలదు.



**ప్రథమ ఆఖ్యానము :-** పద్మకల్ప ప్రారంభమున బ్రహ్మదేవుడు అండజ పిండజ స్వేదజ మరియు దేవతాదులను సృష్టించి, ఒక దినము స్వేచ్ఛగ తిరుగుచు క్షీరసాగరమునకు వెళ్ళెను. నారాయణ భగవానుడు శ్వేత సహస్ర ఫణమౌళి శేషుని శయ్యపై పవళించి యుండెను. భూదేవి శ్రీదేవి శ్రీమహాలక్ష్మి శేషశాయి చరణములను తమ ఒడితో పెట్టుకొని సేవించుచుండిరి. గరుడ నంద, సునంద, పార్షద, గంధర్వ కిన్నరాదులు వినమ్రులై చేతులు జోడించి నిలబడి యుండిరి. ఇది చూచిన బ్రహ్మకు ఆశ్చర్యము గలిగెను. గర్వముగ నేను సృష్టికి మూలకారణుడను, సర్వేశ్వరుడును, నియంతను, పితామహుడను ఐయుండగా, మరి ఈ వైభవోపేతుడు ఎవరు? నిశ్చింతగ నిదురించుచున్నాడని బ్రహ్మ కోపముతో భగవానుని సమీపమునకు వెళ్ళి, "నీవెవరివి? లెమ్ము లేచి చూడుము, నేను నీ స్వామిని, తండ్రిని వచ్చితిన"నెను.

"శేషసాయి కనులుతెరచి మందహాసముగ వత్సా! నీకు శుభముగలుగుగాక. రమ్ము, ఈ ఆసనముపై కూర్చొనుము". అని నంతనే బ్రహ్మ అతి కోపముతో, నేను నీ రక్షకుడను, జగత్తునకు పితామహుడను, నీవే నన్ను గౌరవించవలె ననెను.

అంతట నారాయణభగవానుడు-"జగత్తునాలో స్థితమై యుండగ, మరి నీవు నాదనుచుంటివేమి? నీవు నా నాభికమలము నుండి ఉద్భవించితివిగాన నాపుత్రుడవు. నేనే స్వామిని" అనుచు ఇరువురు వివాదము లాడుకొనసాగిరి.

బ్రహ్మ పాశుపతాస్త్రమును శ్రీవిష్ణువు మాహేశ్వరాస్త్రమును తీసిరి. అస్త్రముల తేజస్సునకు దిశలు జ్వలించసాగెను. సృష్టికి ప్రళయము వచ్చినట్లుండెను. దేవగణ ములు పరుగులుపెట్టుచు కైలాస పర్వతముపైనున్న శివభగవానుని చెంతకేగిరి. శివుడు అంతయు గ్రహించెను. "నేను వారిని శాంత పరచెద"ననుచు, శంకరుడు వారి ఇరువురి మధ్యలో జ్యోతిర్మయ స్తంభ రూపమున ప్రకటమయ్యెను.

మాహేశ్వర పాశుపతాస్త్రములు రెండు శాంతించి జ్యోతిర్మయ లింగమందు లీనమయ్యెను. ఈ లింగము నిష్కలబ్రహ్మ నిరాకార బ్రహ్మకు ప్రతీకమైనది. బ్రహ్మ విష్ణులు ఆలింగమును (స్తంభమును) పూజించిరి. ఈ లింగము ఫాల్గుణకృష్ణ చతుర్దశి నాడు ప్రకటమయ్యెను. ఆనాటినుండి నేటివరకు లింగపూజ నిరంతరము కొనసాగు చున్నది. బ్రహ్మవిష్ణువులు శివునితో "మాకే ఈ లింగమునకు ఆది అంతములు తెలియలేదు. మరి రాబోవు మానవులు మీ పూజ ఎట్లు చేయగలరు?" అని శివుని అడుగగ, శివభగవానుడు ద్వాదశజ్యోతిర్లింగములుగ విభక్తుడయ్యెను. (ఈశాన సంహిత)

**ద్వితీయ ఆఖ్యానము :-** వారణాసీ వనమందొక బోయవాడుండెను. వీనిది పెద్ద కుటుంబము. ఇతడు బలవంతుడు అతిక్రూరుడు. ప్రతి దినము వనమునకు వెళ్ళి మృగములను చంపువాడు, దొంగతనములు చేయువాడు. ఈవిధముగ కుటుంబ మును పోషించుచుండెను. మహాశివరాత్రి దినమున బోయవాని తల్లితండ్రులు భార్యాపిల్లలు ఆకలని యాచించిరి. బోయవాడు ధనస్సుచేతబూని వేటకు వెళ్ళెను.

వనమంతయు తిరిగినను ఒక్క జంతువుకూడ దొరకలేదు. సూర్యాస్తమయ్యెను. వట్టి చేతులతోనే నెట్లుపోవుదును, యేదైన లభించిన తీసుకొని వెళ్ళవలెననుకొని ఒక జలాశయముచెంతకు వెళ్ళెను. రాత్రిపూట జంతువులు నీరు త్రాగుటకు ఇచటికి తప్పకవచ్చును, వానిని చంపి ఇంటికి తీసుకొని వెళ్ళవలెననుకొని, జలాశయము తీరముననున్న ఒక బిల్వవృక్షముపై ఎక్కి కూర్చుండెను. నడుముకు కట్టుకొనియున్న కమండలములో త్రాగుటకు నీరుపోసుకొని కూర్చుండెను. ఆరాత్రి మొదటిజాములో దప్పిక గొనిన ఒక జింక అచటికి వచ్చెను. దానిని చూచిన బోయవాడు దానిని వధించుటకై ధనస్సుపై బాణము సంధించెను. ఈవిధముగ చేయునప్పుడు తన కమండలములోని నీరు కొంత క్రిందపడెను. బిల్వపత్రములు కూడ కొన్ని విరిగి క్రిందపడెను. ఆ వృక్షము క్రింద ఒక శివలింగముండెను. పైనుండి పడిన బిల్వపత్రములు నీరు ఆశివలింగముపైబడెను. అది ఆ రాత్రి మొదటి జాములో శివుని పూజించినట్లయ్యెను. ఆ లేడి భయముతో పైకిచూచెను. అది బోయవానితో "నీవు యేమి కోరుకొనుచుంటివో సత్యము చెప్పు"మనెను.

ఆ బోయవాడు "నా కుటుంబమంతయు ఆకలితో అల్లాడుచుండిరి, నిన్ను వధించి వారి ఆకలిని తీర్చెద"ననెను. అప్పుడాలేడి నాపిల్లలు నాకొరకు ఎదురుచూచుచుందురు. నేనిపుడు వారిని నా చెల్లెలకు గాని నా భర్తకుగాని అప్పగించి తిరిగి వచ్చెద ననెను. మృగము శపథముచేసి చెప్పినందువలన బోయవాడు దానిని విడచి పెట్టెను.

రెండవజామునందు లేడి చెల్లెలు తన అక్కను వెదకుచు జలముకొరకు అచటికి వచ్చెను. బోయవాడు దానిని చూచి బాణము సంధించెను. అప్పుడు మొదట పడినట్లే మరికొన్ని బిల్వపత్రములు మరికొంత జలము క్రిందనున్న శివలింగము పైబడెను. ఈవిధముగ ఆరాత్రి రెండవజామున శివుని పూజించినట్లయ్యెను.

ఆ"లేడి బోయ వానితో నీవేమి చేయుచుంటి"వని అడిగెను. బోయవాడు మొదట చెప్పినట్లే చెప్పెను. ఆ లేడి "నాపిల్లలు చిన్నవారు, వారిని నేను నాభర్తకు అప్పగించి తిరిగి వచ్చెద"ననెను. బోయవాడు దానిని కూడ విడచిపెట్టెను.

ఇంతలో ఆడలేడిని వెదకుచు మగలేడి అచటికి వచ్చెను. బోయవాడు దానిపై బాణమువేయబోవగా అదితగిలి మరల కొంతజలము బిల్వపత్రములు క్రిందనున్న శివలింగముపైబడెను. మూడవ పూజకూడచేసినట్లయ్యెను. మృగముబోయవానిని చూచి యేమి చేయబోవు చుంటివని అడిగెను. బోయవాడు "నిన్నువధింపబోవు చుంటి" ననెను. ఆమృగము "నాపిల్లలను తల్లికి అప్పగించి ధైర్యముచెప్పి శీఘ్రమే తప్పక ఇచటికి వచ్చెద"ననెను. బోయవాడు "నీవలెనే ఇచటికి వచ్చిన వారందరు చెప్పి వెళ్ళుచుండిరి. కానీ ఇంతవరకు తిరిగిరాలేదు". అనినంతనే మృగము ప్రతిజ్ఞ చేసి వెళ్ళిపోయెను.





మృగములు మూడును వెళ్ళుటకు సిద్ధపడెను. తమ పిల్లలను ఇరుగు పొరుగు వారికి అప్పగించి వనమునకు వెళ్ళెను. అవి వెళ్ళుచుండగ చూచిన వారి పిల్లలుకూడ వారి వెనుకనే వెళ్ళెను. అన్నియు ఒక్కసారిగ వచ్చుట చూచిన బోయవాడు సంతోషించి బాణము సంధించెను. మరల బాణము తగిలి బిల్వ పత్రములు కమండలములోని జలము క్రిందనున్న శివలింగముపైబడెను. ఈ విధముగ నాలుగు జాములందు శివుని పూజించినట్లయ్యెను. బోయవాడు రాత్రంతయు వేటాడవలెనను ఉద్దేశ్యముతో ఉపవాసముతో జాగరణ చేసెను. ఆ దినము మహాశివరాత్రియగుటయే దాని ప్రభావమున బోయవాని సమస్త పాపములు భస్మమయ్యెను.

మృగములు బోయవానితో "శీఘ్రమే మా శరీరములను సార్థకము చేయుము. నీ భార్యాపిల్లలు తల్లితండ్రుల ఆకలిని తీర్చుము. అనినంతనే బోయవాడు విస్మయము చెందెను". జ్ఞానములేని పశువులైనను ఈ మృగములు ధన్యమైనవి. పరోపకారమైనవి, ప్రతిజ్ఞా పాలకమైనవి. మనుష్యులైయుండియు జీవితమంతయు హింస హత్య పాపములుచేయుచు తమ కుటుంబపాలన చేయుచున్నారు. ఉదర పోషణకై నేను చేయు హత్యలకు ధిక్కారము ధిక్కారము అనుచు బాణము తీసివేసి మృగములార! మీరందరు వెళ్ళిపొండు మీరు ధన్యజీవులు అని అనినంతనే లింగమునుండి శంకర భగవానుడు ప్రత్యక్షమై ప్రేమతో వానిని తాకి వరమడుగుమనెను. బోయవాడు భగవానుని చరణములపైబడెను. ప్రసన్నుడైన భగవానుడు బోయవానికి "గుహ"నామము ప్రసాదించెను. "శ్రీరామ భగవానుడొకనాడు అవశ్యము నీ గృహమునకు వచ్చును. నీకు మిత్రుడగును. నీకు మోక్షముకలుగును". అని వరమొసగెను.

ఆ బోయవాడే శృంగవేర పురమున నిషాదరాజు "గుహు"డయ్యెను. ఇతడు శ్రీరామునకు ఆతిథ్య మొసగెను.

మృగములన్నియు భగవానుని దర్శించి, శాపముక్తులై విమానములో దివ్యధామమునకు వెళ్ళెను. అప్పటినుండి అర్బుదపర్వతముపై శివభగవానుడు వ్యాధేశ్వర నామముతో ప్రసిద్ధిగాంచెను. వీనిని దర్శించి పూజించిన శీఘ్రమే మోక్షము కలుగును. శివరాత్రి వ్రతము (ఉపవాస జాగరణలు) శివలోకమును మోక్షమును ప్రసాదించును.

## 101. హోళీ

వసంత పంచమి వచ్చినంతనే ప్రకృతిలో నూతన పరివర్తన గలుగును. ఇది ఆబాల వృద్ధులు నర-నారీ లందరు ఉత్సాహముగ జరుపు కొందురు. ఈ పండుగ కామ దహనమునకు సంబంధించినది. శంకరభగవానుడు, తనక్రోధాగ్నితో కామ దేవుని (మన్మథుని) భస్మము కావించెను. ఆనాటినుండి ఈ పండుగ జరుగుచున్నది. ఫాల్గుణ శుక్ల అష్టమి పూర్ణిమ వరకు ఎనిమిది దినములు హోలాష్టమి జరుగును.

కొన్ని ప్రదేశములందు వృక్షము కొమ్మను విరచి దానికి రంగు రంగుల గుడ్డలు కట్టి దానిని నేలలోపాతి దీని దగ్గర హోలికోత్సవమును జరుపుకొందురు. ఈపండుగను హిరణ్యకశిపుని చెల్లెలు గుర్తుగా జరిపెదరు. హిరణ్యకశిపుని చెల్లెలు హోలీ పండుగ ప్రభావముతో నిత్యము అగ్ని స్నానము చేయును, కాని జ్వలించదు. హిరణ్యకశిపుడు సోదరితో ప్రహ్లాదుని తనఒడిలో పెట్టుకొని అగ్నిస్నానము చేయుమని చెప్పెను. (ప్రహ్లాదుని వధింప దలచి) హరిణ్యకశిపుని సోదరి హోలిక అట్లే కావించెను. కానీ ప్రహ్లాదుడు జీవించిబయటపడెను, హిరణ్య కశిపుని సోదరి హోలిక కాలిబూడిద అయ్యెను. అప్పటినుండి హోలికోత్సవమును జరుపుచుండిరి. హోలీపండుగ అందరిని ఆనందముగ కలుపునది. ఈ దినమున ఒకరిపై నొకరు రంగులు జల్లుకొందురు.

## 102. సౌభాగ్య వ్రతము

ఈ వ్రతమువలన స్త్రీ పురుషుల కిరువురకును సౌభాగ్యము కలుగును. ఫాల్గుణ మాస శుక్లపక్ష తృతీయ (తదియ) తిథినాడు పవిత్రులై సత్యవాదులై ఉపవాసముండ వలెను. ఈవ్రతమందు లక్ష్మీసహితుడైన శ్రీహరిని, ఉమాసహితుడైన శంకరునిగాని పూజించు విధానముగలదు. లక్ష్మియే గిరిజ, గిరిజయే లక్ష్మి అనియు, శ్రీహరియే త్రినేత్రధారి హరుడనియు హరుడే శ్రీహరి యనియు సమస్త వేదశాస్త్రములు పురాణ ములు సుస్పష్టముగ చెప్పెను.

దీనికి వ్యతిరేకముగ చెప్పబడిన అది కావ్యము కాదు, శాస్త్రము కానేరదు. లక్ష్మి గౌరికాదని విష్ణువు రుద్రుడు కాడని చెప్పు శాస్త్రములు నాస్తికులు రచించినవి. ఇట్టివారు నికృష్టులు. ఇరువురు ఒకటేయని భావించి పూజించవలెను.

గంభీరాయ నమః యని పాదములను

సుభగాయ నమః యని కటిని

దేవదేవాయ నమః యని ఉదరమును

త్రినేత్రాయ నమః యని ముఖమును

వాచస్పతయే నమః యని శిరస్సును

రుద్రాయ నమః యనుచు సర్వ అవయవములను, పూజించవలెను.

లక్ష్మీ సహితుడైన విష్ణువునుగాని, గౌరీ సమేతుడైన హరునిగాని గంధపుష్పాదులతో పూజించవలెను. అనంతరము భగవానుని ఎదుట తేనెతో నేతితో తిలలతో సౌభాగ్యపతయే నమః అని హోమము చెయ్యవలెను. ఆ తరువాత ఉప్పు కారము నూనెలేని గోధుమ అన్నమును నేలపై కూర్చుండి తినవలెను. కృష్ణపక్ష మందును ఇట్లే చేయవలెను. ఆషాఢమాసమందు మొదటి విదియనాడు యవాన్న ముతో పారణచేయవలెను. కార్తీకము మొదలైన మూడునెలలు చామల అన్నమును తినవలెను. మాఘశుద్ధ తదియనాడు గౌరీరుద్రులనుగాని, లక్ష్మీనారాయణులనుగాని,



యథాశక్తిగ బంగారముతో ఒకే ప్రతిమగ చేయించవలెను. (ఒకవైపు ఒకబొమ్మ, మరోవైపు ఇంకొకబొమ్మ వచ్చునట్లుగ) దీనిని సత్పాత్రునకు దానమీయవలెను.

ఆరుపాత్రలతో సహా బ్రాహ్మణునకు సమర్పించవలెను. తేనెపాత్ర, నేతిపాత్ర, నువ్వుల పాత్ర, బెల్లము ఉంచిన పాత్ర, ఉప్పుపోసిన పాత్ర, ఆవుపాలు పోసినపాత్ర, ఈ ఆరు పాత్రలను దానముచేసిన నరుడుగాని, నారిగాని ఏడుజన్మలందు సౌభాగ్య వంతులై సుందరులై యుందురు. (వరాహపురాణము)

## 103. అవిఘ్న వ్రతము

ఇది విఘ్నములు గలుగకుండ చేయు వ్రతము. ఇది ఫాల్గుణ మాసములో చవితినాడు పగలు ఉపవాసముండి మరుసటి రోజు నువ్వులు కలిపిన అన్నమును పారణచేయవలెను. యజ్ఞముకూడ నువ్వులతోనే చేయవలెను. బ్రాహ్మణునికి కూడ నువ్వుల అన్నమునే పెట్టవలెను. నువ్వులను దానముచేయాలి. నాలుగునెలలు ఈ వ్రతమును చేసి ఐదవనెలలో సువర్ణ గజముఖుని చేయించి, పాయసమును నువ్వులను అయిదుపాత్రలలోపోసి బ్రాహ్మణునకు దానమీయవలెను. ఈవిధముగ వ్రతముచేసిన సర్వవిఘ్న విముక్తుడగును.

పూర్వము అశ్వమేథ యజ్ఞమునకు విఘ్నము వచ్చినప్పుడు సగరుడు ఇదే వ్రతము చేసి అశ్వమేథ యజ్ఞమును పూర్తి కావించెను.

ఇట్లే త్రిపురాసుర సంహారమందు రుద్రుడు ఈ వ్రతముచేసి త్రిపురాసురులను సంహరించెను. అగస్త్యుడు కూడ సముద్రమును త్రాగునప్పుడు ఈ వ్రతమునే చేసెను. మరికొందరు రాజులు కూడ విఘ్నములు కలుగకుండుటకు ఈ వ్రతమును చేసిరి. శూరాయ నమః, ధీరాయ నమః, గజాననాయ నమః, లంబోదరాయ నమః, ఏక దంష్ట్రాయనమః, అని చవితినాడు పూజించవలెను.

ఈ విధముగ చేసిన విఘ్నము లన్నియు తొలగిపోవును. వినాయకుని దానమువలన నరులు కృతకృత్యులగుదురు (వరాహపురాణము)

## 104. మకర వ్రతానుబంధము-సంక్రాంతి మహాపర్వము

సూర్యుడు మకరరాశి యందు ప్రవేశించుటయే మకర సంక్రాంతి. ఈ దినమున సూర్యుడు ఉత్తరాయణమునకు వెళ్ళును. శాస్త్రములందు ఉత్తరాయణము దేవతలకు పగలనియు, దక్షిణాయము దేవతలకు రాత్రియనియు అందురు. ఈ విధముగ మకర సంక్రాంతి దేవతలకు ప్రభాత కాలము. ఈ దినము స్నాన దాన జప తప శ్రాద్ధ అనుష్ఠానాదులు అత్యధికమైన మహత్తుగలవి. ఈ దినమున చేయు దానము నూరెరెట్లధికమగును.

ఈ దినము నెయ్యిని కంబళిని దానముచేసిన సమస్తభోగములనుభవించి మోక్షమును పొందుదురు. మకర సంక్రాంతి దినమున గంగాస్నానము గంగా తీర దానము విశేషమైన మహిమగలవి. తీర్థరాజు ప్రయాగ గంగా స్నానము ప్రసిద్ధమైనది.

ఉత్తర దేశమందు ఈ వ్రతమును "ఖిచడీ" యందురు. అందువలన ఈ దినమున ఖిచడీని భుజించెదరు. ఖిచడీని నువ్వులను దానము చేయుదురు.

మహారాష్ట్రమందు వివాహిత స్త్రీలు మొదటి సంక్రాంతి దినమున నూనె ప్రత్తి ఉప్పు మొదలగు వానిని సౌభాగ్యవతులైన స్త్రీలకు ప్రదానము చేసెదరు. బెంగాలు నందు ఈ దినము స్నానముచేసి నువ్వులను దానము చేసెదరు. దక్షిణభారతదేశ మందు దీనిని "పొంగల్" అని యందురు.

రాజస్థానమందు సౌభాగ్యవతీ స్త్రీలు నువ్వులలడ్డూలను, బూందీలడ్డూలను, తన అత్తకు వాయనమిచ్చి నమస్కారము చేయవలెను. దేనినైనను 14 నుంచి, 14 బ్రాహ్మణులకు దానమీయవలెను. ఈ విధముగ వివిధ ప్రాంతములందు మకర సంక్రాంతిని వివిధ రకములుగ చేయుదురు.



## వివిధ రూపములలో మకర సంక్రాంతి పర్వదినము

దేశసంస్కృతిని బట్టిదీనిని చేయుదురు. గంగ యమున సరస్వతీ సంగమ మందు ప్రయాగలో (అలహాబాద్) మకర సంక్రాంతి దినమున సమస్త దేవీ దేవత లందరు తమస్వరూపములను మార్చుకొని స్నానమునకు వచ్చెదరు. అందువలన అచట మకర సంక్రాంతి దినమున స్నానముచేసిన అనంత పుణ్యములు ప్రాప్తించును.

ఈ పర్వదినము సాధారణముగ ప్రతిసంవత్సరము జనవరి 14వ తేదీ వచ్చుచుండును. ఖగోళ శాస్త్రానుసారము ఈ దినమున సూర్యుడు దక్షిణాయనము నుండి ఉత్తరాయణముగవచ్చి మకర రాశి యందు ప్రవేశించును. అందువలన దీనిని సంక్రమణమనియు, సంక్రాంతి యనియు అందురు.

**పౌరాణిక కథ :-** మకర సంక్రాంతినాడు గంగ స్వర్గమునుండి దిగివచ్చి భగీరథునివెంట కపిలముని ఆశ్రమము మీదుగ వెళ్ళి సాగరమందు కలిసెను. పావనమైన గంగాజలముతో శాపగ్రస్తులైన సగర మహారాజుని 60వేల మంది పుత్రులు ఉద్ధరింపబడిరి. అందువలన దీనికి గంగాసాగరమనుపేరు గలిగెను. ఈ దినమున ప్రతిసంవత్సరము ప్రయాగయందు ఆనెల అంతయు మాఘమేళా జరుగును. ఈవిధముగ 12 సంవత్సరములు చేసిన తరువాత కుంభమేళా ఉత్సవము వచ్చును. దీనిని కూడ మాసమంతయు చేయుదురు. ఆరునెలల కొకమారు అర్ధకుంభమేళా ఉత్సవము జరుపుదురు.

**కథ :-** పంజాబు జమ్మూకాశ్మీరులందు లోహిడీ నామముతో మకర సంక్రాంతిని జరుపుదురు. మకర సంక్రాంతి దినమున కంసుడు శ్రీకృష్ణుని



వధింపుమని చెప్పి లోహితుడను రాక్షసుని గోకులమునకు పంపెను. వీనిని శ్రీకృష్ణుడు బాలక్రీడలతో వధించెను. అందువలన దీనికి లోహిడీపర్వతమను పేరువచ్చెను. తమిళనాడునందు సంక్రాంతిని "పొంగలి" యందురు. ఈ దినము పప్పు బియ్యముతో ఖిచడీ చేయుదురు. క్రొత్తబియ్యమును పప్పును నువ్వులను పూజించి కృషిదేవత (ధాన్యలక్ష్మీ) కృతజ్ఞతలు ప్రకటించెదరు.తమిళనాడులో క్రొత్త సంవత్సరము, క్రొత్త పంచాంగము పొంగలి నుండి ప్రారంభమగును.

## 105. మేష సంక్రాంతి

సూర్యుడు మీన రాశి నుండి మేష రాశిలో సంక్రమణము చేయుకాలమును మేషసంక్రాంతి యందురు. ఈ సంక్రాంతినాడు సూర్యభగవానుడు సగము ఉత్తరాయణ యాత్రను పూర్తిచేయును. ఈ సంక్రాంతినాడు స్నానదానములు, పితరు లకు తర్పణము మధుసూదన భగవానుని పూజించుట విశేషమైనవి. మేష సంక్రాంతిక నాలుగు ఘంటలు ముందు, నాలుగు ఘంటలు తరువాత ఎనిమిది ఘంటలు పుణ్యకాలముండును. పదునైదు ఘడియలముందు పదునైదు ఘడియల తరువాత కూడ పుణ్యకాలముండునని చెప్పుదురు.

## 106. పురుషోత్తమ మాసము, క్షయాది (మల) మాసము

సూర్యభగవానుడు జ్యోతిష శాస్త్రమునకు అధిష్ఠాతృ దేవత.

సూర్యుడు మేషాది ద్వాదశ రాశులలో సంచారము చేయుచుండును. అప్పుడు సంవత్సరమగును. దానిని సౌర వర్ష (సంవత్సర) మందురు. భువన భాస్కరుడు యేరాశిపై సంక్రమణము కానప్పుడు అది అధిక మాసమగును. ఒకే మాసమందు సంక్రాంతి ద్వయము సంయుక్తమై యున్న అది క్షయ మాస మగును.

విష్ణుభగవానుడు మలమాసముతో శ్రీకృష్ణుని చరణములకు నమస్కారము చేయించెను. మల"మాసము భయకంపితురాలై శ్రీకృష్ణభగవానుని చరణములను శరణువేడుకొనెను. శ్రీకృష్ణుడు విష్ణువును" ఇది ఎవరు? శోకమోహములు స్వప్న మందైనను లేని నా"గోలోకమున యేల రోదించుచున్నది? ఇచట అందరు ఆనందముగ నుందురు. అశ్రుధారలతో కంపించుచు నా ఎదుట యేల రోదించుచున్న"దని అడిగెను.

విష్ణువు "హే బృందావన మురళీధర శ్రీకృష్ణా ! ఈ అధిక మాసము అర్క సంక్రమణ రహితమైన కారణమున మలినమైనది. వేదశాస్త్ర విహిత పుణ్య కర్మలకు అయోగ్యమైన కారణమున స్వామి"లేకుండెను. దీనిని అందరు నిందించు చుండిరి. దీనికి ఎట్టి ప్రభువు లేని కారణమున వనస్పతులు లతలు 12 నెలలు కలాకాష్ఠములు క్షణ ఉత్తర దక్షిణ అయన సంవత్సరములన్నియు అవమానించెను.

హృషీకేశ! మీరు"తప్ప మరి ఎవ్వరు ఈ కష్టమును నివారింపలేరు. దయతో విముక్తిని గలిగించుడ". అని అధికమాస దుఃఖమును నివేదించెను.

శ్రీకృష్ణుడు "విష్ణూ! మీరు మల మాసమును వెంట బెట్టుకొని వచ్చి అధిక మాసమునకు మహా ఉపకారము చేసితిరి. నేను దీనిని అన్నిటికంటె ఎక్కువైనదిగను, నాతో సమానమైనదిగను చేయుదును. సద్గుణ కీర్తి ప్రభావ షడ్వైశ్వర్య పరాక్రమ భక్తాశ్రయాది సమస్త గుణములతో నేను విశ్వమందు పురుషోత్తమనామముతో ఖ్యాతి గాంచితిని. అదే విధముగ ఈ మల మాసము భూతలముపై పురుషోత్తమ నామముతో ప్రసిద్ధిగాంచును. నాలో ఉన్న సద్గుణములన్నియు నేడు నేను మల మాసమునకు అర్పించుచుంటిని. నానామము వేదములందు శాస్త్రములందు లోకమున ఖ్యాతి గాంచెను. మరి నేను స్వయముగ ఈ మాసమునకు స్వామి నయ్యెదను. గోలోకము చేరుటకు మునులు మహర్షులు నిరంతరము కఠోరమైన తపములు చేయుదురు. అట్టి దుర్లభమైన గోలోకము, పురుషోత్తమ మాసమందు స్నానపూజాది అనుష్ఠానములు చేయు భక్తులకు సులభముగ ప్రాప్తించును.

ప్రతి మూడు సంవత్సరముల కొకమారు పురుషోత్తమ మాసము (అధిక మాసము) వచ్చును. ఈ మాసమున వ్రత ఉపవాస పూజాది శుభకర్మలు చేయవలెను. ఇట్టివారు తమ పరివార సహితులై గోలోకమునకు వచ్చెదరు. నేటి నుండి అందరు నా ఆజ్ఞగా తలచి పురుషోత్తమ మాసమును పూజించవలెను.



## 107. శ్రీ సత్యనారాయణవ్రత విధి

### మొదటి అధ్యాయము- మొదటి కథ

ఋషులు సూతులవారిని "మహామునీ! యే వ్రతముచేసిన లేకయే తపము చేసిన అభీష్టసిద్ధికలుగునో వినగోరుచున్నాను. దయతో చెప్పు"డని కోరిరి.

సూతులవారు – నారదమహర్షి ఇదే మాటను భగవానుని అడిగెను చెప్పెద వినుడు.

ఒకనాడు పరోపకారియైన నారదుడు లోకసంచారము చేయుచు మర్త్యలోకము నకు వచ్చెను. అచట సమస్త మానవులు పలువిధములుగ దుఃఖపీడితులైయుండిరి. తమ తమ కర్మానుసారము వివిధ యోనులందు జన్మించి కష్టములు పడుచుండుట గాంచి వీరి దుఃఖనివారణకు ఉపాయమేమిటని యోచించి విష్ణులోకమునకు వెళ్ళి అచట శంఖ చక్ర గదా పద్మములను ధరించినవాడు వనమాలా విభూషితుడు శుక్ల వర్ణ చతుర్భుజుడు దేవేశ్వరుడు అయిన నారాయణ భగవానుని దర్శించి, మనస్సునకు వాక్కునకు అతీతమైనవాడవు అనంతశక్తి కలవాడవు, ఆది మధ్యాంతరహితుడవు నిర్గుణుడవు, గుణాత్ముడవు సర్వులకు ఆదిభూతుడవు, భక్తుల దుఃఖములను నశింప జేయువాడవు" అని భగవానుని నారదుడుస్తుతించెను.

విష్ణుభగవానుడు నారదునితో "మహాభాగ! మీరు వచ్చిన కారణమేమి? మీ మనస్సులోని కోరికేమి? చెప్పు"మనెను. నారదుడు "భగవాన్! నరలోకమున మనుష్యులు పాపకర్మలకువశులై వివిధ యోనులందు జన్మించి నానావిధములైన క్లేశములతో తమ తమ పాపకర్మల ఫలితములను అనుభవించుచుండిరి. హే ప్రభూ! వారి కష్టము లెట్లు తొలగిపోవునో నాయందు దయ ఉంచి యేదేని ఉపాయము చెప్పు"డని కోరెను.



భగవానుడు "వత్సా! లోకానుగ్రహ"కాంక్షతో నీవు బహు చక్కగ అడిగితివి. జనులుయేమి చేసిన మోహవిముక్తులగుదురో దానిని చెప్పుచున్నాను వినుము. ఓ పవిత్రమైన వ్రతముండెను. అది స్వర్గలోకమందును భూలోకమందును అతి దుర్లభమైనది. నీ మీద ప్రేమచేతదానిని చెప్పుచుంటిని. దానిని సత్యనారాయణ వ్రతమందురు. దీనిని విధి విధానముగ ఆచరించినవారు ఈలోకమందు సుఖభోగము లనుభవించి పరలోక మోక్షమును పొందెదరు".

నారదుడు "భగవాన్! ఈ వ్రతము వలన ఫలమేమి? దీని విధానమెట్టిది? ఈ వ్రతమును ముందెవరు చేసిరి? ఎప్పుడు చేయవలెను? సవిస్తరముగ చెప్పు మనెను. అంతట భగవానుడు "ఈ వ్రతము దుఃఖమును శోకాదులను నశింప జేయును. ధనధాన్యములను వృద్ధిచేయును, సౌభాగ్యమును సంతతిని కలుగ జేయును. సర్వత్ర విజయము నొసగును. ఈ వ్రతమును భక్తి శ్రద్ధలతో ఎవరైనను యే దినమైనను చేయవచ్చును. ఐనను సత్యనారాయణ భగవానుని సంధ్యా సమయ మున పూజించిన సంతుష్టుడగును. ధర్మపరాయణరాలై బ్రాహ్మణులతోను బంధు భాందవులతోను కలిసి ఈ వ్రత మాచరించవలెను. సవాపావు యైనను సవాసేరుయై నను ప్రసాదమును భక్తితో అర్పించవలెను. ఈ ప్రసాదమును భగవానునకు నైవేద్య ముగ సమర్పింపవలెను. అనంతరము గృహపరివారముతో కలిసి కథను విని బ్రాహ్మణునకు దక్షిణ ఇవ్వవలెను. బ్రాహ్మణుడు ప్రసాదమును స్వీకరించిన తరువాత తమ బంధు బాంధవులతో కలిసి భక్తితో ప్రసాదమును తీసికొనవలెను. భగవానుని ఎదుట భక్తిపరవశులై నాట్యగానములను సలుపవలెను. అనంతరము సత్యనారాయణ భగవానుని స్తుతించి స్మరించుచు గృహమునకు వెళ్ళవలెను. ఈ విధముగ చేసినవారికి నిశ్చయముగ మనోవాంఛిత ఫలములు ప్రాప్తించును. ఈ కలి యుగమున అభీష్టసిద్ధి ప్రాప్తించవలెనని సత్యనారాయణ వ్రతము చేయుట తప్ప మరే ఉపాయము లేదు.

### రెండవ అధ్యాయము - రెండవ కథ

పూర్వకాలమున ఒక బ్రాహ్మణుడు ఈ వ్రతమునుచేసి కృతకృత్యుడయ్యెను. ఇప్పుడు వాని కథను చెప్పుచున్నాను వినుము. కాశీపుర గ్రామమందు ఒక బీద బ్రాహ్మణుడుండెను. ఇతడు ఆకలి దప్పికలతో బాధపడుచు తిరుగుచుండెను. బ్రాహ్మణ ప్రియుడైన భగవానుడు వృద్ధబ్రాహ్మణ రూపమును ధరించి ఆదరముగ "బ్రాహ్మణోత్తమా! యేల మీరు దుఃఖించుచు తిరుగుచున్నారో చెప్పుమనె"ను. బ్రాహ్మణుడు "నేను చాల బీదవాడిని భిక్ష కొరకు తిరుగుచున్నాను. మీకేదైన ఉపాయము తెలిసిన చెప్పుమ"నెను.

వృద్ధబ్రాహ్మణ స్వరూపములో నున్న సత్యనారాయణ భగవానుడు ఇట్లనెను.

"ద్విజశ్రేష్ఠా! మీరు సత్యనారాయణ వ్రతమును చేయుడు. ఈ వ్రతము చేసినవారు సమస్త దుఃఖములనుండి విముక్తులగుదురు". అనుచు వ్రత విధాన మంతయు బ్రాహ్మణునకు చెప్పి భగవానుడు అంతర్థానమయ్యెను.

అనంతరము బ్రాహ్మణుడు మనస్సులో భగవానుని స్మరించుకొనుచు ఇంటికి వెళ్ళెను. సత్యనారాయణ భగవానుడే నాకీ వ్రతమును ఉపదేశించెను, గాన నేనీ వ్రతము చేయవలెనని ఆలోచించుచు ఆరాత్రంతయు నిదురపోలేదు. ప్రాతఃకాలము ననే లేచి నేను సత్యనారాయణ వ్రతమును చేయుదునని సంకల్పము చేసికొని భిక్షాటనకు వెళ్ళెను. ఆ దినము బ్రాహ్మణునకు చాలాద్రవ్యము లభించెను. దానితో అతడు బంధుబాంధవులతో కలసి సత్యనారాయణ వ్రతమును చేసెను. ఈ వ్రతప్రభావము వలన సమస్త దుఃఖములనుండి విముక్తుడై సర్వసంపదలను పొందెను. ఆనాటినుండి ప్రతి మాసము ఈ వ్రతము చేయసాగెను.

"నారదా! వృద్ధబ్రాహ్మణ రూపధారియైన నారాయణుని వలన వ్రతోప దేశమును పొందిన బ్రాహ్మణుడు పాపవిముక్తుడై మోక్షమును పొందెను. పృథ్విలో ఈ వ్రతము ఎప్పుడు ప్రచారమగునో అప్పుడు మానవుల సమస్త దుఃఖములు నశించున"ని భగవానుడు చెప్పెను.

అని సూతులవారు ఋషులకు చెప్పి "ఇంకేమి వినగోరుచున్నార"ని అడిగెను. ఋషులు "పృథ్వియందు ఈవ్రతము నెవరుచేసిరో చెప్పుమ"నిరి.

"సూతులవారు మునులారా! ఆ బ్రాహ్మణుడు మరొకమారు వ్రతము చేయు సమయమున కట్టెలు అమ్మువాడు ఒకడు అచటికి వచ్చెను. కట్టెలు బయటపెట్టుకొని గృహములోనికి వెళ్ళెను. బ్రాహ్మణునకు నమస్కారముచేసి, మీరు చేయునదేమని అడిగెను. బ్రాహ్మ ణుడు ఇది సత్యనారాయణవ్రతము. ఈ వ్రతము వలన దుః ఖము దరిద్రము నశిం చును. కోరిన కోరికలు తీరును. పుత్రపౌత్రాదులు వృద్ధియగు దురు. ఈ వ్రతము చేయుటవలననే ధనధాన్యాదులతో నా గృహము నిండియుండెనని బ్రాహ్మణుడు చెప్పగా, కట్టెలమ్మువానికి చాలా సంతోషము కలిగెను. దాహము తీర్చుకొని ప్రసాదము స్వీకరించి భగవానుని స్మరించుచు, నేడు కట్టెలమ్మగ ఎంత ధనము వచ్చునో దానితో నేను సత్యనారాయణ వ్రతము చేయుదునని మనస్సులో తలచి కట్టెలు తలపై పెట్టుకొని నగరములో ధనికులుండు రమణీయమైన స్థానమునకు వెళ్ళెను. ఆరోజు కట్టెలమ్మగా రెట్టింపు ధనము లభించెను. ప్రసన్నహృదయుడై బాగుగా పండిన అరటిపండ్లు సెనగలు, నెయ్యి, పాలు, గోధుమరవ్వ మొదలగునవి అన్నియు తీసికొని గృహమునకు వెళ్ళెను. అనంతరము బంధు బాంధవులతో కలసి వ్రతము చేసెను. వ్రతప్రభావమువలన అతనికి ధనము పుత్రులు గలిగిరి. ఇహలోక సుఖానంతరము, సత్యలోకము ప్రాప్తించెను.



## మూడవ అధ్యాయము - మూడవ కథ

సత్యనారాయణవ్రత మహిమ – ఉల్కా ముఖరాజు, సాధువ్యాపారి, వంశ ధ్వజరాజు.

సూతులవారు– "మునులారా! పూర్వకాలమున ఉల్కా ముఖుడను రాజుండెను. ఇతడు జితేంద్రియుడు సత్యవాది గొప్పపరాక్రమశాలి. ప్రతిదినము దైవమందిరము నకు వెళ్ళి బ్రాహ్మణులకు ధనమొసగుచు వారిని సంతుష్ట పరచు చుండెను. ఇతని భార్యపేరు భద్రశిల. ఈమె పతివ్రత పద్మమువంటి ముఖముగలది. మనోహరమైన రూపముగలది. రాజు రాణితోకలసి సముద్రతీరమునకువెళ్ళి సత్యనారాయణ వ్రతము చేయుచుండెను. రాజు వ్రతముచేయుచుండగ ఒకసాధువు అచటికి వచ్చెను. ఇతడు వ్యాపారనిమిత్తము నానావిధములైన రత్నాదులను నౌకయందు నింపుకొని దానిని తీరము చెంత ఉంచి వ్రతము చేయుచున్న రాజు కడకువచ్చి "రాజా! భక్తితో మీరు చేయుచున్న వ్రతమే"మని అడిగెను.

"సాధూ! నేను బంధుభాందవులతోకలిసి విష్ణుభగవానుని పూజించుచుటిని. ఈ వ్రతము వలన పుత్రాది ప్రాప్తి గలుగు"నని చెప్పెను.

"సాధువు రాజునకు నమస్కారముచేసి", ఈ వ్రత విధానమును కూడ చెప్పిన నేనును ఈవ్రతమును చేయుదును, నాకును సంతానములేదు, అని అడుగగ రాజు వ్రతవిధానమును చెప్పెను. సాధువు వ్యాపార కార్యము ముగించుకొని ఆనందముగ ఇంటికి వెళ్ళెను.

కొన్ని దినముల తరువాత ఇతని భార్య గర్భవతి అయ్యెను. అతి సుందరమైన కన్య జన్మించెను. ఈమెగు కళావతి యని నామకరణము గావించిరి. సాధువు భార్య లీలావతి "స్వామీ! మీరు ఇంతక మునుపు సత్యనారాయణ వ్రతము చేయుదునని ప్రతిజ్ఞ చేసియుంటిరి. అది ఎందుచేత చేయుటలేద"ని అడిగెను. "సాధువు భార్యతో నేను కళావతి వివాహసమయమున సత్యనారాయణ వ్రతము చేయుదు"నని చెప్పి, వ్యాపారనిమిత్తము సముద్రతీరమునకు వెళ్ళెను.

కళావతి పెరుగసాగెను. తనపుత్రిక వివాహయోగ్యురాలగుట గాంచి ధర్మము తెలిసిన తండ్రి, బంధుమిత్రులతో ఆలోచించి వరుని అన్వేషించుటకు దూతను పంపెను. దూత సాధువు ఆదేశానుసారము, కాంచన నగరమునకు వెళ్ళి అచట కళావతికి యోగ్యుడైన వరుని వెదకి అతనిని వెంటబెట్టుకొని వచ్చెను. సద్గుణవంతుడు సుందరుడు అయిన వైశ్యకుమారుని గాంచి సాధువు సంతోషపడి తనజాతి బంధువులతో కలసి శాస్త్రోక్తముగ అతనికి కన్యాదానము చేసెను.

దుర్భాగ్యవశమున కళావతి వివాహ సమయములోకూడ ఆ వర్తకుడు వ్రతముచేయుట మరచిపోయెను. అందువలన స్వామికి కోపము వచ్చెను. కొంతకాలము తరువాత వ్యాపార నిపుణుడైన వర్తకుడు తన అల్లుని వెంటబెట్టుకొని

